# ప్రసన్నపాంచాలీయనాటకము.

ఇది

భీమవరములోనున్న మొదటితరగతి న్యాయవాది

తణికెళ్ల పూర్ణయ్య బి. ఏ. చే

రచియింపఁబడి,

మల్లావఝుల వేంకటసుబ్బయ్యచే

ప్రకటింపఁబడినది.

మొదటి కూర్పు.

రాజమహేంద్రవరము.

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1913.

# భూమిక.

చదువరులారా !

కురుక్షేత్ర యుద్ధమైన తరువాత దుర్యోధనుఁడు మడుగులో దాఁగుటయు, అంత శ్రీకృష్ణుని ప్రోత్సాహముచేఁ బాండవు లతనిని త్తి పొడుపుమాటలాడి బయటకు రావించి గదాయుద్ధములో నక్రమ విధంబుగ యదునందనుని పంపున భీమసేనునిచే నతని తొడలఁ దెగ గొట్టించుటయు, తగవరిగ వచ్చుటఁ గూర్చుండిన బలరాముఁడు దానికిఁ గడుం గినిసి పాండవ పాండవపక్షపాతులకు సిగ్గగునట్లు నొవ్వఁ బలికి లేచిపోవుటయు, అంత నశ్వత్థామ క్రోధోద్దీపితుఁడై పాండవవంశ మపాండవముఁ గావింతునని ప్రతిజ్ఞఁబట్టి యర్ధరాత్రివేళ శిబిరములో గాఢనిద్రలోఁ బడియుండిన పాంచాలురఁ నందఱఁ జంపుటయు, ద్రౌపది మూరార్చవచ్చిన యశ్వత్థామపైఁ గసితీర్చుకొనుటకుఁ బాండవు లా యత్తులైనప్పు డప్పరమపతివ్రతాశిరోమణి వారిని వారించి తనవలెనే యశ్వత్థామతల్లిగూడ నింటికడఁ గుమారునికొఱకై వాపోవుచుండు ననియు, ఒకఁ డితరులవలన నెట్లొనరించుకొనఁ గోరునో అటులనే తా నితరుల కొనర్పవలె ననియు వారికి బోధించి ప్రసన్నయగుటయు మున్నుగాఁగల పురాణకథ యీనాటకాంశమై యున్నది. తనకు నిర్భర గర్భశోకముఁ గూర్చిన యశ్వత్థామపైఁ గోపముఁ జెందక ప్రసన్నతా-మహిమను వెల్లడించిన పాంచాలిం గూర్చి యీ నాటకమునఁ జెప్పబడినందున దీనికిఁ బ్రసన్నపాంచాలీయ మనుపేరొసంగితిని.

టచేత నే నట్టివాని నీనాటకములోఁ బ్రప్రథమమున నచ్చటచ్చటఁ బాటించితినిగాని తదితరగ్రంథములలో నట్టివి వాఁడబడ నందున శుద్ధపత్రములో వానికిఁ బాఠాంతరములను నిరూపించితిని. ఈకావ్యము నచ్చొత్తించి ప్రకటించిన బ్రహ్మశ్రీ మల్లావఝుల వేంకటసుబ్బయ్యగారి భాషాభిమాన మెంతయు సంస్తవనీయము, వారికి నేను కృతజ్ఞతా పూర్వకముగ వందనము లాచరించుచున్నాఁడను. మరియు నేను పనితొందరలో నుండినప్పుడు రుజువుకాగితములను (proofsheets) సరిచూచుచు నాకు సహాయ మొనరించిన శ్రీమచ్చ సూర్యరావుగారికిఁ గృతజ్ఞుఁడను. చదువరు లిందలి లోపములను జూపెదరేని సంతోషముగ రెండవకూర్పులో దిద్దుగొనెదను.

భీమవరము,
28-1[illegible]-13.

ఇట్లు
తణికెళ్ల పూర్ణయ్య.

# శుద్ధపత్రము.

| పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- |
| 7 | నీటి | నీరు |
| 3 | కాలి | కాలు |
| 1 | నతి ప్రేముడి | మతిఁ బ్రేముడి |
| 6 | రాజ | రాజు |
| 13 | యీావి | యీా |
| 2 | గూర్చును | గూర్చుండు |
| 17 | పౌరష | పౌరుష |
| 7 | తండ్రికిఁ | తండ్రికా |
| 8 | అప్పును | యప్పును |
| 3 | కూర్చును | కూర్చుండు. |
| 3 | డంటకుఁ | డెప్డునాఁ |
| 4 | అన్న | డన్న |
| 3 | నన్ననరామాట | సన్ననరానిమాట |
| 23 | దైన్యంబునుం | దైన్యంబేమియుం |
| 16 | హరింవ | హరింప |
| 8 | బిక్షుము | భిక్షుము |
| 20 | ఛండాలా | చండాల |
| 6 | బుద్బదము | బుద్బుదము |
| 7 | [illegible] | |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 55 | 7 | సూర్చునియుం | నెమ్మదినుం |
| 56 | 11 | గోదసీకుహారమేవుందక్కి | గోదసికఘుంబౌల్పేది |
| 58 | 6 | దద్వర్థి | ద్వర్థి |
| 64 | 12 | నేకరుడై పొలివుచ్చి | నొక్కుడవై పట్టివధించి |
| 67 | 14 | సారస్వతి | సారస్వత |
| 68 | 16 | మహాత్మ్య | మహాత్వ |
| 69 | 6 | మంగళాస్నా | మంగళస్నా |
| 73 | 6 | డతిప్రే | డెదబ్రే |
| 79 | 17 | నాభికింది | నాభికిం |
| 80 | 9 | జనుంజయా | ధనంజయా |
| 85 | 1 | ధూర | ధూర్త |
| 85 | 15 | హృదయు | హృదయు |
| 95 | 2 | అనేక | అనేకమైన |
| 95 | 13 | దృ | ధృ |
| 99 | 12 | వాగురుల | వాగురల |
| 140 | 19 | తప్వకో | తప్వకో |
| 148 | 3 | తృపా | తృృపా |
| 143 | 21 | నిన్గొలిచి | నిన్గొల్చి |
| 143 | 22 | న్బదేర్ | న్బదెదర్ |
| 144 | 24 | దురుల | దిగుల |
| 152 | 6 | ఇంట్టి | ఇంటి |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 61 | 15 | ఆదోళము | ఆందోళనము |
| 61 | 19 | న్నలరుల | న్నేమముల |
| 61 | 19 | ల్మ్రాయు | ల్మ్రాఱు |
| 61 | 23 | బెడిందపూ | బెడిదంపు |
| 62 | 17 | శిబిబిరము | శిబిరము |
| 63 | 14 | శాలురు | శాలులు |
| 65 | 13&14 | చీరలన్నొలిచి | కట్టుజీరొలిచి |
| 65 | 21 | క్షాత్రా | క్షాత్ర |
| 66 | 11 | సజీవువై | సజీవులై |
| 66 | 15 | న్నెలుగెత్తి | న్నెగులొంది |
| 67 | 10 | ఒరోరి | ఓరోరి |
| 74 | 9 | వృత్తియై | వృత్తిమై |
| 74 | 10 | బడిసి | బడసి |
| 74 | 11 | మొక్కింత | మొకింత |
| 74 | 19 | పోయెను | పోయెనో |
| 74 | 19 | గావి | గాలి |
| 75 | 3 | బయలుకు | బయటకు |
| 75 | 8 | మహాత్మ్యము | మాహాత్మ్యము |
| 76 | 16 | జడువఁగ | జడుపఁగ |
| 76 | 14 | ధర్మముఁ | ధర్మము |
| 77 | 9 | నావలన | నావల |
| 78 | 9 | వర్షయు | వర్షము |
| 85 | 9 | ఘోరయుక్రమము | ఘోరాక్రమము |

## ఈనాటకమునందు వచ్చు పాత్రలు.



### పురుషులు.

సూత్రధారుఁడు

దుర్యోధనుఁడు — కౌరవరాజు.

అశ్వత్థామ — కథానాయకుఁడు. }
కృపాచార్యుఁడు } రథికత్రయము
కృతవర్మ }

సంజయుఁడు — ఒక బ్రాహ్మణుఁడు.

ధర్మరాజు }
భీముఁడు }
అర్జునుఁడు } పాండవులు.
నకులుఁడు }
సహదేవుఁడు }

మొదటికిరాతుఁడు

రెండవకిరాతుఁడు

బలరాముఁడు }
శ్రీకృష్ణుఁడు } సోదరులు.

నక్తంచరుఁడు — రాక్షసుఁడు

ముసలిభటుఁడు

### స్త్రీలు.

నటి.

ద్రౌపది — పాండవపత్ని.

ఓం.

బ్రహ్మకృపాహి కేవలం.

# ప్రసన్న పాంచాలీయ నాటకము.

## నాంది.

అణువై యున్నతమై మహావిపులమై ♦ యాద్యంతశూన్యంబునై
గుణధామం బయి నిర్గుణాకరమునై ♦ ఘోరోజ్వలాకారభీ
షణమై భక్తజనాళిరక్షణమునై ♦ సద్ధర్మసంస్థాపనా
చణమై యొప్పెడు మూలశక్తి మిము న♦శ్రాంతంబు రక్షించుతన్.

సురలుం గెల్వఁగలేనిశాత్రవుఁడు తే♦జోదర్పసంరంభభీ
కరుఁడై యెక్కటికయ్యము న్సలుప నీ♦గాఢాంధకారంబునం
దిరవుం జొచ్చి యరాతికుత్తుకను ఖం♦డింపంగ యత్నింప నీ
వరభక్తుం దయఁ బ్రోచు నీశ్వరకృపా♦పాథోధి మిమ్మోముతన్.

పుడమిసమస్త మేలినవి♦భుం డిఁకఁ దిక్కఁటి పాడుచెర్వులోఁ
బడి తల దాఁచియుండఁ గని♦ బైటకు నీడ్చిన దేది? యంత బెం
డొడలను నుగ్గుఁ జేసె నెది? ♦ తోడ్తనె తండ్రులఁ గాచి పుత్రులఁ
గడపిన దేది? యట్టివిధి♦కృత్యము నెన్ని భజింతు నీశ్వరున్.

( నాంద్యంతమునఁ బుష్పాంజలిఁ జల్లి)

సూత్రధారుఁడు—ఓహో హో! ఏమి నాపుణ్యము! నేఁటిరాత్రి ప్రసన్నపాంచాలీయనాటక మీనర్తకశాలలో నాడఁబడు నని ప్రకటనాముఖంబున నాహూయమాను లయి నాయందుఁ గల

కాని, నే నొక్కఁడ నీప్రదర్శన మెట్లు నిర్వర్తింపఁ గలను ? నాప్రియురాలిం బిలిచి నాకు సహకారిణిగా నుండ నియోగించెద. ( ప్రక్కలఁ జూచుచు ) ప్రేయసీ ! నీవు పూర్ణాలంకృత వైనచో నొకసారి యిటురమ్ము.

[ ప్రవేశము — నటి ] పాట.

నటి—నాథ ! నాథ ! మీర లిటకు నన్నుఁ బిల్వఁగా
హేతు వేమొ తెలియఁజెప్పఁ డేమిసెలవొకో॥
ఓహొహో యేమిసెలవొకో॥
నాటకాలయంబు నెల్ల నవ్యవైఖరిన్
డంబుమీఱుపచ్చతోరణంబు లొప్పెడున్॥
తోరణంబు లొప్పెడున్॥
రమ్యమైన తెరలఁ గ్రొత్తరంగు లీనుచుం
గనులపండువుగను వెల్గు గాలిదీపముల్॥
ఓహొహో ధూమదీపముల్॥
సూరిజనులు వచ్చి రిటకుఁ జోద్య మేమొకో
సరససామగాన మెంతొ జానుమీఱెడున్॥
ఓహొహో జానుమీఱెడున్॥

నాథా ! ఇప్పు డింతతొందరగా నన్నుఁ బిల్చుటకుఁ గారణ మేమియో యీమీదాసురా లెఱుంగవచ్చునా ?

సూ—ఆర్యా ! నేటిరాత్రి ప్రసన్నపాంచాలీయనాటక మాడఁబడు నని భేరి మొదలుగాఁగలవాయిదంబులతోఁ బగ లెల్లఁ బుర మంత యు బ్రకటింపఁబడియుండ నన్నుఁ గారణ మడిగెద వేల ?

నటి—సరిసరి ! ఆర్యపుత్రా ! అందుకే యైనచోఁ బాత్రముల నే నిది వఱకే సిద్ధపఱిచి యుంచితి నిఁక జాగు సేయ నేల ?

సూ—వెఱ్ఱిదానా! అట్లనరాదు క్రొత్తక్రొత్త చిన్నిచిన్నివన్నెలం గులుకు చున్ననవాంధ్రవధూటిని మన మెట్లు సంతోషపఱుపఁ గలము?

నటి—నాథా! గ్రంథరచనయం దారితేఱిన మహాకవులే కదా యీ మనసదస్యులు?

సూ—ప్రియురాలా! ఔదార్యగుణైకస్వభావమనస్కు లగునీసదస్యులను జూచుటచేతనే నాకు మఱింత ధైర్యము కలుగు చున్నది. ఏమందువా?

చ. పయమును నీరముం గలుగు•భాండమునుండి మరాళ మొప్పుగాఁ
బయము నెక్రోలి నీరమును• బట్టనితీరున నిందు నొప్పునే
కయికొని తప్పు వీడుదురె• కాని యహంకృతిఁ దప్పు నొప్పుగా
నయినది కాని దంచు నన•యంబుగఁ జెప్పదురే మహాకవుల్.

అందు మఱొక్క విశేష మున్నది. అ దేమందువా?

చ. వినినకొలంది వీనులకు• విం దొనరించుచు బంచమాగమం
బనఁ దనరారు భారతక•థాంశము నాటకవస్తు వయ్యె నీ
వినియెడివారు పండితులు •విశ్రుతకీర్తి గలట్టివారు ఖే
లన మొనరింతు రీకవివ•లంతి యిఁ కేల భయంబు నెచ్చెలీ!

నటి—ఆర్యపుత్రా! భూతలస్వర్గమో యనునట్లు విరాజిల్లు చున్నయీ నాటకశాలయం దిందఱుమహనీయులు సభఁ జేసి కూర్చుండి యున్నను నింకయు నేదియో కొఱఁతయే కన్పడు చున్నది. కారణ మేమియో కదా!

సూ—ఆర్యా! ఆకొఱఁత యిఁకఁ దీఱునది కాదు సుమీ! ఏమందువా?

సీ. లేమిచేఁ జదువంగ ♦ లేనివిద్యార్థుల
కిరవుగాఁ జదువుఁ జె♦ప్పింపఁ గలిగెఁ
బంగ్వంధబధిరుల♦పై జాలి వహియించి
యన్నవస్త్రము లిచ్చి♦ ఖ్యాతిఁ గొనియె
సతులఁ బరీక్షించు ♦ సంఘంబు నియమించి
స్త్రీవిద్య నభివృద్ధిఁ ♦ జేయఁ గలిగె
నీతి లేని మతము ♦ నిరుపయోగము కానఁ
బూర్వులమతమునే ♦ బోధపఱిచె
ప్రాణమైన నొసంగు దే♦శాభిమాని
నిమిష మీకవి వీడని♦నేస్తకాఁడు
ఇద్ధ కీర్తివిశేషుఁ డా ♦ బుద్ధిరాజు
పావకేశ్వరుం డిటఁ గానఁ♦బడఁడు నేఁడు.

నటి — అవు నవును. గతుండు రాఁడు కదా! ఆర్యపుత్రా! మఱి యీనాటకమును రచించినవా రెవరు?

సూ — గీ. కోవిదు లెవనిపైఁ గల♦ కూర్మిచేతఁ
గవితఁ జెప్పఁగలాఁ డంచుఁ♦ గను వచింతు
రట్టి తణికెళ్ళ కామయా ♦ హ్వాయుఁడిచ్చిన్న
కొడుకు పూర్ణయాభిఖ్యుండు ♦ గూర్చెఁ దీని.

ప్రియురాలా! మన మిఁక నాలస్యము జేయరాదు మనము నాటక మాడుచున్న యీవేసవికాలముఁ గూర్చి యొకింత వర్ణన జేయుము.

నటి—సీ. ఉదయంబుమాత్రమే ♦ యుంచిన బడినుండి
బాలకు లిండ్లకుం ♦ బరుగు లిడఁగ
చలువచప్పర ముందు ♦ నిలయంబు లరయుచు
బాటసారులు వేగ♦ పడుచు నడువ
బహుపక్షిజాలము♦ ల్పాదపంబులమీఁద
వేఁడినిట్టూర్పుల♦ న్విడుచుచుండఁ
గలవారు చారుచ♦ర్చలఁ గూర్చి నీటిమ
జ్జిగలతో మేలిండ్లఁ ♦ జేరుచుండ
వెచ్చ వీచు వీవన_పైని♦ విసుగు దోఁప
ఘర్మబిందువు లొడలిపైఁ ♦ గ్రమ్ముచుండ
పగలు నిడుదయై రాత్రి హ్ర♦స్వమ్ము గాఁగఁ
గనలుచున్నది వేసవి♦ కాల మహహ.

సూ— ఓహో హో! ప్రియురాలా! ఏమి నీ స్వభావోక్తి! మఱి.
నే వర్ణించెద నాలకింపుము.

గీ. సంపెఁగ సువాసన సహించు♦ శక్తి లేక
తుమ్మెదలు మల్లెపొదరిండ్లఁ ♦ దూరఁ జొచ్చె
ధర్మజునిశక్తి కెంతయుం ♦ దాళలేక
తాను రారాజు మడుఁగులో దాఁగునట్లు.

ప్రేయసీ! మన మిఁకఁ బోయి ప్రదర్శనకార్యము జయప్రదముగ
నిర్వర్తింతము రమ్ము.

( ఇద్దఱు నిష్క్రమించుచున్నారు. )

ఇది ప్రస్తావన.

శ్రీ

# ప్రసన్న పాంచాలీయ నాటకము.

## ప్రథమాంకము.

ప్రదేశము:—కృష్ణద్వైపాయనహ్రద ప్రాంతము.

ప్రవేశము:— దుర్యోధనుఁడు

దుర్యో—(విచారగ్రస్తుఁడయి నిట్టూర్పు విడిచి) అక్కటకటా! ఏమి విపరీతకాలమహిమ! ఓడలు బండ్లగును బండ్లు ఓడలగును.

మ. శరసంధానకళావిశారదము శశ్వత్కీర్తిసంరంభ ము
ద్ధురతేజోబలశౌర్యధుర్యము లసద్ద్రోణాపగాసూనసం
భరితోత్సాహము సైన్యమధ్య వసతిం బ్రాపించి రారాజు భీ
కరకాలవ్యతిరేకవాయునిహతిం గ్గాసిల్లె వృక్షాకృతిన్.

హాహా! భగవంతుఁడు నాహృదయము నేదియో కఠినమయిన ఱాయిచే నిర్మించెఁ గాఁబోలును; ఏలయన—

గీ. వీఁక నాపముఁ జేతఁ బట్టి సమరోర్వి న్విహ్వరుద్రాము ల
స్తోకప్రాభవలీల మెచ్చఁ బగఱ న్శోలించు సామర్థ్యతన్
సాకుం గన్నులపండువై వెలుఁగు సన్మాన్యుండు గాంగేయుఁడే
నాకడ్డ బేగఁగ గుండియ ల్పగుల వన్నా! గ్రావతుల్యంబులై.

(తలఁ బంకించి) ఇంతకు నాబుద్ధిభ్రంశమే న న్నింతవఱకుఁ గొనితెచ్చె ననుటకు సందియము లేదు ఏలయన—

శా. స్వైరస్వాంతముతోడ సామజము కాసారంబున న్జొచ్చి త
త్సారక్షోభముఁ జేసి తుండమునఁ గంజశ్రేణులం దున్మి దు
ర్వారం బైనవిధంబు తోఁప విమతవ్రాతంబులం గూల్చు స
ద్ధీరగ్రామణి ద్రోణుఁ డీల్గె నన సంధిం జేయనైతిం గదా.

కటకటా! ఏకాదశాక్షౌహిణీశుఁడనయి, సకలసామ్రాజ్యసంపన్నధురీణుఁడ నయి, ఘనదోస్సారసమేతుఁడ నయి, తుట్టతుద కిట్టియిక్కట్టునం బడి యేకాకి నయి తిరుగాడుచుంటిఁ. చేసిన యుద్ధసన్నాహ మంతయు బూడిదఁ బోసిన నేయివలెఁ బరిణమించె. బంధుమిత్రసుతానుజన్ములఁ గోలుపోతిని ఇత్తఱి నాచరణీయం బగుకృత్య మేదియుఁ గానరాకున్నది. అక్కటా! ఇట్టివిషకాలమున నాదండనాగాధేయుఁ డుండినచో నాకు గోరంతయిన వంత జనించునా? ఔరౌరా! అనన్యశత్రురాజన్యభీకరోరుపరాక్రమప్రభాభాస్వంతుఁ డగుసూతసుతునిఁ దలంచినంతమాత్రాన నొడలు నిలు వెల్ల నీ రగుచున్నది ఇంతకు నేను వట్టిమందభాగ్యుఁడను.

ఉ. దట్టముగా హృదంతరముఁ దార్కొని పాఁకినతృష్ణయ న్లతన్
గట్టిగఁ బెంచుకంబ మనఁగాఁ దనరారి తదీయరక్షకుం
బెట్టనికోట యై ఫలదభీష్టము నిచ్చెడిపుష్పగుచ్ఛ మై
దిట్టరి యై కిరీటిని నెదిర్చినకర్ణుఁడు నాకు దక్కునే.

ఔరా! ధర్మరాజా! నీధర్మ మింతటిదే కదా! పోనిమ్ము; యుద్ధరంగమున నీప్రవర్తన మంతయు నలువురకుఁ దేటతెల్లమయి

నందుకు మాత్రము నాస్వాంత మొకవిధ మయినయూరటం
బొందుచున్నదిలే. ఏలయన—

ఉ. పాడిఁ దొఱంగి ధర్మజుఁ డిభంబు నెపంబున ద్రోణి చచ్చె న
న్వేడి యసత్యవాక్యముల వీనులవిం దొనరించినప్పుడే
వాఁ డతిసత్యసంధుఁ డని పాడినకీర్తిని సున్నచుట్టి తా
నోడెను యుద్ధమందున సుయోధనుఁ డింతకు వంత యేటికిన్.

ఓహోహో! అశ్వత్థామ యనుకుంజరము చచ్చె నని ద్వ్యర్థిగాఁ
జెప్పు టఘము కాదని నీవును కృష్ణుఁడును నంతరాత్మలను
దృప్తిపఱచుకొని కులుకుచున్నారు కాఁబోలును. ఇట్టిదే
పాపము కానిచోఁ బ్రపంచములో నిఁక నసత్యదోషమే లేదు.
ఇంతకు నిన్ననవలసినపని లేదు. దుర్వర్తన ముగ్గుఁబాలతోఁ
గ్రోలిన యామాయలమారి కృష్ణుఁడేకదా స్వచ్ఛమయిననీకీర్తి
నంతయుఁ గలంకముఁ గావించినాఁడు. ఇంక జయాపజయము
లొకలెక్కలోనివి కావుసుమీ! ఏలయన—

చ. ముకుకుందసంపుఁ జేష్టలకుఁ దోఁపుటిల్లు యసత్య మన్ననో
తొడిఁబడనట్టిధీరుఁ డల నొంగతనంబునఁ బాఁతకన్నగాఁ
ముదుకువ లేనికాముకుఁ డగ్రోకుఁజుఁ గూడినవాఁడ వాటచే
నదరి యబద్ధ మాడి విజయంబును గాంచితి వింతె ధర్మముల్.

కకుబంతములు బీఁటలువాఱునట్లు వాయిదములు మ్రోయించినంత
మాత్రాన నీదోష మెవ్వరికయినఁ దెలియ దనుకొంటివి కాఁ
బోలును. భేరిని జోఁకొట్టఁ బూనినవెఱ్ఱివాఁ డెవఁ డన ధర్మ
రాజే సుమీ! అకటా! ద్రోణాచార్యా! మహాశూరుఁడ
వయిననీ వాయనృతవాక్యముల నేల సరకు సేసితివి?

మత్తకోకిల. కాలధర్మము నొందె ద్రోణుఁడు! ♦కన్నబిడ్డఁ డటన్నచో
వాల మావలఁ ద్రోసివైచిన♦వచ్చునే మృతుఁడైనవాఁ
డాలమందునఁ బోటుమానిసి ♦కాలిబిడ్డలు లక్ష్యమే
గేలిఁ గొట్టరె? యుద్ధమందుఁ జి♦గీష వీడినవీరునిన్.

ఓభీష్మాచార్యా! సురలకయిన నజేయుండవని నిన్ను నమ్మినందుకు బాగుగఁ జేసితివిలే.

గీ. శూలినైనను నెదిరింపఁ ♦జాలు దనుచు
నమ్మి దళ మంత నీయనే♦నంబుఁ జేయఁ
గెల్వఁ గల్గి శిఖండినిఁ ♦గెల్వ వకట!
కంచె చేన్మేయ నేరికిఁ ♦గంచె దిక్కు.

మఱియు నోదేవవ్రతా! తాతా!

గీ. నడుమఁ బురుషత్వ మొందిన♦నరునితోడ
యుద్ధ మొనరింప నని వ్రత ♦మూనియుంచి
నడుమఁ బురుషత్వ ముడిగిన♦నరునితోడఁ
గదన మొనరింప నేలకో! ♦గడుసుతాత.

ఇప్పుడు వీరినన్న లాభ మేమి? కాని యొక్కటిమట్టుకు ధాష్టిగాఁ జెప్పవచ్చును. ఏమన—

గీ. వ్రతము విడనాడి భీష్ముఁడు ♦ప్రదర మొకటి
పగతుఁ డాశిఖండిపయినిఁ ♦బఱపియున్నఁ
గురుఁడు మతిమంతుఁడై పోరఁ ♦గూడియున్నఁ
గౌరవులకు జయంబు చే♦కూరకున్నె.

ఇఁక రాధేయుఁ డన్ననో! మేలు కర్ణా! మేలు!

ఉ. చిన్నటనాఁటఁగోలె నతిప్రేముడిఁ జూచుచుఁ బెంచి పెద్దగా
మన్ననఁ జేసి విద్య నసమానముగాఁ గఱపించి రాజ్యసం
పన్ను నొనర్చినందు కిలఁ బ్రాణము కంఠము నుండుదాఁక పె
న్నన్నగఁ బోరినా వనిని మెచ్చితి నీ దగుస్వామిభక్తికిన్.

మఱి యిఁక జయాపజయముల కేమికాని—

గీ. పరఁగుఁ గెల్పోటములు దైవవశము లగుచు
ననుచు మది నమ్మి శక్తివంచనము లేక
సమరతలమందుఁ బోరాడి స్వామిఋణముఁ
దీర్చినట్టికర్ణుఁ డొకఁడె ధీరజనుఁడు.

(అంత నేపథ్యమున దుర్యోధనుని భార్య భానుమతి మొఱలిడుచున్నది)

భాను—హా! ప్రాణేశ్వరా!

ఉ. పమ్మినశోకభారమునఁ బత్నికి భాగముఁ బెట్ట నొల్లకీ
వి మ్మెయి నీయనుంగుసతి నిమ్మెడ నొంటిగ వీడి పోతివే
జుమ్మలు చుట్టు దుఃఖమున స్రుక్కుచు నివ్విధి నుండుకంటె దే
హమ్మును వీతిహోత్రునకు నాహుతిఁ జేసి పతిం గనం దగున్.

దుర్యో—(ఒయ్య లాలించి) ఊఁ (తలపంకించి) మదీయప్రేయసి యగుభానుమతి వియోగబాధ సైరింపఁజాలక నన్నుఁగూర్చి విలపించుచున్నది. ఈమహనీయగుణశీల నన్నుఁ జేపట్టినది మొద లరనిమేషమయిన నన్ను వీడి యొంటిగ మసలినదికాదు. ఓహృదయేశ్వరీ!

మ. సిరి జన్మించినగేహమై స్మరునిచే సింగారపుంబాణమై
పరపై తేనెలఁ గ్రోలుపాత్ర మయి చల్వం జిమ్ము రేతేనితో

సరిహైరాఁ చెన్నెలరారు నీముఖవిలాసం బీవిధి న్దుఃఖసా
గరము న్ముంచిన పాతకుం డకట ని న్గాంచంగ శక్తుండొకో!.

మఱియు నోచిలుకలకొలికీ !

గీ. దుఃఖనామకసరసిలోఁ దోఁగుచుండి
మగువ ని న్జూడ నెంతయు న్మనసుఁ గల్గి
కదలనేరక యున్న దీకాయ మేమొ
తొడలు తెగి భూమిపైఁ బడ్డ జడిమతోఁప.

ఇట్టి వ్యర్థమానవుఁడు బ్రతికిన నేమి బ్రతుక కేమి ? (కొంచెము ముందు నడచి) ఔరా! శోకసంతప్తహృదయుండ నొయి కడచి దానిం గూర్చి చింతించుచు మైమఱచి యీకృష్ణద్వైపాయ హ్రదము సమీపించితి కాలవిపర్యయంబునం జేసి దేహి దేవుఁ డనుకూలుఁడు గానిచోఁ బ్రకృతి వికృతిగాఁ గన్పడు చుండును ఏలయన —

మ. త్వరితోత్సాహరవంబులన్ భ్రమరయోధవ్రాతము ల్సల్ప బ్ర
స్ఫురదంభోజరజంబు వాయుసుతసంక్షోభంబునం బర్వఁగా
శరవిచ్ఛిన్నహృదంతరాళగురుభీష్మం బైనయీచెర్వు దు
స్తరయుద్ధోర్వివలె న్భయంకరమనస్తాపంబుఁ గల్గించెడిన్.

(అంత నొకప్రక్కఁ జెరువులో విహరించుచున్న యొకతుమ్మెదను జూచి)
ఓహో ! తుమ్మెదదిమ్మరీఁడా !

మ. బలిమి న్గుత్తుకబంటిగా మధువు నాపాయంబుగాఁ గ్రోలి మ
త్తిలి తృప్తిం గనకుండి సారసములం దే వ్రాలుచున్నావు; క్రొ
న్నెలయ న్గష్టపువేళఁ దమ్ముకొలె సుమీ ని న్బందిలోఁ ద్రోతు
చెలి! దుఃఖంతు దురాశ దుఃఖకరమం చాచంద్రము న్నావలెన్

ప్రథమాంకము

( మఱియొకప్రక్కఁ దూఁడు మేయుచున్న యొకరాజహంసను జూచి )

మృణాలములు మేయుచున్నయోరాజహంసమా! నీకుఁదామర తూఁడే మృష్టాన్న మయ్యెనా? ఔనౌను. విధిలిఖిత మలంఘ్యమే సుమీ!

గీ. అధికసామ్రాజ్యసంపన్నుఁ డైననేను
మతి కలంగి యేకాకి నై మసలు టేల?
చదువుదొర మోసికొనిపోవు జాల పాద
మెనసి తూఁడులం గప్పు నిండింప నేల?

( అంత నేపథ్యమున నశ్వత్థామ కేకల నిడుచున్నాఁడు )

అశ్వ — ఎందెందు వెదకిచూచినను దుర్యోధనమహారాజు కానరాఁడుగా?

శా. సప్తాంభోధిపరీతభూవలయ మాక్రాంతంబు ఘూర్ణిల్ల వి
క్షిప్తోన్మేషభయంకరోడుతతి నిశ్శేషంబుగా డుల్ల సం
తప్తీభూతసుపర్వసంచయము విస్తారంబు ఘోషిల్లఁగ
న్దృప్తుం జేసి సుయోధనుం గనియెద న్నిర్ధూమధాముండ నై.

దుర్యో — అడుగో! క్రోధోల్లసితమూర్తి యయి నన్నుం గానరామి కనంతమత్సరవిషాదం బొంది మండిపడుచు ద్రోణా యని యీ దెసకే వచ్చుచున్నాఁడు. ( ఇటునటు జూచి ) ఇమ్మహాశూరు నితోఁగూడ కృపాచార్యకృతవర్మలు వచ్చుచున్నారు. ఇప్పటి కీరధికత్రయము మాత్రము జీవించియున్నట్లు స్పష్టము. వీరినిఁ జూచినతోడనే నామనంబున నింకయు నొకవిధమయినయాశ కలుగుచున్నది. ఇమ్మువ్వురుఁ గూడినచోఁ బాండవనాశ మగుటకు సందియము లేదు. కాని, నా కేటి కీర్తికోరికలు? ఇమ్మహనీయులు భీష్మద్రోణులకన్న నెక్కువవారా యేమి? కాని, ఇమ్ముగ్గురిలో నొకయశ్వత్థామమాత్రము తాఁ బూనిన

కార్యము నెఱవేఱువఱకు నిద్రపోవువాఁడు కాఁడు. స్వామి భక్తియందు సూతసూతికంటె నెక్కువవాఁడు కాకపోయినను సరిసమానుఁ డని చెప్పవచ్చును. ఏమయిన నేమి ? ఇప్పుడు న్నాకుఁ గర్తవ్య మేమి ? యుద్ధపరికరము లేమియు లేవయ్యె. ఏవిధమునఁజూచినను పోరొనర్చుట యసందర్భముగాఁ దోఁచు చున్నది. ప్రస్తుతము వీరికిఁ గానరాకుండ నే నీమడుఁగులోఁ దాఁగియుండెద. ( అని దుర్యోధనుఁడు పోయి హ్రదములో దాఁగుచున్నాఁడు.)

[ అంత సక్రోధుఁ డయి అశ్వత్థామ "సప్తాంభోధి" యనుం వెనుకటి పద్దెమును జదువుచు గృపాచార్యకృతవర్మలతోఁ బ్రవేశించుచున్నాఁడు ]

అశ్వ — మామా ! అదిగో ! కృష్ణద్వైపాయనహ్రదప్రాంతముఁ దరి యఁ జొచ్చితిమి ఇంతవఱకు దుర్యోధనునిజాడ ... నకుం దెలియదయ్యె. ఈప్రదేశము నిర్జనమయి యున్నది ఇచ్చట మన కాతనియుదంతముఁ దెల్పువా రెవరు ? ( దూరము జూచుట నభినయించి) మామా ! చూడుము ! ఆచూపు మేర దూరమున నెవ్వరో పాఱిపోవుచున్నట్లు కనఁబడుచున్నారు ! ఓ జనులారా !

॥ శక్రప్రాభవసన్నిభుఁడు సకల...ద్మా దేవలోల్లాసి ని
ర్వక్రాభీలపరాక్రమక్రముఁడు శ...ర్వస్థైర్యధుర్యుండు భూ
చక్రాపాదితబాహుయుగ్మuఁడు యశ...స్సాంద్రుండు రారాజు ని
ర్వక్రాంతిం గని పోయినట్టిపథము ...న్వేగం గటాక్షింపుఁడీ॥

కృపా — కుమారా ! యుద్ధరంగమున ధర్మరా జేసిననిష్ఠురశక్తిబాణ మున కోర్వలేక వారు పలాయితు లగుచున్నారు.

అశ్వ—మామా! అటులనే తోఁచుచున్నది. వారు నిరుత్తరు లయి యూడనిఁ బాడుచున్నారు; చూడుము. ఔరా! ఎంతకష్ట మెంతకష్టము. ఓపారిపోయెడి భటులారా!

ఉ॥ తుంగభయోరుపావకము • దుస్సహమై వని జుట్టుముట్టి కా
ల్వం గని పుచ్ఛము ల్మడిచి • ప్రాణము దక్కఁగఁ బారిపోవుసా
రంగములట్లు పర్విడి ప • రాభవ మొందుటకంటె ధీరతన్
సంగరమందుఁ జచ్చి ధరఁ • శాశ్వతకీర్తిని నిల్పు టొప్పదే?

కృపా—కుమారా! వా రేమి చేయఁగలరు? రారాజు కానరాఁడయ్యె. పాండవబలంబు మిక్కుటమై యుండె వేఱే దిక్కునుం గాంచక యిట్టిమార్గము నవలంబించుచున్నారు.

అశ్వ—అట్టిమాటలు నీబోఁటిమహాశూరున కుచితములు కావు సుమీ. దిక్కు లేకేమి; అశ్వత్థామ చచ్చెననుకొనిరా యేమి?

ఉ. ఓయవివేకులార! విను • డోకురుయోధవరేణ్యులార! ద్రో
ణాయని జీవితుండను; పరి • ణామము కల్గును పారిపోకుఁడీ!
కాయ మ దెన్నఁ డెచ్చటనో • కట్టెలపా లగు దానిరక్షకి
న్నీ! యవమానముం గలుగ • సిగ్గుఁ ద్యజించి యశంబుఁ గూల్తురే!

ఔరా! నామాటలఁ జెడచెవులఁ బెట్టి యథేచ్ఛగ దమతమపిక్క బలంబులఁ జూపుచున్నారు ఓవివిధరాజవరేణ్యులారా! రా రాజునకుఁ బాసట సేయవచ్చినధైర్యశాలురు మీరేగా? ఓ హా హా! ఎంతవిపరీతకాలము సంభవించినది?

ఉ. భారతమాతగర్భమునఁ • బ్రాభవమందినరాజు లక్కటా
వీరము వీడి భూసుఖముఁ • బెల్లుగఁ గోరి సమీకసత్కళా
చారము వీటఁ బుచ్చి వెలు • చం బరువెత్తఁగ బ్రాహ్మణుం డప
స్మారులు! పోకుఁ డంచుఁ బలి • మాలెడికాలము సంభవించెఁగా!

కృత—ద్రోణాయనీ! భయకంపితచిత్తులై ఎవరిప్రాణములను వారు కాపాడుకొనుటకయి నల్దిక్కులం బర్వ లిడుచున్న వారి నన్ను లాభ మేమి? ప్రస్తుతము దుర్యోధనుని వృత్తాంత మరయుదము.

అశ్వ—(ఖిన్నమనస్కుఁడయి) అవునవును. కౌరవనాథుఁడే లేనిచో నా కీప్రయాస మేల?

మ. మహిచక్రంబు సమస్తముం దనకుసామ్రాజ్యంబు గాఁ గోరి తా
సహజన్మాళిని బంధుమిత్రసుతులన్ సర్వంబుఁ గోల్పోయి దు
స్సహసంబాధముఁ జెంది పోయిన యశస్సాంద్రుండు దుర్యోధనుం
డిహలోకంబున లేనిచో రిపుల సాధింపంగ నా కేటికిన్.

హా! దుర్యోధనమహారాజా! నిన్నొంటరిం జేసి మోసమార్గమున యదునందనుఁడు చంపించియుండఁడు కదా! అటు లయినచో దివిజలోకనివాసుఁ డయిననాతండ్రితో ని ట్లనుము.

చ జనకు సధర్మమార్గమునఁ జంపినరీతి నెఱింగియుండియుం
దనయుఁడు తత్ప్రతిక్రియ నొనర్పఁ డనాథవిధంబు నంచు నె
న్మనమునఁ జింతఁ దక్కు మనుమానము లేదు; సుతుండు పార్థ దుం
దునియలు జేసి మీమది సుతోషముఁ గూర్చు నటంచుఁ జెప్పుమీ.

మఱియు నాకు మాఱుగ నాతండ్రితో ని ట్లనుము రాజా!

చ. తనయునిచావు వీనులకుఁ దాఁకిన బుద్ధి కలంగి చాపముం
గనరుగ వీడి యుద్ధమునఁ గాంక్షయు మాలి సుయోగనిష్ఠులై
పనివినియున్నతండ్రి నల పార్షదుఁ డేచి శిరంబుఁ బట్టి తు
న్మనవిధ మంత నా కెపుడు మిక్కిలి సల్పును పక్కబల్లెమై.

కృపా—గురునందనా! నీ కింతవెఱ్ఱి యేల? దుర్యోధనునిపయిఁ గల ప్రేమాతిశయమునం జేసి నీమనస్సు పరిపరివిధంబులఁ బోవు చున్నది కాని వేఱొండు కాదు.

అశ్వ—మామా! ప్రేమాతిశయ మనుచుంటివా?

సీ. కోమ రొప్పు తననిందు • కొల్వులో నాతండ్రి
నరులపాలిటిమిత్తి • యనుచు మెచ్చె
భీష్ముఁడు కూలుచో • వృద్ధుఁ డౌ నాతండ్రిఁ
బాటించి సైన్యాధి • పతిని జేసె
బద్దుమాటలచేతఁ • బవరము న్నాతండ్రిఁ
దున్మాడ నెంతయో • దుఃఖపడియె
నీశ్వరునైనను • నెదిరింపఁ దగు దంచుఁ
బిన్న నౌ నాపైని • బ్రియము నెఱపెఁ
దండ్రికొడుకుల నెప్పుడుం • దనివితీర
సకలవిధముల సన్నుతి • న్సలిపినట్టి
అధికదయుఁడగు రారాజు • నరయలేక
ప్రాణములఁ గండ్ల నిడికొని • బ్రతికి యుంటి

కృపా—ద్రోణాయనీ! దుర్భర మయిన నీవిషాదము మాకుఁ గూడ దీనత్వముఁ గల్గించు చున్నది సుమీ!

చ. అరసితి మెల్లతావులఁ గ•లట్టి మహావనసీమలందు మే
మిరువుర మెన్నియో పడితి • మొందటినో కనుఁగొంటి మేకడం
గురుపతిఁ గానరాఁ డకట! • క్రుమ్మరు టెల్లయు రిత్త యయ్యె నీ
చెరువున లేనిచో నతఁడు • చెల్లె నటం చిఁక నెంచఁగాఁ దగున్.

కృత—ద్రోణనందనా! ఈసరోవరప్రాంతమున నెందునను దుర్యోధనుఁడు కానరాఁ డయ్యె. అకటా! దుర్యోధనా! నీ [illegible] పాటు సంప్రాప్త మయ్యెనో కదా!

చ. విదితపరాక్రమాఢ్యు లగు♦ వీరవరేణ్యులఁ గోలుపోయియు
న్మది సహియించి యెట్టటులో ♦ మానిసిలాగు నటించి గుండియల్
కదలనిజాళ్ళు గాగఁ దన♦ కాలము నీడ్చుచుఁ గూలియున్నయా
ముదుసలిచీకురాజు కురు♦ముఖ్యుని చావును విన్న నిల్చునే.

కృపా—ఓవాయునందనా! భీమసేనా! ఇంతటితో నయిన నీచలము తీఱినదికదా?

ఉ. ఒద్దిక నిచ్చగింపక మ♦దోద్ధతి నెంతటివారినైనఁ బ
ల్లద్దిని బట్టి కూల్తు నని♦ కండబలంబుఁ జలంబుఁ జూపుచున్,
దద్దయుఁ జే గదం దిగిచి ♦ ధారుణిఁ గంపముఁ జెందఁ జేయునా
గద్దఱికాఁడు భీముఁ డల♦ కౌరవనాథునిఁ జంపె నేమొకో.

కృత—ఆచార్యోత్తమా! అది సరి యయినయూహ కాదని తోఁచుచున్నది. ఏమందురా?

చ. వేల నతిక్రమించి విను♦వీధిని ముంచెడుశౌర్యవార్ధిఘం
బోలి మహోద్భటాహవవి♦భూతిఁ దనర్చి విపక్షపక్షమున్
లీలశిలీముఖాళి నవ♦లీలగఁ గాడఁగనేయుక్రీడిచేఁ
గూలును కాని భీముఁ డనఁ♦ గొంకఁడు లక్ష్యము సేయఁ డింతయున్

అశ్వ—కృతవర్మా! విషవ్యచ్ఛునిసాహసగుణము నంత బెండు చేసి పల్కుటకు వీలు లేదు సుమీ! ఏమందువా?

సీ. అల శిఖండిని ముందు♦ నెలకొల్పి భీష్మునిఁ
గూల్చుచోఁ గటకటం♦ గొఱలినాఁడు
ధృతి చెడి సమరంబు ♦ మానినవానినిఁ
జంపఁగా వలదంచుఁ♦ జాటినాఁడు

అరదంబు దిగబడ్డ • సరిసేయ దిగువాని
పై నేయఁ దప్పించుఁ • బల్కినాఁడు
పాడిఁ దప్పి చరించి • ప్రధనంబు నడుపుచోఁ
గృష్ణుపైఁ బల్మాఱుఁ • గినిసినాఁడు
అట్టిమహనీయగుణయుతుం • డర్జునుండు
మనసుయోధను నొంటిగా • మసలు వేళ
ధర్మమార్గము విడనాడి • దయయుమాలి
పట్టి వధియించు ననుమాట • వట్టిమాట.

కృత—గురుకుమారా ! అవునవును. అర్జును నైసర్గికగుణవిలాసము లట్టివే కాని, వంచనాపండితుఁ డగునందనందనునకు విజయుఁడు వశంవదుఁడై మెలంగు స్వభావము గలవాఁ డగుటచే నాహృ యమున శంక కల్గు చున్నది.

కృపా—ఆర్తావనపరాయణుం డగుశ్రీమన్నారాయణుఁడు మోసముఁ జేసి యయినను తనయాశ్రితులను రక్షించును గాని విడువఁ సుమీ. ద్రోణాయనీ —

అశ్వ—(ఇటు నటుఁ గలయఁ బరికించి ప్రక్కనున్నపొదలోఁ దాఁ యున్నసంజయుని జూచి) మామా ! ఈపొదరింటిచాటు నెవ్వఁడో దాఁగియున్నవాఁడు. వీఁ డెవ్వఁ డయి యుండనోపు

చ. ఎవఁడవు రోరి క్రూర! యిటు • లీపొదలోపల దాఁగినావు కౌ
రవపతి నీసరోవరధ • రాస్థలిఁ జూచితివేని జెప్పు ని
న్నవనముఁ జేతు నీ కభయ • హస్త మొసంగితి చెప్పవేని నీ
యవయవము న్మదీయ నిసి • తాసిని గండలు గాఁగఁ గోసెదన్.

సంజ—(స్వగతము) ఓహో! కార్యము తప్పివచ్చినది. ఈ గురునందనుఁడు నన్నుఁ జూచినాఁడు. ఇప్పుడు వీని కేమి యుత్తర మొసంగుదును?

చ. కదనపరాభవంబు మదిఁ గాఁచియ వెట్టి విషాద మంది యీ
హ్రదమునఁ గౌరవాధిపతి రక్షణఁ బొందె నటంచుఁ జెప్పనా!
చదురుగ వీని కుత్తర మొసంగక ప్రాణముఁ గోలుపోవనా!
కుదిరెను ముందుఁ గాలిడఁగఁ గ్రొయ్యయు వెన్క కునూయియుంగటా!

(అని సంజయుఁడు గడగడ వడఁకుచున్నాఁడు.)

కృపా—కుమారా! ఇతఁడు మనసంజయునిలాగున గన్పట్టుచున్నాఁడు ఇతనిదైన్యవృత్తికిఁ గారణ మేమయి యుండునో కదా!

కృత—అవునవును. సంజయుఁడే. సంజయా! నీ కేమియు భయము లేదు. మనదుర్యోధనమహారాజుగారిజాడ లేమయిన నీ వెఱుంగుదు వేని సత్వరితముగఁ జెప్పుము.

అశ్వ—సంజయా! ఏ మట్లు వడం కెదవు? నీ కెవ్వ రేమి యెగ్గొనరించిరి? రారాజున కేదియో కీడు మూఁడుటయే నీదైన్యవృత్తికిఁ గారణము కాని భయము కాదని నీముఖవికారమే చెప్పక చెప్పుచున్నది. అటులే నిశ్చయపఱుచుకొందుమా?

సంజ—అన్నలారా! ఏమని వచించుటకును నోరు రాకున్నది

ఉ. ఘోర సుయోధనుండు పరిపూర్ణపరాజయ మంది దిక్కులే
కారట మొండి యీసరసిజాకరమందునఁ గ్రుంకు వెట్ట నీ
యీరముచాటునుండి తిలకించియుఁ బ్రాణము వీడ కుంటి నో
ధీరవరేణ్య! దైవికవిధిం గడవంగ నశక్య మేరికిన్.

అశ్వ—హా! సకలసామ్రాజ్యప్రాభవవిజితబిడౌజా! రాజరాజా! నీ కిట్టియవస్థ కలిగినదోయి? సకలసంపదల నిల్వవైఖరి

నలహో్క ననుభవించి, మహాయోధులచే నాజ్ఞ పంపు సేయించు కొనుము, రాజరాజబిరుదాంకితుఁడ వయిన నీవు దిక్కుమాలి పాడునీటిలో మునిఁగిపోతివా ? అకటా! దుర్యోధనమహారాజా!

మ. అనిలోఁ శత్రులఁ గెల్వఁజాల నిఁక న ♦ న్నాపాండురాజాత్మజు .
ల్కనుఁగొన్న న్వధియింపకుండ రకటా ! ♦కాలంబు నేమందు హా
యని లోఁ గుంది హ్రదంబుఁ జొచ్చితివె! ద్రో♦ణాచార్యపుత్రుండు చ
చ్చినవాఁడం చెద నెంచితో తలఁచితో ♦ జీవచ్ఛవంబం చిలన్.

కటక్కటా ! కౌరవేంద్ర !

సీ. మేటిజోదులఁ గూడి ♦ మించి యుండినతేఁడు
జలచరంబులతోడ ♦ చెలిమిఁ బడసె
హాయి పాటల నెప్పు ♦డలరుచుండినరాజు
మండూకరవముల ♦ న్మరగవలసె
హానీలమణిసౌధ ♦ మందు వర్తిలు నేత
వారిమధ్యను గేహ ♦ వసతిఁ గొనియె
కులుకుబంగరుగద్దెఁ ♦ గూర్చుండు జగజెట్టి
జంబాలకల్పితా ♦ సనము మెట్టె
ననిశ మెనలేని సంపద ♦ ననుభవించి
వీర్యబలము నకుంఠిత ♦ వృత్తి నెఱపి
నట్టి మహనీయగుణశాలి ♦ కిట్టిపాటు
కలుగు నని సుంత యైనను ♦ దెలియ నకట.

ఆహాహా ! భగవద్విలాసము ! ( అని ముక్కున వ్రేలుంచుకుని )

ఉ. అక్కట ! హాస్తినాపురవ ♦ రాధిపుఁడై విభవానుభూతిఁ బే
రెక్కి[illegible]ర్తియుం గని ర ♦ హించిన కౌరవనాథుఁ డేఢ ! యు

మ్మక్క! ప్రాదం బ దేడ! మతిఁ యందున దాను మునుంగు టేడ! పె
ల్లక్కజ మైననీనియతిఁ కష్టము లేదు కదయ్య సత్ప్రభూ!

జనసామాన్యమువలె గతించినదానింగూర్చి విచారించు టేమిలాభము? అయ్యా! సంజయ! తరువాయి వృత్తాంత మేదియో సవిస్తరముగఁ దెల్పుము.

సంజ—గురుకుమారా! తర్వాత నేమున్నది? ఆమహారాజ మునిఁగి నదిమొద లింతవఱకుఁ దేలఁ డయ్యె.

అశ్వ—కటకటా! ఈసంజయుని పల్కులు వాఁడిముల్కులఁ బోలి నాకర్ణరంధ్రములఁ జుఱుక్కునఁ నాటుచున్నవి. అప్పటినుండి యింతవఱ కెంతకాల మయినది నాయనా?

సంజ — ఇంచుమించుగ నొకఝా మయినది.

అశ్వ—హాసుయోధనా! సుయోధన! ఇం కెక్కడి సుయోధనుఁడు? ఆమాయపాండవభాగమునకు నీ వేల యాశపడితివో యి? హా దైవమా! నీవిలాస మెంతచిత్రముగా నున్నది!

ఉ. రోసము పెచ్చుమీఱఁగ దురోదరమందు సమస్త మోడి పే
రాస వహించి దానికయి నాల మధర్మముఁ జేసి బంధులం
గాసి యొనర్చి తుట్టతుది గాదిలితమ్ములతోడఁ గూడి సం
తోసముఁ జెందు ధర్మజుని తో డఁట దేవుఁ డి దేమిచిత్రమో!

కృత — ద్రోణాయనీ! బాగుగ వక్కాణించినావు. దుర్యోధనునకును, ధర్మరాజునకును గలతారతమ్యవిశేషములను మోమోటము లేక నే జెప్పెద వినుము.

సీ. వెనుదీయ కలధర్మ♦తనయుఁ డంతటివాఁడు
నెత్తమాడినవేళ ♦ నెగడెఁ దప్పు
ఆడెఁబో కురునాథుఁ ♦ డిష్టంబుఁ గికురించి
కొనుటయే కొఱగాని ♦ గొప్పతప్పు
కొనెనుపో తిరిగి దా♦నిని పాండవులు గోరఁ
గురుముఖ్యుఁ డొల్లమి ♦ పరువు తప్పు
ఇయ్యకుండిన మాలె ♦ కుయ్యిడుసతి నీడ్చి
యల లక్కయిలుఁ గాల్చు ♦ టరిది తప్పు
గురుని భీష్మునిఁ గర్ణునిం ♦ గూల్చుచోట్ల
నలరె దప్పులకుప్పయై ♦ యమతనూజు
నుభయవర్తనములఁ జూడ ♦ నొక్కరూపుఁ
దనరుచున్నవి తప్పులు ♦ తడక యట్లు.

కాఁబట్టి దుర్యోధనుఁడు వట్టిమొఱకువాఁ డనియు ధర్మరాజు మహానీయుఁ డనియు మాత్రము చెప్పుటకు వీలులేదు. ధర్మరాజు మాత్రము సామాన్యుఁడా? నేతిబీఱకాయవలెఁ బేరునకు ధర్మరాజు కాని ధర్మముపట్టున ధర్మరాజు కాఁడు సుమీ!

అశ్వ—కృతవర్మా! ప్రస్తుతాంశముఁ జూచుకొందము. దుర్యోధనుఁడీచెరువులో మునిగి చచ్చెనని యూహింపవచ్చుఁగదా?

కృత— కుమారా! సంజయుఁడు మన కిచ్చినయుదంతమునుబట్టి మనముఖులనే యూహింపవలసియున్నది. ఎవ్వఁడయిన నింతసేపు జలాంతరమున నుండఁగలఁగా డేమి?

పా—ద్రోణాయనీ! కృతవర్మ! మీయూహ సరియైనది కాదు. దుర్యోధనుఁ డంతబ్రతుకు బ్రతికి చివర కీపాడుమడుఁగులో మునిగి బలవంతపుఁ జావు చచ్చుటకు యత్నించునంతటియప్రాజ్ఞుఁడు

గాఁడు సుమీ? అతనికి హఠయోగమునందు బ్రావీణ్యత మెండు. అద్దానం జేసి శత్రురాజులకంటఁ బడకుండ జలస్తంభనముఁ గావించికొని యీకొలఁకునఁ దాఁగియుండెననితలంచెద.

అశ్వ—మామా! అనుభవశాలు రగుమీరు చెప్పినది సహేతుకరముగానే యున్నది. అట్లయినచో మన మిప్పుడు చేయందగుపని యేమి యున్నది?

కృపా—కుమారా! శత్రురాజులకు నోడి చేయునది లేక రారాజిట్టిదీనవృత్తిఁ గైకొనియె. మన మిప్పు డాతనికి కొన్నిప్రోత్సాహవచనములఁ బల్కినచో నతఁడు ధైర్యమార్గముఁ నవలంబించి మనకుఁ బ్రత్యుత్తర మొసంగక మానఁడు. తరువాత నతని యభిప్రాయ మెట్లుండునో గుర్తెఱింగి తదనుకూలముగ వర్తింతము.

అశ్వ—ఓదుర్యోధనమహారాజా! నామాట విను మిదిగో.

ఉ. చిక్కులు సంభవించుతఱిఁ జెక్కు చెమర్చక కందుకాకృతిన్
జక్కఁగఁ బైకి లేచుటయె సాజము ధీరులకండ్రు సజ్జనుల్
స్రుక్కి యమానుషంబుగ సరోవరమందునఁ దాఁగియుండిన
బక్కన నవ్వరే? పితికి వందయుటం దను బౌరవర్గముల్.

మఱియు నో కురుకులశేఖరా! ఇటు వినుము.

ఉ. నీ కగునే సుయోధనుఁడ నీరములోపలఁ దాఁగియుండు ట
స్తోకవిధంబు కాగ భువిశూరుల కొప్పెడిమార్గ మూను మే
నీకడ నుండఁగ న్భయ మొకింతయు లే దిఁక లేచిరమ్ము ము
ల్లోకముల న్గడంగి తృటిలోపలఁ గాల్చి జయంబుఁ గూర్చెదన్.

ఇంతవఱకు నీకు జయంబు కల్గకపోవుటకుఁ గారణ మేమందువా?

మ. అని రాధేయుని నీవు పెద్ద యని సై♦న్యాధీశునిం జేయఁగాఁ
గని మాత్సర్యమనంబు చొప్పడగ సం♦గ్రామోద్వసాహాయ్యపుం
బని నేఁ జేయక యూరకే తిరుగఁగా♦ వాటిల్లె నీ కింత నే
నును గర్ణుండును గూడియుండిన రిపు♦న్నుగ్గాడి రాకుందువే!

అయినను, గతించినదానికి నీ వంతగవంతఁ బొందకుము. ఇప్పుడైనను నీకించుకయినఁ గొఱఁత లేదు. శత్రువినాశముఁ జేయుట కీ యశ్వత్థామ యొక్కఁడు చాలును. లేచి రమ్ము జయము గైకొందువుగాని. ఎట్లయినను నీబోఁటిమహాశూరు లిట్లు పిల్లలవలె శోకమూల నొదిగి కూర్చుండియుందురా? ఏలిన రాజ్యమేలవలె లేనిచో యుద్ధరంగమునఁ బ్రాణముఁ గోల్పడవలె. కాని యిదేటిమార్గము?

కృపా—ఓయీ! గురుకుమార! ఇప్పు డిట్టిదీనదశయందు మునింగి యున్న యిమ్మహారాజు నేల మఱల సమరమునకుఁ బురికొల్పెదవు? నీబోఁటిమహాశూరులే కదా భీష్మద్రోణకర్ణాదులు! పాండవపక్షమున శ్రీమన్నారాయణుఁడుండునంతవఱకు నీబడాయిమాటలఁ జాలించుము. కావున యుద్ధపుమాట నావలఁబెట్టి ప్రస్తుతోద్యోగ మాలోచింపుము.

అశ్వ—(సక్రోధుఁడై) ఏమేమీ! మామా! శత్రుగర్వనిర్భేదకుండగు అశ్వత్థామను నీ వంతచులకన చేసెదవుగా!

ఉ. గోవులఁ గాయుచుం దిరుగు♦గొల్లని బెద్దగఁ బూజ చేయుచున్
బావనమూర్తులంచు నల♦ పాండవు లేగుదెఁ గౌరవించి యీ
దీవరు నింత్రపాటునకుఁ ♦దెచ్చిరి నీవును ద్రోణభీష్ములున్
దేవ్రుఁ డెదిర్చిన న్సరియె♦ తేఁకువఁ జెందరు ధీరు లింతయున్.

కృపా కుమారా! నీవుమట్టు కాంద్రోణాచార్యునికుమారుఁడవు కావా? నట్టి యార్భాటము లేటికి? ప్రస్తుతాంశము విచారింపుము.

అశ్వ — మామా! నే నమ్మహాశూరుని ప్రియపుత్రుఁడ నయినందుకు గర్వపడుచునే యున్నాను. కాని నాయభిప్రాయముమాత్రము వినుఁడు.

ఉ. కింటనుబడ్డవారి నను • కంప నొకింతయుఁ జూపకుండఁ బ
ల్కంటకలీలఁ గుత్తుకలఁ • గత్తినిఁ గోసి యథేచ్ఛఁ బోవు నా
దంటకు లెక్కలేదు వ్రత•ధర్మము వోయినఁ బుత్రుఁ డీల్గినన్
వెంటను కృష్ణుఁడుం డికను• వేగిరఁగ మోసముఁ జేయఁజొచ్చినన్.

కృపా — కుమారా! మీఁదమిక్కిలి నాపయిఁగూడ నింద మోపుచుంటివి నే నేమి చేసితిని?

అశ్వ — మామా! నిక్కము వచించితివి (అని నవ్వుచు) నీవు చేసిన దేమియు లేదు.

ఉ. వాసియు వన్నెయుం గలుగు•వాని నొసర్చి మహోపకారముం
జేసి దయానురాగములఁ • జిత్త మలర్చినచెల్మికానిం
బాసలఁ జేయవచ్చి యొక•బాణము నేయక యూరకుండి వి
శ్వాసము వెల్లడించితివి• చాలునుచాలు సెబాసు మాతులా!

(అంత నేపథ్యమున దుర్యోధనుఁడు)

దుర్యో — అన్నలారా! మీలో మీరు కలహించుటంబట్టి నా కంకయు నేదియో కీడు మూఁడనున్న దని తోఁచుచున్నది. ఇప్పుడైనను మీరు కలహం బుడిగి ప్రస్తుతము విచారింపుఁడు.

ఉ. మేని శరాళి నాటు; మిసి♦మింతుఁడ నైతిని; దాహ మయ్యె; కా
లూనఁగఁ జేవ లేదు; మది♦ నోపిక చాలదు; మీరుఁగూడ నెం
తేనియు డస్సినారు; మన ♦ మిప్పటి కూరకయుంట లెస్స; రే
పానిక వచ్చె నేని మన♦మావల కార్యముఁ జూడ స్వస్థమా.

(అంత నేపథ్యమున భీముఁడు జయతూర్యములు మ్రోగుచుండ)

భీము—

ఉ. క్రూరుఁడవై సతీమణినిఁ♦ గోకల నోల్చుచు నీడ్చి తెచ్చి నీ
వారలు గొడ్డువోయి రని♦ పల్కుచు నీతొడఁ జూపుచుండఁగాఁ
గోరుచు సైగఁ జేసితివి♦ కోరిక తీరెడు గాల మయ్యె ర
మ్మోరి! సుయోధనుండ! సమ♦ రోర్విని నిల్వక పారిపోయితే.

కృపా—ఓ మహారాజా! కుబుసము విడిచిన త్రాఁచువలె వృకోదరుఁడు ఘుండిపడుచు నీదెసకే వచ్చుచున్నాఁడు. మే మిక్కడ నున్నచోఁ దప్పక యుద్ధము కాకమానదు. ఇప్పుడు చేయవలసినపని యేదియో సత్వరితముగఁ జెప్పుము.

కృత—ఓరారాజా!

ఉ. ప్రాణము తల్లడిల్లఁగ భ♦యానకవాక్యము లాడుకొంచు ని
స్స్వానరవంబులం జయముఁ♦ జాటుచు భీముఁడు వచ్చుచుండె నీ
ద్రోణజుఁడే మునుం గలసి♦ తోడ్తనె యుద్ధముఁ జేయ నొప్పెదో!
త్రాణ యొకింత లేదని వి♦రామముఁ జెందఁగ నాజ్ఞ నిచ్చెదో!

అశ్వ—ఓరోరి! వృథాప్రగల్భప్రలాపార్భాటా! వాచాట! ఇదిగో త్వరితముగా రమ్ము ఘస్మరా!

ఉ. ఓరిదురాత్మ! యోరికలు•షోన్నతశీల ! మదీయహేతి ని
ష్కారణమట్లు పేర్చిలు నిను•గంఠముఁ ద్రున్ని తదీయరక్తముం
ఘోరున నీఁటులాడఁగల•పుణ్యముఁ గట్టుకొనంగ నిప్డు చే
కూరిన దంచు నెంతయును•కోలు మసంగుచు నున్న దేత్రలం.

(అని కత్తినూడఁబెఱికి)

వహ్వా ! నేడుకదా సరియైన ధర్మయుద్ధము! రా రమ్ము వృకోదరా! అశ్వత్థామ నీకొఱకై సిద్ధముగా వేచియున్నాఁడు.

(అంత దుర్యోధనుఁడు నేపథ్యమున)

దుర్యో—అన్నా ! ద్రోణనందనా! నామాటవినుము. ఇప్పుడు నీవూరకుండుము. దేశకాలపాత్రముల నెఱింగికదా యుద్ధమునకుఁ బూనుకొనవలసినది.

శా. అన్నా ! ద్రోణతనూభవుండ ! వినుమ•న్నా! నీదుసామర్థ్య మే
గన్నారంగనియుండి సూతసుతుపైఁ• గాఢానురాగంబు నా
కన్నుల్గప్పుటఁజేసి నిన్నటు తృణీ• కారంబుఁ గావించినా
నన్నా ! కర్ణునిపైనిప్రేమ తుది దుః•ఖాపాదకంబై చనెం.

మఱియు నో ద్రోణాయనీ! నీమహనీయగుణంబుల వర్ణించుటకు వేయినోళులుఁ గలిగిన యాచిలువలఱేఁడైన సమర్థుఁడుకాఁడు సుమీ ! మఱియు నో వైదికశ్రేష్ఠా ;

శా. నీసౌజన్యత, నీప్రసన్నతయు, నీ•నిస్తంద్రవిశ్వాసముం
నీ సౌహార్దము, నీజిగీషబలము•న్నిర్వాహకత్వోన్నతుల్
నీ సంగ్రామపరాక్రమంబు, మఱియు• న్నీ ధైర్యగాంభీర్యముల్
నీ స్వామ్యై విలసిల్లు లేరు జగతి•న్నీసాటివా రెందునన్.

అట్టి మహనీయుఁడవైన నిన్ను నమ్మక నే నింత తెచ్చికొంటిని. అకటా!
చిట్టచివర పశ్చాత్తాపపడినచో నేమి ప్రయోజనము ?

చ. కడచినదానికి న్వగవఁగాఁగలకార్యము శూన్య మింతకుం
దడ మొకయింతలేని మనదర్పము సాఁగదు వెన్కలాగునం
దడయక మీర లిప్పటికిఁ దవ్వుల కేగుట మేలు; పొందు నే
మడుపునఁ దాఁగియుండెదను మాఁటుమణంగినవేళ రం డిటన్.

ప్రస్తుతము పాండవేయుల కదృశ్యులమై మసలుచుండుట కర్తవ్యము.
కావున మీయనుచరుల్గూడ నెందేనియుంజని కాలముఁ గడపు
చుండుఁడు పొండు.

అశ్వ— రారా జట్లు చెప్పుచుండ మన మన్యథా యెట్లువర్తింపగలము ?
మనము పోదము రండు—

(అంత రథికత్రయము నిష్క్రమించిన తర్వాత)

సంజ— నేను వరప్రభావముచేత నేరికిం గానరాకుండఁ జరుగబోవు
సంగతు లన్నియుఁ జాటుననుండి కనిపెట్టుచుండెద.

(అని సంజయుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

(ఇది ప్రథమాంకము)

---

బ్రహ్మకృపాహి కేవలం.

# ప్రసన్న పాంచాలీయ నాటకము.

## ద్వితీయాంకము.

కృష్ణద్వైపాయనహ్రదముగట్టున

[ప్రవేశము ఇద్దఱుకిరాతులు.]

మొ. కి—భాస్కరవిలసితవృత్తము.

పట్టుమదిగా పలుగాకిమెకంబా♦ పజ్జను మెసపొద దూరెగా

సిట్టక మనుకోరాదదిసూడంగా♦ కవ్వంగినమంపున దోసెగా

రెం. కి—

సట్టలుయిరుగంగం గట్టియయిసురుము♦ సతికిలంబడి నెత్తురుకక్కెగా

చిట్టల నమలిన సెలవుల నురుగులు♦ సెలంగంగ సటలెత్తర బాబూ.

మొ. కి—ఒరేయ్! ఓర్డీన స్సాదియ్యా సుస్తావేంయిరాం—

రెం. కి—ఓర్బాబూ! ఈయేల మెకాలు మెకాలుకావురా బాబూ! అన్నిటిని మచ్చుమాపేశాన్గాని! ఈయాలయాకే యాట! తస్సాదియ్యా!

మొ. కి—ఒరేయ్! నేనేంసేశానో సెస్తా యినోసె; నులిగొమ్ముల మెకాల్ని నూర్నచ్చులు, పలుగొమ్ముల మెకాల్నిపదినచ్చులు, ఎనకచూపుమెకాల్ని ఎయ్యినచ్చులు, మువ్వన్నెమెకాల్ని ముప్పైనచ్చులు, ఎక్కడెక్కడున్నయీవి డొంకడొంకా గాలించేసి ఈయేల సెలగసెలగా అనిపించేశాన్—

రెం. కి.—ఓర్నీ యేటిల్లు బంగారంగాను పొద్దు క్షత్రియోద్ధారక గ్రంథ దేసె. సాలురా బాబూ! ఈయేల కిరీటీ గారిమోతోందోసె; కొంచెం యీసెల్లో దా... యేన్.



మొ. కి—ఓరుండ్రోసే! సూడు ఆసూపుమరదూరా నోళ్ళో సూకేసె పోతూండారు. కాపడలేదుకాబోసు. డొంక సాటొచ్చేసిం దోసె; ఇప్పుడు సూడొరే! ఓళ్ళో నల్లు రున్నారోన్.

రెం. కి.—ఓకానురా! కాబడ్డారు! ఓరిబాబూ! అశ్వద్ధమయ్య గోరూ, కుప్పయ్యగోరూ, కుతవమ్మయ్యోరూ, ఓరి ఆనాల్లో డెవడెన్. బాపనయ్యలా గుండాడూ!

మొ. కి.—ఓరాడేరా! చంచయ్య. ఓరిడేరాబాబూ. ఈడకబు ల్లాడ, ఆడకబుల్లీడ జేరేసుకుంటూ గుడ్డిముసలోడికొంప దీశేసేడోన్. సురియోదన్నగా రేడకో ఉడాయించాడంటా). ఈడితస్పాదియ్యా ఈబాపనోడు ఉన్నయిరెండు లేనియిరెండు సీమ సీటుకట్టంటే ముసలోడిదెగ్గర జేరి మెల్లగా సెప్తూ పె టుక్కున పేలిపోయావోడోన్. ఇప్పు డోడికి సెప్తా డింక. ఇంక సెప్పేది ఏంవుంది.

రెం. కి.—పొహెయ్. అభ్యాసు మన కెందుకేసే. గోళ్ళకు సెవు లుంటాయిరా. కాపోయినా గొప్పోళ్ళతోమాట. మనదార్ని మనం పోదాం రామెస్.

మొ. కి.—ఓరినాయనా! ఇంతాకనుండి ఊరికే ఇస్తు పోతూండాను సూడొరే యీసెల్లో మద్దెన బుడబుడా అంటూ బుడగలు ఒకే

లాగున పైకి లెగుస్తుండాయి సిటికాకి కాబోసు రా మద్దె బుడుంగున మునిగింది.

( అంత నేపథ్యమున భీముఁడు "క్రూరుఁడవై సతీమణిని" అను పద్యమును మఱలఁ జదువుచున్నాఁడు )

రెం. కి.—ఓసంద్రోసె! ఓడివ్రా కేకలు మావినబడుతుండాయి.

మొ. కి.—ఆడికడుపు నొప్పి కాబోసు తెగగింజుకుంటున్నాఁడు. పోదాం రా యేస్ సూదాం యేమొన్నాద్దో మూడిందో.

రెం. కి.—ఓసంద్రోసె! సొద్దాం లేదు. గీద్దాం లేదు. దమ్మరయ్యగోరు, వుక్కుద్దరయ్యగోరు, సెతోనయ్యగోరు, సక్కులయ్యగోరు, సాదేవయ్యగోరూ, మిరిగంటు నక్కుత్తుల నల్లయ్యగోరు ఈ రంతా కూడి వస్తుండారోస్.

మొ. కి.—ఓరిబాబూ! వుక్కుద్దరయ్యగోరు దుడ్డుగర్ర సేత్తో పట్టుకొని గిరగిర తిప్పుకోంటూ నోరంతా ముక్కు ఇంతా సేసుకొని ఈళ్ళతోకూడా వస్తుండాడు.

రెం. కి.—ఓరిబాబూ! ఈళ్ళకొల్లంతా రత్తమేరా! ఇప్పుడే మేకల్ని కోసిన పచ్చికటికోళ్ళులా గుండారా బాబూ! ఈళ్ళను సూత్తేనే బయ్యం యేస్తోందోస్.

[ అంత పాండవులును కృష్ణుఁడును ప్రవేశించుచున్నారు. ]

భీము—( "క్రూరుఁడవై సతీమణిని" అను పద్యమును మఱలఁ జదివి ) ఓరోరి దురాత్మా! కదనరంగమున నిల్వలేక పారిపోయి కురుకులంబు నెల్ల గళంకముఁ గావించినావు కదరా! ఛీ ఏమి నీపౌరుషము? ఇట్టి పిఱికిపందతోఁ గయ్యమొనర్చినందుకు

మాకుఁ గూడ సి గ్గగుచున్నదిరా మూర్ఖా! ఇంతటిచేనా నీ పరాక్రమక్రమము? అన్నయ్యా! మన మీసర్వసర్వం సహాచక్రము నెల్లఁ గలయ వెదకి విసిగి వేసరితిమి. ఇప్పటికి మనకుఁ దుర్యోధనుఁడు కానరాఁ డయ్యె. కర్తవ్య మేదియుఁ దోఁచకున్నది.

అర్జు—అన్నయ్యా! మనము వివిధప్రదేశముల నాతనికై యన్వేషించుచు నిదిగో కృష్ణద్వైపాయనహ్రదము సమీపించితిమి. ఈ ప్రాంతము కూడ నిర్జనప్రదేశముగనే కన్పట్టుచున్నది; మన పక్షాశ్రమ అడవిఁ గాసినపంసువెన్నెల యగును కాఁబోలును.

నకు—అన్నయ్యా! ఇది కేవలము నిర్మానుష్యప్రదేశ మనిచెప్పుటకు వీలు లేదు. చూడు మాప్రక్క నెవ్వరో యిద్దఱు విల్లమ్ములఁ దాల్చిన వేఁటకాండ్రవలెఁ జూపట్టుచున్నారు.

సహ—అన్నలారా! అవు నవును. వీరి నడిగినచో మనకుఁ దుర్యోధనునిఁ గూర్చి కొంతయుదంతము తెలియకపోవునా?

ధర్మ—తమ్ములారా! దుర్యోధనుఁగూర్చి వీరుమాత్ర మేమెఱుంగుదురు? అయినను మన మావంకకుఁ బోయి ఆతనిజాడ లరయుదము. (వేఁటకాండ్రను సమీపించి) ఆఖేటకఖేలనపరిశ్రాంతుల రయిన ఓమృగయులారా! మేము పాండునృపాల పుత్రులము. కురక్షేత్రయుద్ధమునఁ బరాజితుఁడయి దుర్యోధనుఁ డదృశ్యుం డగుడు నాతనిఁ గూర్చి మే మన్వేషించుచు నింతదవ్వరిగి వచ్చితిమి. కాని, ఎందున నతఁడు కానరాఁ డయ్యె. ఈప్రదేశమున మీ రాతనిఁ గాని మ ఱెవ్వరినయినఁ గాని చూచితిరేని సత్వరితముగఁ దెల్పుఁడు,

మొ. కి.—బాబులారా! అర్ధమపొద్దేలనుంచి ఈడనే మాము యే టాడుతూండాం ఇప్పుడిప్పుడే కాంబోసు కుప్పయ్యగోరూ, అశ్వద్ధమయ్యగోరూ, కుతవమ్మయ్యగోరూ, మఱికంటే చంచయ్యగోరూ కాపడ్డారు. కాని సుయోదన్నగోరు మా కాపళ్ళేదు మాదొరా ఏమ్నేతుం.

కృష్ణు—మఱి ఈచెర్వులో నింతవఱ కెవ్వరు దిగియుండలేదు కద?

రెం. కి.—మా కెఱుక లేదు దొరా! కాని, ఇదేమిసోద్దెమో కాని ఇందాకనుండి సూత్తాం మాప్పుణ్ణ నీలల్లోనుంచి బుడగలగ్గా బుడగలు కావు ఒక్కరీతిగానే పైకెగుత్తున్నాయి.

కృష్ణు—(నవ్వుచు) బావా! ఇట్టి విపరీతమునకుఁ గారణ మేమయి యుండునో కదా?

ధర్మ—యదునందనా! కారణ మేదియో తెలియకున్నదోయి!

అర్జు—త్రిభువనంబులం జరుగు వృత్తాంతము లన్నియు నీకుఁ గరతలామలకంబులయి గోచరించుచుండ దుర్యోధనుజాడ మాత్రము నీకుఁ దెలియకపోవుట మఱింతవింతగ నున్నదిసుమీ!

కృష్ణు—ఫల్గునా! అటు లనరాదు. పరోక్షమందు జరుగుసంగతులఁ గనిపెట్టుటకు నేనుమాత్రము భగవంతుఁడనా యేమి? ప్రస్తుతాంశము నెఱింగియుంటినేని నేనుగూడ మీతోపాటింతశ్రమం పడ నేల?

అర్జు—కాని, బావా! కృపాచార్యకృతవర్మాశ్వత్థామ లిచ్చోటికి వచ్చుటయు నీచెరువునఁ బుద్బుదములు పైకెగయుచుండుటయు నీరెంటికిఁ గల సంబంధ మేమియో తోఁచకున్నది సుమీ!

సహ—అన్నయ్యా! ఈజలాంతరాళమున నేతపసియయినఁ దపంబు జేసికొనుచుండె నేమో!

నకు—అన్నయ్య! అటు లయినం గావచ్చు; లేనిచో నిం దేధార్తరాష్ట్రి మయిన మునింగి యుండనోపు!

కృష్ణ—బావా! ధర్మరాజ! చూచితివా పిన్నవయస్కు లయ్యు మన కవ లెట్టిమంచియభిప్రాయములను వెల్లడించుచున్నారో?

అర్జు—బావా! మనుష్యు లెవ్వ రయిన నీటిలో నింతసేపు దాఁగి యుండఁగలరా? ఋషీశ్వరుల కేమి వారు మహానీయగుణాభ్యంచితులు. హఠయోగాభ్యాసు లగుజడదారులకుఁ బంచభూతములును వశీకృతము లయ్యి యుండును. మనదుర్యోధనుఁ డట్టిమహానీయుఁడు కాఁడు.

ధర్మ—కాకేమి! దుర్యోధనుఁడు హఠయోగాభ్యాసప్రవీణుఁ డని స్పష్టముగ నే నెఱుంగుదును. కాని అంతటి మహారాజంతటి వాఁడు చెర్వులో మునింగి దాఁగియుండు ననిమాత్రము చెప్పుటకు సరిపడదు.

భీము—అన్నయ్యా! మఱి కృతవర్మకృపాచార్యాశ్వత్థామ లిందుండి వెడలిపోవుటకుఁ గారణ మేమై యుండును?

నకు—అన్నయ్యా! ఆనల్గురితోపాటు దుర్యోధనుఁడు కూడ వెళ్ళె నేమో? ఒకవేళ వేఁటకాం డ్రతనిఁ జూడలేదేమో?

సహ—అట్లు కాదు. దుర్యోధనుఁడు కూడ యానల్గురితోఁ గలసి యీచెర్వుకడకు వచ్చెనని రూఢిగఁ జెప్పనగును. కాని దుర్యోధనుఁడుహఠయోగజ్ఞాని యగుటంబట్టి జలస్తంభనప్రజ్ఞచేత

నీకమలాకరమందున గొంచెపుంగాలము దాఁగి యుండవచ్చు. ఇదియ నాకుఁ దోఁచినయూహ.

మొ. కి.—పున్నెం పాపం మా కెఱుకలే ద్దొరా! మద్దెన్నం అవు తోంది మేం పోతాం పబులారా! (అని కిరాతులు నిష్క్రమింతురు)

కృష్ణు—ఈసహదేవుని ముందఱ దేవగురువు దిగఁదుడుపే సుమీ; బావా! ఈయూహ మన కెవ్వరికిఁ దట్టినది కాదు కదా!

ధర్మ—బావా! మన మందఱ మింతవఱకుఁ జర్చించినతరువాతఁగదా ఇదమిత్థ మని మనసహదేవుఁడు చెప్పఁగలిగె. మహానుభావుఁడ వై నీదయాప్రభావముచేతనే మాసహదేవున కట్టియూహ వొడమినది.

కృష్ణు—బావా! నిన్ను నేనును నన్ను నీవును మెచ్చుకొనుచుండని యెడల మనల నిఁక మెచ్చుకొనువార లెవరు?

భీము—(సక్రోధుఁడై) అన్నయ్యా! ఇంతరాద్ధాంతసిద్ధాంత మేటికి? ఇదిగో నే నొక్కనిమేషములో నీ కాసార మంతయుఁ గల్లోలముఁ జేసి కలయ వెదకి యిందుఁ దాఁగియున్న పిఱికిపందను బయటకు లాగుకొనివచ్చెదను చూచుచుండుఁడు. (అని లేచి ముందునకు నడచుచున్నాఁడు)

ధర్మ—తమ్ముఁడా! భీమన్న! తొందరపడకు మొక్కక్షణమాత్ర మాఁగుము. ఇప్పుడకదా దుర్యోధనుఁడిందున్నట్టుస్థిరపఱచితిమి; తరువాత మన మేమి చేయవలెనో గోపికావల్లభుఁడే చెప్ప వలెను గాని మనకు మనమే స్వతంత్రించి చేయనగునా? కావున నీ విటఁ గూర్చుండుము.

భీము—మీ యిష్టమువచ్చినట్లు చేయుఁడు. (అని క్రోధముతోఁ గూర్చునుచున్నాఁడు )

అర్జు—బావా! మన మిప్పుడు చేయుందగినకార్య మేదియో ఆనతిమ్ము.

కృష్ణ—పాండవమధ్యమా! మన మిప్పు డేదియయిన నుపాయముఁ బన్ని దుర్యోధనుని నిందుండి వెలిబుచ్చుట మంచిది కాని యీ పాడుచెర్వులో మనముం గూడ ప్రవేశించి యాతనికై నెమకం బూను టుచితము కాదు.

అర్జు—(నవ్వుచు) బావా! మాయోపాయములఁ బన్నుటలో నెన్నఁ డంధ్రజేని నెన్నఁ దన్నినాఁ డనుట నెవ్వ రెఱుంగనిది! కావున నీయుపాయమునుకూడమీరే సెలవిచ్చి కార్యము నెఱవేర్పుఁడు.

కృష్ణ—ధర్మజా! దుర్యోధనుఁ డన్న సామాన్యుఁడు కాఁడు. ఆతఁ డెప్పుడును గదాపాండితుఁ డై యుండు. గదాధరుఁ డయి జల స్తంభనము గావించియున్న దుర్యోధనుఁడు ఫాలాక్షున కయిన నజేయుఁడు. అట్టివానిని వెలువరించుటకు మనము నీటం జొచ్చు టుపాయము కాదు. అడిగితిరి కావున నే నొక్క యుపాయముఁ జెప్పెద వినుఁడు. ఏమందురా? దుర్యోధను నకు రోషము మెండయి యనివార్యముగ నుండును. మన మందఱ మాతనికి రోసము గదురున ట్లెత్తిపొడుపుమాట లాడి నచో నతండు తప్పక మనకుఁ బ్రత్యుత్తర మిచ్చి బయలువడక పోఁడు.

ధర్మ—అదెంతపని. ఓహో హో! రాజరాజ బిరుదు వహించిన దుర్యోధనమహారాజుగారీ చెరువు నట్టనడుమున రాజ్యము చేయుచున్నారు కాఁబోలును. ధార్తరాష్ట్రపరివారముఁ బాగుగ వెల్లడించితినందు కిప్పుడుకా దిప్పుడు దుర్యోధనునకు రాజరాజ

బిరు దొసంగవచ్చును. ఏమేమీ! అర్జునా! భీమసేనా! ఈపాడుచెర్వులో జలకమాడు చున్నది ధృతరాష్ట్రపుత్రుఁడైన దుర్యోధనమహారాజుగారేనా ?

ఉ. ఇమ్మడువందుఁ జొచ్చిన నరేంద్రుఁడు తమ్ములపాలుఁ బెట్టఁగా
సమ్మతి లేక నిండుసభ సాధ్విని గాఱియ వెట్టి భూమి స
ర్వమ్మును మిగ్రింగఁ జూచి వనవాటికి వారినిఁ బంచి మించి రా
జ్యమ్మును జేయ నెంచిన మహామహుఁ డైనసుయోధనుం డిహీ!

మఱియు నోకురువంశాబ్ధిశశాంకా! నక్కొకచోట నీలవేసి మఱియొకచోటఁ గొరికళ్యాణము పాడునా?

గీ. తమ్ములకు బగవాఁడవు తమ్ముల కర
వైనయీసరోవరమందు నడఁగియున్న
లేదు లేశమ్ము క్షేమమ్ము లేచి రమ్ము
ప్రాణభీతిచేఁ గడు వెట్టి వాఁడ వైతి.

కృష్ణు—అన్యవిత్తాపహరణపరాయణుఁ డగుమోసగాఁడు మానాభిమానములఁ దలఁపఁడు సుమీ; బావా!

గీ. మాయవృత్తిబలంబుచే మనఁగ నెంచి
మాయపద్ధతుల నవలంబనముఁ జేయు
జడుఁడు మనుజులు చొరరాని మడుఁగులోనఁ
గ్రుంకి తనువుఁ దాఁచుకొనఁగఁ గొంక డహహ.

భీము—ఓరోరిపౌరుషవిహీనా! దుర్యోధనా!

మత్తకోకిల—బుద్ధిమాలినవాఁడ నీ కిది బుద్ధికాదిఁక లేచిర
మ్మిద్ధవంశములోన నెంచక యిట్టిచేతలఁ జేతువే
యుద్ధమందున [illegible] తోముచుంటివి [illegible]
పద్ధతి న్వసియించు[illegible]ప్రాణి వచ్చిన మేలగున్.

ఓరోరికౌరవ్యాధమా ! గొప్పరాజు వని, మహాకీర్తివంతుఁడ వనిబడాయి కొట్టుచు నతిసుకుమారముగాఁ బెంచిన నీశరీరము నంతయు నీవు చిట్టచివరకు జలచరంబుల కాహారముఁ జేసికొనుచున్నావుకాని ఇందు నీకు సుంతయైనరక్షణ లేదు లేచిరమ్ము.

ధర్మ—అకటా ! దుర్యోధనా ! నా కింతవఱ కెన్నఁడు లేనివిచార మిప్పుడు కలుగుచున్నదోయీ! ఏమందువా ?

చ. తులువతనంబునం గడఁగి తొయ్యలి నాసభఁ జీర లొల్చి బ
ల్కులుమఁపుమాట లాడుచుఁ గికాగిక నవ్వి పరాభవించినం
గలఁగదుకాని మానసము; గాజులఁ దాల్చినదానిఁబోలె నీ
కొలఁకున నీవు పౌరుషముఁ గోల్పడినందునఁ జాలఁ గుందెదిఁక.

అర్జు—బావా ! మాధవా ! నీవు నా కుపదేశించిన గీతావాక్యము నేఁడు చక్కఁగ ననుభవములోనికి వచ్చుచున్నది సుమీ ! ఏలయన

ఉ. కీడొనరింపఁగాఁ దగిన కీలు పదిం దలపోయుచుం జల
క్రీడల నల్పి డస్సి నిదురించినభీముని కాలుసేతులం
ద్రాడులఁ గట్టి యెత్తికొని తామరచెర్వునఁ ద్రోసివేయఁ జే
యాడిన క్రూరకర్ముఁడు జలాశయముం దల ముక్క వెట్టఁడే.

ధర్మ—ఓకౌరవ్యాధమా ! అనవసరసమయంబుల వృధాపౌరషప్రగ ల్భము లాడి సమయము వచ్చునప్పుడు చచ్చినబిడాలమువలె నొకమూల నొదిగి యుందువా ? ఇదియేనా నీశూరత్వము ?

శా. అన్నంబందు విషంబుఁ బెట్టి విషదంష్ట్రాభీలసర్పాళిచేఁ
బన్నుండం గఱపించి మత్తగజముం బన్నించి త్రొక్కించి భీ
మున్నుం జంపఁగ నెన్నియో చెడుగు లాద్యంతంబుఁ గల్పించు నీ
విన్నాణం బిటుఁ [illegible]వేమి ? యిదుగో విచ్చేసె భీముం డిటన్.

ఓహో దుర్యోధనా! మే మజ్ఞాతవాస మందు సమంతమైన నీకు విద్య నేర్పిన బలరాముని ఋణము బాగుగఁ దీర్చినారులే!

ఉ. ఆశకు మేర లేక విపినాంతరసీమల మమ్ముఁ జొన్పి కీ
నాశనిపాలికిం బకవినాశకు నంపఁగఁ గోరి రాము సం
కాశమునందుఁ గష్టపడి గౌరవ మందఁగఁ గన్న నీగడా
కౌశల మెల్ల సిగ్గు చెడఁగా జలమందునఁ గల్పివేసితే?

నకు—అన్నయ్యా! మీరు వృథాకంఠశోషణఁ బడుటయే కాని ఆ పిఱికిపంద యొకించుకైనఁ బ్రత్యుత్తర మీయఁడు సుమీ!

సహ—అన్నలారా! మానాభిమానములఁ ద్యజించి మొండిబ్రతుకు బ్రతుకఁ దలంచినవాని కెవ్వ రెట్టిపౌరుషము లాడిన నేమి?

ధర్మ—ఓయి దుర్యోధనమహారాజా! ఇంతయాశాపాతకత్వము నీకుఁ దగవు కాదుసుమీ!

శా. ఆలాక్షాగృహమందుఁ జిచ్చిడినచో నాపాండురాజాత్మజు
ల్కీలిజ్వాలల మాఁడిపోయి రఁక నీ క్షేమంబులోఁ గోరి ని
న్నాలోకింపఁగ వచ్చి రియ్యెడఁ బ్రభూతాకారము ల్దాల్చి నీ
వాలాగంతజలంబుఁ గ్రోలి పుడిసెం డైన స్థలం బీయవో.

అర్జు—అన్నయ్యా! పాప మతఁ డేమిచేయఁగలఁడు? పుడమి పాలు పంచి యిచ్చుటకుఁ గర్ణబలంబుఁ జూచికొని సమ్మతింపఁడయ్యె. ఇపుడు కర్ణవిహీనుఁ డగుటంజేసి మనమాటలఁ జెడచెవులం బెట్టి కర్ణునితో రాజనఁ జేయుటకై ఎదురుచూచుచున్నాఁడు.

ఉ. పాములవాఁడు కర్ణుఁ డొక ప్రక్కను నాగపురంబుఁ బట్టి గా
నామృతపారవశ్య మగు నట్లు ప్రగల్భ [illegible]

తే. ముదమంది మించి ఫణ మెత్తిన నాగముఁ బోలి భూపచిం
తామణిపీఠకర్ణజడ నాగము యెత్తెను సార్థకంబుగాన్.

భీము — ఓగోరివ్యర్థమానవుఁడా ! నీతండ్రికడ నీ వానాఁడే మనిప్రగల్భము లాడితివి ? మ టిప్పు డేమి సేయుచుంటివి ?

ఉ. తప్పక పాండవేయుల మదం బడఁగింతును; రాజ్య మంతయున్
గొప్పఁగ నేలు దంచు మదిఁ గోరిక లీరిక లెత్తఁ దండ్రికిన్
జెప్పి బడాయిఁ గొట్టితివి నీ ! ముదుకం డగుకన్నతండ్రికిన్
అప్పను దీర్చ లేక యిటు లప్పున ముగ్గుట కే తనూభవుల్.

కృష్ణు — బావా ! ధర్మజా ! దుర్యోధనమహారాజుగారి సందర్శనమును గోరి మత్స్యకూర్మావతారముల నెత్తఁగల్గిన నే నిటకు వచ్చితి ననుకొనునేమో, అట్టిభయ మేమియు లేదనిమాత్రము చెప్పుము.

అర్జు — ఓమహారాజా ! రాజరాజ ! తావకకృపావిశేషమున నందనందనుఁడు కుశలంబుగ నున్నవాఁడు.

ఉ. ఎందుకు వైర మంచు మన యిద్దఱిక్షేమ మెదం దలంచి నీ
ముందర సంధివాక్యములఁ బూనికతోడను చెప్పవచ్చి నీ
విందును మెచ్చి నీకుఁ దన విశ్వతరూపముఁ జూపినట్టిగో
విందుఁడు వచ్చినాఁడు తగవే! యిటుఁ జూడకయుంటి పందవై.

ధర్మ — ఓహెూహెూ ! హఠయోగము నిందుకా నేర్చితివి ?

చ. తను వది లొంగకున్న యెడ ధ్యానము సాఁగదు కాన సజ్జను
లున్నను హఠయోగమార్గమును బూని వశీకృతకాయు లైరి; దా
నినిఁ గాడ త్రుష్ణఁ గాంచితివి నీతియుమాలి పరార్థభాగముం
[illegible] బో[illegible]తివి నీటమ్ముఁ దాఁగి ప్రయోగ మొందితే.

భీము—ఓరోరిమానవిహీన! నీవు నన్ను మడువుc ద్రోయించినప్పు డయ్యగాధజలంబుల నవలీలగ నీఁతకొట్టుచు నే నొడ్డుం జేరిన విధ మంతయు నీకన్నులార నీవు చూచినదే కదా? అట్టి యీ భీమునకు రొంపితో నిండిన యీపాడుచెరు వన్న నొకపల్వల ప్రాయము సుమీ! మగవాసి గలవాఁడ వై తేని వైళంబ మడుఁగు వెడలివచ్చి మాతో రణము చేయుము. లేనిచో చూడు మిదిగో స్పష్టముగఁ జెప్పుచున్నాను—

పంచచామరము. బరాబరి న్బిరానఁ బోరి బాహువిక్రమోన్నతిన్
సరాసరిం జరింపఁగోరి సాధ్వసంబుఁ జెంది నీ
శరీరమీశరాశయప్రసారమందు ముంచినన్
గరాచరిం ధరించివచ్చి కావరం బడంచెదన్.

సహ—అన్నలారా! ఏల! మీ రిట్లు మనదుర్యోధనుని మాటలచేఁ జంపెదరు?

నకు—అన్నయ్యా! రాజ్యభ్రంశముతోపాటు మనదుర్యోధనునకుఁ బుద్ధిభ్రంశముకూడ సంభవించినది. పోనిండు. క్షమింపుఁడు పాపము.

అర్జు—ఓయి వెఱ్ఱిపుడమితేఁడా! ఇదిగో నేను నెమ్మదిగ నీకుఁ జెప్పుచున్నాను. ఇది శూరలక్షణము కాదు. ధైర్యముఁ జిక్కఁ బట్టి చావొండె గెల్పొండె యని కృతనిశ్చయుఁడవై మమ్మెదుర్కొనుము. శరీరమున కేమి చచ్చినతరువాత నెందుకుఁ బనికిరాక మట్టిపా లగును. కీర్తిమాత్రము శాశ్వతముగ నిలుచియుండును. కావునఁ గీర్తికాముఁడ వై తేని వెంటనే లేచిరమ్ము. నామాట వినుము.

ధర్మ—ఓదుర్యోధనా ! మాకిరీటి వచించినట్లు నీవు పట్టివెళ్ళితిగోలవే ! ఏమందువా ?

ధృవకోకిల. సురనదీసుతుశయ్యఁ గూర్చి వ॥సుంధరాస్థలమందునం
బరఁగు నీరము నిచ్చి వేగమె ॥ మూన్పె నాతనిదాహమున్
శరము లర్జును పంపుఁ జేసి వ॥శంవదంబులు కావొకో
శరములందునఁ జొచ్చినాఁడవు॥చాలు లెమ్మిఁక మూఢుఁడా.

అర్జు—ఓకురుపుంగవా ! జన్మముతోడనే చావును పుట్టుచున్నది. మృత్యుదేవతను దప్పించుకొనువార లుండరు. మఱియు, గాలానుకూలముగ మృత్యువు దేహికి సంభవించుచుండును. అందు విశేష మేమందువా ?

శా. ప్రాలేయాచలగహ్వరాంతరమున॥ న్బదరింబుగాఁ దాఁగినన్
ఫాలాక్షుం డు స్వహాయుఁడై నడచిన॥న్మాయావికి న్మాయనే
కాలీయం బగుమృత్యుకారణముగాఁ॥ గంసారి కల్పించుఁ గా
నీ లేశంబును సిగ్గులేక యిల ని॥ క్లైరైసనుం జచ్చిరే!

కావున నోదుర్యోధనా ! ఒకవేళ నిన్నుం జంపుటకు మావశము కాదనుకొంటివేని ధర్మానుచరుల మగుమాపక్షమున నున్నయీ నారాయణునిబారినుండి సురిగిపోవుటకు వీలుపడదు సుమీ !

ధర్మ—ఓయి కురువంశాగ్రిణీ !

ఉ. వాసవపట్టణంబు నిజ॥వాసముఁ జేసికొనంగ లోకసం
త్రాసముగాఁ జరించి సుర॥రాజును గ్రింగి నిలింపకోటిచే
మోసము లేకయుండ వర॥ము ల్గొని నాకము నేలినట్టి వృ
త్రాసురుఁ జంపలేదె కులి॥శాయుధధార వహించి విష్ణువున్.

భీమ — ఓదయాత్మా! లోకములో స్త్రీలను నిష్కారణము బాధించువాఁ డెవ్వఁడు నిట్టిదురవస్థఁ బొందకుండునా? ఆఁడుదానియును రూరక పోవునా?

ఉ. కంతుని బారి కోడి మదగర్వితుఁ డైనవాఁడు నుండు తా శచీకాంతలఁ బెట్టి మానిగణవాహనుఁ డై తుది సర్పమై పడెఁ
గాంతనమంది కృష్ణ వగచాట్లకుఁ బాల్పడఁ జేసినట్టి ని
న్నింతకుఁ దెచ్చి కట్టి కుడిపింపదె? యాయువు రూరకుండునే?

అన్నయ్యా! ద్రౌపదీపరాభవంబుఁ దలంచినంతమాత్రాన మదీయ క్రోధానలంబు దుశ్శాసనరుధిరపూరంబునఁ జల్లారక సహస్రముఖంబులఁ బ్రజ్వరిల్లుచున్నది. (సక్రోధుఁ డయి)

శా. ఆనాఁ డాసభలోన ద్రోవదిని తాఁ నాదుస్ససేనుం డహో
మీనాక్షీమోలను గొప్పఁ బట్టి సభికుల్ మెచ్చంగ మేలంబుగా
నానాభంగులఁ జీర లొల్చి సతి నన్యాయంబుగా నీడ్చె నా
కీనాఁడుం గుడిడొక్కలోనఁ నది వేధించుం గదా శూలమై!

(సక్రోధుఁడయి) అన్నయ్యకుఁ గోపము రానీ, గీపమురానీ! ఏమైనం గానిమ్ము. ఏమి యింత యనుమానఁపడ నేల? ఇదిగో నే నొక్కండఁ బోయి యానీటిలోఁ దాగియున్న యాత్రముక్కుఁడి దుర్యోధనునిఁ జుట్టుపట్టి బయట కీడ్చుకొనివచ్చెదఁ జూడుఁడు నాప్రజ్ఞ (అని రభసంబుగఁ బోవుచున్నాఁడు.)

ధర్మ—(భీమునికరముఁబట్టి ఆఁపి) తమ్ముఁడా! భీమన్న! నీభుజదర్పంబుసద్భుత మని నే నెఱుంగనివాఁడను కాను. కాని నీ కింత తొందర యేల? శత్రువుల సంతతిఁ బరిమార్చిన మహావీరునకు

వంద ననాయాసముగ నంపలేమా ? కావున ఇప్పటికి నీ పూరకొనుము. నామాట వినుము.

భీము—ఇస్సీ ! (అని నిట్టూర్పు విడిచి కూర్చునుచున్నాఁడు.)

అర్జు—దుర్యోధనా ! శూరుఁ డగువాఁ డిట్టిలోకసక్కృపమాటలంబడి యూరకుండునా ? క్షత్రియవంశంబునఁ బుట్టినపరాక్రమశాలి విట్లు బురదపాము వలె దుర్గంధయుతం బయిన యీ జంబాలం బునఁ బడియుండెదవా ? దేవునిపయి భార ముంచికొని లేచి రమ్ము. ఏమందువా ?

ఉ. సృష్టిని నెల్ల నొక్కసమదృష్టినిఁ జూచును దేవుఁ డెప్పుడున్
స్పష్ట మధర్మవర్తనము సైరణఁ జేయఁడు; ధార్మికాంబునం
దిష్టముఁ జెంది దాష్ట్య మడఁగించు నధర్మముఁ జేసినైననా
కష్ట హిరణ్యకశ్యపుఁ బొకార్చి నిజాశ్రితుఁ గావలే దొకో!

ధర్మ—ఓదుర్యోధనా !

మత్తకోకిల. నలినగర్భునరప్రసాదము నన్మహాబలగర్వియై
చెలఁగి తాపసయజ్ఞ భగ్నముఁ జేసి వాసవలోకముం
గలఁచి మున్నహంకృతుండై నరావణుఁగాకు నేడుఁగ నీశ్వరుం
డిలను రాము సృజింప లేదొకో ! యెల్లవారి సుఖంబుగాన్.

కావున ధర్మవర్తనుఁడవయిన నీబోఁటివాని భగవంతుఁడు చేపట్ట కుండునా ?

[illegible]—అన్నయ్యా ! పెరటిచెట్టు మందునకు రా దన్నట్టు మనదగ్గఱ నున్న శ్రీకృష్ణుని విడిచిపెట్టి ఎక్కడెక్కడివో శాంతుపురాణములం జెప్పెద రేమి ?

ధర్మ—అవు నవును తమ్ముఁడా! మఱచితిని!

ఉ. జన్నము కల్గువేళ సుర♦పాలకుఁడే బలహీనుఁ డైననా
పన్నుల యార్తిఁ దీర్పఁగల♦వాని సృజించును దేవుఁ డంటకుఁ
అన్నరకాసురుం దునిమి♦నట్టిమహాత్ముఁడు పుణ్యమూర్తి యీ
వెన్నుఁడె సాక్షి యై తనర♦వేరొకగాథను తెల్వ నేటికిఁ.

నకు—అన్నయ్యా! ఇంక నిన్నిమాటలనయినం బడుసుగాని దుర్యో ధనుఁడు నోరుమాత్ర మెత్తఁడు. మనమాటలను గాలికిధూళికిఁ బుచ్చి రోషము వెచ్చఁబెట్టి రొంపిలో గట్టిగఁ బాదుకొని కూర్చున్నవాఁడు కాఁబోలును. ప్రాణము తొంతతీపియో చూడుఁడు—

ధర్మ—ఓహో! దుర్యోధనా! మహాశూరా గ్రేసరు లగుభీష్మద్రోణ కర్ణాదులు నీవలెఁ బ్రాణముల నరచేతిలోఁ బెట్టుకొని యుద్ధముఁ జేసినవారు కారునుమీ! వా రందఱు శూరులవిధంబున రణ రంగమున బ్రాణముల వీడి వీరస్వర్గముఁ జూఱకొని కీర్తివిశేషు లయిరి. మఱి నీవో!

ఉ. ఆజిని బంధుమిత్రసుతు♦ లందఱు శక్తికొలందిఁ బోరి ని
స్తేజులు కాక ప్రాణముల♦ధీరత వీడినచొప్పుఁ జూచి నీ
వీజగమందుఁ బ్రాణముల ♦నింకయుఁ దీపిగఁ జూచుకొంచు నీ
రాజలమందు దాఁగి యతి♦కష్టపుఁజావునుఁ దెచ్చినావు లే.

అర్జు—ఓయీ! దుర్యోధనా! పురములో నల్గురు నీపౌరుషవిహీనతకు బక్కున నవ్వి గేలికొట్టుచున్నందుకు నీకు విచారము లేకపోయె నను నాకు [illegible]లి కించగ నున్నదిసుమీ!

ఉ. మాటలప్రోవె కాని క్రియ ♦ మాత్రము చేయఁగ లేఁడు; పట్టియా
ర్భాటమె చూపుఁ గాని పవ ♦ రంబునఁ బిల్లి; సమీకసత్కళా
పాటవమో హుళిక్కి; మఱి ♦ పౌరుష మన్నది సున్న; మానమే
నీటికిఁ బోయె నంచు బృథి ♦ విం జనము ల్నిను బ్రువ్వఁ దిట్టరే.

సహ—ఓదుర్యోధనా! నీవిధముఁ జూడ బహువిచిత్రముగ నున్నది. వెలుపలకు వచ్చినను రాకపోయినను నీటిలో నుండియయినఁ బ్రత్యుత్తర మొసంగుట కేమి? మాటలఁ గూడ దాయాదులు పట్టుకొనివెళ్ళెద రనుకొంటివా యేమి?

ధర్మ—ఓదుర్యోధనా! కొట్టకొనమాట నేఁ జెప్పెద వినుము. ఏమందువా?

ఉత్సాహవృత్తము. కదనమందు మమ్ముఁ గెల్వఁ ♦ గల్గితేని సర్వసం
పదయు నీవ యనుభవింప ♦ వచ్చు; లేక చచ్చినన్
బొదలి యమరలోకమందుఁ ♦ బుణ్యమందవచ్చు; నీ
హ్రదమునందుఁ దాఁగిన న్స ♦ జ్జనాళి నవ్వ ముప్పుగన్.

మఱియు

ఉ. పౌరుష మైనచావొ, పరి ♦ పంథులఁ గెల్చుటొ, కాక, లేదు సా
ధారణ మైనమార్గ మని ♦ తద్దయు ధైర్యముఁ జిక్కఁబట్టి గం
భీరమనంబు నిల్పుకొని ♦ వీరగుణంబుఁ బ్రతిష్ఠఁ జేసి మా
తో రణభూమి నిల్వు మిఁకఁ ♦ దోయము వాయుము లేచిరమ్మిటన్.

(అంత నేపథ్యమున)

దుర్యో—ఓధర్మరాజా!

సహ—అన్నలారా! సద్దు చేయకుఁడు దుర్యోధనుఁ డిప్పటికి తెగువ వహించి యేమేమియో మాటాడఁ బోవుచున్నాఁడు.

అర్జు—ఏమేమీ! దుర్యోధనా!

దుర్యో—(నేపథ్యమున) ఓపంచపాండవులారా! మీ రందఱు యదు నందనుని పంపున నన్నుఁగూర్చి రామాట లాడినను నా కొంచు కైన విచారము లేదుసుఁడీ! ఏమందురా?

గీ. మనుజుఁ డభ్యాసపడవిలో♦ మసలునప్పు
డఖిలబంధుమిత్రవినాశ♦ మైనయపుడు
ప్రాణములఁ గాచుకొను టొక్క♦ యరుదు కాదు
అంతమాత్రాన మీ రింత♦ లాడఁ దగునె?

ధర్మ—ఓకురుపుంగవా! దూషణతిరస్కారములు నీకడ నిష్ఫలము లగు నని మే మెఱింగియుండినవారము కాము సుమీ!

దుర్యో—(నేపథ్యమున) అంతియ కాదు. మీర లైదుగురు నే నొక్కఁడను; మీలో నొక్కఁ డొక్కఁడ వచ్చి గదాయుద్ధ మున నన్నుఁ జయింపఁ గలరేని రాజ్యము మీ రేలుకొనుఁడు. అధర్మమార్గమున మీర లందఱు వాహనాదిపరికరవిహీనుఁడ నయిన నాపయిఁ గవియరాదు. పదాతులమయి గదాదండ ధారులమయి యుద్ధము చేయవలసినవారము. ఇంకును మీ రిష్టపడుదురా?

ధర్మ—అట్లే కానిమ్ము దుర్యోధనా! బయటికి రమ్ము. మే మంతియుగ్ధర్మ స్వరూపులము కాముసుమీ!

దుర్యో—(వెలువడివచ్చి) ధర్మరాజా! నీ కింత వెఱ్ఱి యేల? ఇదిగో నాకృతనిశ్చయ మాలకింపుము.—ఏమంటువా?

ఉ. చని రాముప్పురుహీరశేఖరులు భీష్మద్రోణరాధేయు లై
... జాఁగు బయ మింతలేదు; మది ... దొస్సంబునుం కొంద; నే

మునఁ గంతంబునఁ బాఱిన మందువలుక న్నాస్తంబు శుంభద్గదా
వసద్భుజ రాజిలు చూపునంతవఱకు న్బాటింతు సంగ్రామముల్.

(అంత పాండవేయులు చేతులఁ దట్టుకొనుచుఁ గోలాహలంబుగా నార్తురు)

ధర్మ—ఆహా దుర్యోధనా! ఇట్టి శూరుఁడ వని మా కింతవఱకుఁ దెలి యక పోయెఁ గదా? బళీ! దుర్యోధనా! ఇట్టివాంఛ నీ కుండినచో మాతోఁ జెప్పకొనక యీమడుఁగునీటిలో నేల మునింగితివి?

దుర్యో—ధర్మరాజా! అందుకుఁ గారణ మేమందువా?

చ. దళ మది శూన్య మయ్యె; నరేంద్రంబులు కుఱింగె; గజాశ్వవాహనం
బులు తెగె; వర్మము ల్చెదరి పోయె; శిలీముఖ మొక్కటేని గన్
బలితఁపుఁ బాణము ల్తనువు నాటుటఁ జేసి శ్రమంబుఁ దప్పియుం
గలిగెను; గాన, నియ్యెడను గష్టము తీఱ వసింపఁ గోరితిన్.

అందువల్లనే గదాయుద్ధముఁ గూడ చేయఁ గోరుచున్నాను.

అర్జు—దుర్యోధనా! మైమఱువు, మకుటము మొదలయిన భూషణ ములు ధరింపవచ్చునా?

దుర్యో—ఎదిరి కట్టివి యున్నచో మీరుఁ గూడ నట్టివి ధరింపవచ్చు. కాని, ఈయుద్ధమునకై యింక నామనస్సు ముందంజ వెట్టుట లేదు సుమీ!

భీముఁడు—(స్వగతము) ఏమేమి! ఈపాపాత్ముఁ డొకవేళ గదాయుద్ధము మానివేయునా యేమి? గదాయుద్ధముఁ జేతునని యింతవఱకు నాచేఁ గర్ణరసాయనముగఁ బలుకుచున్నాఁడు. గదాయుద్ధము నా కన్నఁ [illegible] లభించునా యితని యువిద్య ఛాయనున్న నా శిష్య

డితనిమాట లంతరుచికరముగా లేవు. (ప్రకాశముగా) ఏమి! దుర్యోధనా! నీయభిప్రాయ మేమియో సత్వరముగఁ దెల్పుము?

దుర్యో—ఏమందువా?

ఉ. ఎవ్వరి కివ్మహీవలయ♦ మెల్లను గూర్చఁ దలంచినాఁడనో!
ఎవ్వరి రాజ్యభోగముల♦ కీసమరం బొనరించి యుంటినో!
అవ్వరసోదరాత్మజుల♦నాహవమందునఁ గోలుపోయి నే
నెవ్విధిఁ బో రొనర్తును జ♦యించిన నేరిసుఖంబు కల్గెడుఁ?

ఇంకొక విచారముకూడ నామనం బేర్చు చున్నది. అ దేమందువా?

చ. పెరిమెయు బాంధవంబుఁ గల♦భీష్ముఁడు పెద్దగఁ జూడ వచ్చునా?
చిరతరమైత్రిచేఁ జదువు♦ చెప్పినయొజ్జ పొగడ్త జేయునా?
కరకరి తీఱఁగాఁ జెలఁగి ♦కర్ణుఁడు నెచ్చెలి సంతసిల్లునా?
దురము జయించి రాజ్యరమ♦తోఁ దులతూఁగఁగఁ గల్గితేనియుఁ.

భీము—దుర్యోధనా! అయిన నిప్పుడేమనెదవు? యుద్ధము జేయక యూరకుందువా యేమి?

దుర్యో—వృకోదరా? కయ్యముఁ జేసిననేమి చేయకేమి? ఇట్టి యువస్థలోనున్న నేను యుద్ధమొనర్చుటకన్న శుభ్రముగ వనాంతరాళమున నేకతముగఁ దపశ్శాలినై యుండుట లెస్సయని తోఁచు చున్నది.

ఉ. చుట్టల నెత్తుటం దడిసి ♦ జొత్తిలి కన్నిఱుమిట్లు గొల్పుహాళం
బట్టన నొప్పుబట్టలను♦మై ధరియించి వియోగబాధ ని
న్నట్టిదిసంతుకొట్టు రిపు ♦ పత్నుల యేడ్పు చెలుంగు లొప్పఁగాఁ

ధర్మ—ఓహో హో! దుర్యోధనా! ఇట్టి కడుపుతీపుమాటలతో ప్రయోజనమేమున్నది? జూదఁపుఁగూ డింత మెక్కి బ్రతుకుట కంటె హారాహారిగ రణరంగమున శత్రులఁ గెల్చి యార్జించిన రుధిరాన్నము భుజించుట మేలని యెఱుంగవు కాఁబోలును. అయిన నీయభిప్రాయ మేమియో తేటతెల్లముగఁ జెప్పుము?

దుర్యో—ధర్మరాజా! నాయభిప్రాయమేమియో విపులముగఁ జెప్పవలెనా? అయిన నాకర్ణింపుము.

ఉ. బంధులు మిత్రులు న్సుతులు ప్రక్కను జేరి కుతూహలంబుగా
బంధురలీల సౌఖ్యపడు భాగ్యము మానెను కాన రాజ్యసం
బంధము వీడినాఁడను సమస్తము నీతలఁ గట్టుకొమ్ము నీ
కుం ధర నెల్ల నిచ్చి తిటఁ గోలెను తమ్ములు నీవు నేలఁగన్.

సమస్తరాజన్యవరేణ్యులు మదీయసార్వభౌమత్వమున కంగీకరించి నిచ్చలు నాకనుసన్న మెలంగుచుఁ గప్పము లొసంగుచుండ భీష్మద్రోణకర్ణాదివీరయోధాగ్రేసరు లనిశంబు నాదండఁ గైదండగా మెలంగుచుండ రాజరాజబిరుదాంకితుఁడనై అతుల వైభవంబు నలవోక ననుభవించి ఏకచ్ఛత్రముగ నేకొఱంతయు లేక రాజ్యము చేసిచేసి విసిగి వేసరితిని. మఱియిప్పుడో!

క. జనములు భటాశ్వగజవా
హనములుఁ దెగిపడఁ బలలము నాదట మెక్క
న్నైనఁగొనునక్కల యూళలు
వినఁబడు బట్టబయ లనుభవింపుము నీవే.

కావున, రాజ్య మంతయు నీకు దానమిచ్చితి గైకొనుము.

ధర్మ—ఓ హో హో!

ఉ. యోగ్యతఁ జెప్పరాదు మిముఁ గోరి కయాదము; చాలుఁ జాలు వై
రాగ్యపుమాట లింత మధురంబుగఁ బల్కెదె కాని రాజ్యసౌ
భాగ్యముఁ గోరవేని సుతబంధుజనావళు లెల్ల చావ నేటికిం
భోగ్యము గాఁగ శల్యుఁ గొనిపోవ రొనరింపఁగ నుత్సహించితో.

అర్జు—ఓ హో హో! దుర్యోధనుఁ డిప్పు డొక వరప్రదాతయై చెన్ను
మీఱుచున్నాఁడు సుమీ! «అందినఁ జుట్టు లేనిచో గాళ్లు» అను
నట్లు లిట్టిసమయంబున నీవు దాతవు కాక ఏమగుదువు?

ఉ. న్యాయముఁ జూప వచ్చిన జనార్దనుఁ గీటునఁ బుచ్చి సంధినిఁ
జేయక «వాఁడి సూది మొననిల్చిన యంతయు భూతలంబు మీ
కీయఁగ నొల్ల" నన్న నృపుఁ డిప్డు జలంబున మున్గివచ్చి కాం
తేయులుపడ్డ కష్టములు తీఱ సమస్తముఁ దాన మీయఁడో.

భీ—హో హో! ఎట్టివితరణశాలివోయి! నీవితరణము వర్ణింపఁ
జాలక కాఁబోలు నాచిలువలఱేఁడు గాలిజీవనముఁ జేయు
చున్నాఁడు.

చ. వితరణశాలివౌర! పృథివీస్థలి నెల్ల హరింపఁ గోరి యా
ప్తిలేకుమఁ బొందలేక తుదిఁ జేసెడి దేమియుఁ గాంచకుండి, ఈ
వితమున నీటఁ దాఁగి భయవిహ్వలత న్మహిఁ దాన మిచ్చు నీ
వితరణ మెన్నఁగాఁ దగదె వేయి విధంబుల సర్వకాలముల్.

నకు—దుర్యోధనా! స్మశానవైరాగ్యమున కేమి కాని గదా
యుద్ధముఁ జేయవలెనని మనసు వడలదు గదా? ఇంతలో నింత
కదుపుతీపుమాటలేల? మనము తెలిసినదానిదాన నీవే రాజ్యముఁ

జేతువేమో! కావున, వట్టిమాట లుడిగి నాతో గదాయుద్ధ మున కాయిత్తుఁడ వగుము.

సహ—దుర్యోధనా! నీవేటి కింత యనవసరమైన యవసరంపడెదవు? యుద్ధమునఁ జయించెదవేని రాజ్యము మాకుఁ దాన మొసంగ నక్కఱలేదుకదా! జయించక చచ్చెదవేని కర్ణునితోఁ గలసి పైఁ గర్తవ్య మాలోచింపవచ్చును.

భీము—ఓరోరి దుర్మతీ! ఓరోరి యమంగళవాచకా! దానమొసంగె దవుగా మాకు; ఛీ! సూతకులమున జన్మించినవానితో సహ వాసము జేసితివి కావున క్షత్రియకులాచారము లన్నియుఁ గంగలోఁ గలిపివేసితివిరా? మూర్ఖా! ఒడలెఱుంగక పేలెద వేమిరా! దురాత్మా!

అర్జు—రాజా! పాత్రమెఱిఁగి చేయని దానము నిష్ఫలముసుమ్మీ; క్షత్రియులు దానార్హులా?

ఉ. తొందరయేల సూతజుని • తోఁ దగు యోజనఁజేసి మాది ఘో
షుం దయచేతుగాని యిట • షుం దయచేసి సమీకమందు మ
మ్ముం దునుమాడి రాజ్యరమఁ • బూనుము; కర్ణునిఁగాను భూమినిం
బొందఁగఁ జేయుఁ జాఁపుట్టకు • భూపులు దానముఁ బట్టవత్తురే?

అయిన నోకురురాజా! జయలక్ష్మిం గాంచిన పాండవేయులు "మాది మాకిచ్చుట మడిమాన్యములిచ్చుటే" యని సంతసింప వలసినదేసుమీ!

భీము—ఓరోరి! కౌరవాధమా! ఇట్టి టాటోటుమాటలకేమిగాని ఇదిగో నానిశ్చయముఁ గ్రహింపుము

శా. ఏ నిన్నున్ వ్రేఁడువంగ నొల్ల నిఁక నీ కీరేడులోకంబులన్
దానం బిచ్చితిఁ బుచ్చుకొమ్మనినమాత్ర స్వీకరక్రీడగా
నే నాజిస్థలి శత్రుసంఘముల వే నిర్జించు టే ముఖ్యమ
ద్దానం గల్గెడి రాజ్యలక్ష్మి నొక పెద్దం జేయ నొక్కింతయున్.

(సక్రోధుఁడై) ఇదిగో, ఇఁక మాటలతో నాకు నిమిత్తములేదు. గదాయుద్ధమున కాయితుఁడవు కావేని మదీయగదాఘాతమున నిన్నిప్పుడొక్కమాటుగఁ బిలుకుమార్చెదఁ జూడుము! మూర్ఖా

దుర్యో—ధర్మరాజా! చిన్నతనమునుండి భీముని మన మెఱింగియే యుంటిమిగదా! కాని; నామనస్సున కొకసందేహము తోఁచుచున్నది. ఏమందువా?

ఉ. సుంతయు వెన్కఁ దీయక వసుంధరఁ గైకొన లోఁ దలంచి ర
వ్వంతయు ధర్మముం దలఁప కాలములో గురుభీష్మకర్ణులం
బంతమువీఱఁ జంపిన ప్రమత్తుల నేకతఁ గూడవచ్చునే?
ఎంతటి వెఱ్ఱియైన సురగేంద్రుని నోటనుఁ జేయిఁ బెట్టునే?

అర్జు—ఓహో! దుర్యోధనా! ధర్మవాక్యములఁ దేనె లొల్కునట్లు వాక్రుచ్చుచు నాచరణమందుఁ దానికి లోఁతిగ సంచరించు నీబోఁటివానివల్ల మేము తప్పక ధర్మము గ్రహించవలసినదే సుమీ! ధర్మమునకేమి; యిప్పుడుగదా ధర్మమన్నది నీకు స్ఫురించినది.

నకు—అన్నయ్యా! ఇంతవఱకుఁ బ్రపంచమున ధర్మమున్నదా యేమి?

సహ—లేదు లేదు! ధర్మమన్నదాని నిప్పుడు కర్ణుఁడపరలోకమునుండి దుర్యోధనునికడ కంపించినాఁడు. దాని నిప్పుడు దుర్యోధ

నుఁడు మనకు నేర్పెడి ఉపాధ్యాయుఁ డగుచున్నాఁడుసుమీ!

ధర్మ—దుర్యోధనా! దురవస్థంబడి పొక్కుచున్న నీకుఁ బ్రపంచ మంతయుఁ దలక్రిందై నడచుచున్నట్లు కనంబడుచున్నది. కాని విశేష మొక్కటి గ్రహించుము. ఏమందువా?

ఉ. నీతుల నెన్నియో తెలుప • నేర్చినవార లదేమిచిత్రమో
పాతకకార్యము న్సలుపు • పట్టునఁ గొంకక యంతరాత్మనుఁ
లాఁతిగ సంచరించి విపు • లం బగుపాపము మూటగట్టి ప్ర
ఖ్యాతికి దూరు లయ్యెదరు • గంతల మోసెడి గాలిగాం డ్రనఁ.

ధర్మమాఁగూర్చి యుపన్యసించుటకేమి కాని యొక్కటి మాత్రము చక్కఁగా విని ధర్మాధర్మముల నిరూపింపుము. అకటా! నెప్పాటకు విచారకరముగ నున్నది. అర్జునా! నీవు కొందల మూనకుము. ఇదిగో దుర్యోధనా! వినుము.

ఉ. బాలుఁ డోకించుకైన సశు • భాశుభము ల్దెలియండు, ధీరత
న్వాలముఁ బట్టి ముందువెను • వైపులఁ జూడని మొక్కలీఁడు గో
పాలుని మేనయల్లుఁ డల • పార్థసుతుం డభిమన్యుఁ బట్టి మీ
రాలములోనఁ నున్న భటు • లందఱు నొంటిగఁ జంపవచ్చునే.

అర్జు—అన్నయ్యా! గతించినదానిఁ దిరుగ నాకేల జ్ఞప్తికిఁ దెచ్చితివి? అభిమన్య కుమారా! ముద్దులమూటగట్టు నీముఖారవిందము మఱల నాకెన్నఁడు కన్పడునోయీ! హా! కన్నతండ్రి! ఇట్టి సమయమున నీవుండినచో దుర్యోధనుపై నీకుంగల కసినంతయుఁ దీర్చికొని యుండువుకదా? హా! కుమారా! సర్వావస్థలయందు నీముఖము కన్నులఁ గట్టినట్లుండ నే నీముఖసముద్రము నెట్టులీఁదఁ

గలనోయీ! సర్వశత్రుభయంకరుఁడవై, సమస్తగుణాభిరాముఁడవై, వీరాగ్రేసరుఁడవై చెన్నలరారుచుండిన నిన్నుఁ జూచి యీదుష్టదుర్యోధనుఁ డోర్వలేకపోయెరా తండ్రీ! (కృష్ణుని వంకఁ జూచి) బావా! నన్నొకసారి మఱల నాముద్దుకుమారుని కడకుఁ దీసికొని పొమ్ము! ఛీ! దుర్యోధనా! పసిబాలునిఁ జంపించుటకు నీమన సెట్లొప్పెనురా! క్రూరా! ఓద్రోణాచార్యా! గురువర్యా! నీప్రియశిష్యుండగు నన్నుఁ జూచియైన నాకుఁ బుత్రబిక్షము పెట్టలేకపోతివా! తల్లిదండ్రులు దగ్గఱలేనప్పుడు ముక్కుపచ్చలారని కుఱ్ఱవానితోనా నీ యుద్ధము జేయుట? అబ్బా! తలఁచుకొన్న కొలఁది దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నదోయీ కుమారా! ఒక్కనిమేషమైనఁ దల్లిని విడిచియుండలేనివాఁడ వింతకాలము నీతల్లియగు సుభద్రను వీడి యెట్టులుంటివోయి ముద్దుకొడకా! యుద్ధములో మేమెవ్వరము నీకు సహాయమొనరింపనందుకు నీ వేమనికొంటివో కదా! హా! దుర్యోధనా! ఆగంగికుఱ్ఱఁడు నీకంత కనువ్రేఁగుగఁ దోఁచెనా! అట్టి చిరుతప్రాయము వానినిఁ జంపుటకు సైంధవు నడ్డముఁ జేసి భీమన్నను దూరముఁ జేసితివా? (సక్రోధుఁడై) ఓరీ! దురాత్మ నే నూర లేనప్పుడింత మాయోపాయముఁ బన్ని నాకుమారునిఁ జంపించిన ని న్నిప్పు డేమి జేసినను పాపము లేదురా దుర్మతీ! ఛీ! ఛండాలా! ఇదిగో చూడుము ని న్నిప్పుడ మదీయ గాండీవంబునకు బలిచేసెద. (అని దుర్యోధనుపై కేగుచున్నాఁడు.)

కృష్ణు—(అర్జునుఁ గరంబునఁ బట్టి ఆఁపి) బావా! కన్నమోహముచే నిట్టు లింకయుఁ గతించినవానిం గూర్చి విలపించుచున్నావు.

దుఃఖమునకుఁ దరియెక్కడ? అదితఱివ్వనకొలంది నూరుచునే యుండును. కాని, యొక్కింతదూర మాలోచించుము. నీవు పుట్టినప్పుడు బిడ్డలు కూడవచ్చిరా? బొందివిడిచి పోవునప్పు డాత్మతోఁ గూడ బిడ్డలువత్తురా? సర్వముకల్ల. ఎక్కడ బిడ్డలు? ఎక్కడసోదరులు? ఎక్కడసతులు? జలములోఁ బుట్టిన బుద్బుదములు దేనివల్లఁ గలుగుచున్నవి? మఱెక్కడ కేగు చున్నవి? అందువలెనే జీవనములు బుద్బుదప్రాయములని చెప్పంబడుచున్నవి. ఇంతయేల? నిన్ను నేను వీరస్వర్గమునకుఁ గొంపోయినప్పుడు నీచిన్నికుమారుని నీవు గుర్తింపఁ గల్గితివా? మఱి నీ కుమారుఁడు నిన్ను గుర్తించెనా? మీఁదుమిక్కిలి తన ప్రాయఁపు బాలకులతో నలవోక కందుకకేళిసల్పుచు నిన్నుంజూచి నీవెవ్వరవని నీ కుమారుఁడు నిన్నడిగెంగాదే! అందునేముఖ్యాంశమున్నది. అంతటివార లేకదా పుత్రులు? ఇహలోకమును విడిచినవెంటనే "ఎవరికి వారే యమునాతీరే." కాని, దేహధారులై ఇహలోకము నున్నవారు బిడ్డలనియుఁ బాపలనియుఁ గళత్రములనియు, సోదరులనియు వెఱ్ఱిభ్రాంతిఁ గొని మోహపాశంబునఁ దగులువడి గతించినవారికై వాపోవు చుందురు. సూక్ష్మదృష్టినిఁ గన్నచో సర్వము మిథ్యయని తోఁచక మానదు. కావున నోయర్జునా! యుద్ధప్రారంభమందు నేను నీకుపదేశించిన గీతావాక్యముల మఱల జ్ఞప్తికిఁ దెచ్చు కొని ప్రస్తుతోద్యోగమును నెఱవేర్పుము.

అర్జు—ఓరా! (అని నిట్టూర్పువిడిచి) అటులనే కానిమ్ము. దుర్యో ధనా! ఇప్పుడు నీవేమందువు? యుద్ధమున కాయితుఁడ వగు దువా లేదా?

దుర్యో—ఆఁ. గదాయుద్ధము తప్పక చేతును. నాకు మైమఱువును శిరస్త్రాణమును లేవని మీరెఱిగియే యున్నారుకదా! తర్వాత మీయిష్టము.

ధర్మ—ఓయి వెఱ్ఱివాఁడా! వానిని నీవు కోరినన్ని తెచ్చి యిచ్చెదము కైకొనుము. ఇంతమాత్రముచేతనే ప్రపంచములోఁ జెడిపోయిన దేదియు లేదు సుమీ?

చ. తినుటకుఁ గందమూలములు ♦ దేహముఁ దాల్పఁగ వల్కలంబులు
న్ననికికి ఘోరకాననము ♦ మండనముల్ రుదురాక్షపేరులున్.
ఘనముగ మాకు నిచ్చి దయఁ ♦ గాచినవానికి నింత నీచ్చినం
తనె చెడ దన్నదమ్ములకుఁ ♦ దార్కొనియుండినప్రేమ యెంతయున్.

కాని ఒక్కటి మాత్రము వినుము.

శా. వాలంబు న్మకుటంబు వర్మమును నీ ♦ వాంఛించు న న్నిచ్చెదన్
మాలో నొక్కొకనిం జయింపఁగలసా ♦ మర్థ్యంబు నీ కున్నచో
వాలాయంబుగ వచ్చి గెల్వుము గదా ♦ పౌరుషత్వముం జూపి ఈ
మాలో నొక్కనిఁ గెల్చె దేని భువి సా ♦ మ్రాజ్యంబు నీ కోడెదన్.

అర్జు—దుర్యోధనా! నీయవస్థ కడు జాలికరముగా నున్నది. పాపము నీవేమిచేయఁగలవు. కుత్సితుఁడైన కర్ణుని మాటలవలన నింత వఱకు వచ్చితివి.

దుర్యో—అర్జునా! కర్ణునిబోఁటివాఁడు మీకును నొక్కఁడు సమకూడినాఁడు కదా? ఎవరందువా? మాయలమారి కృష్ణుఁడు. కాని సూతనందననందననందనుల కొక్క ముఖ్యభేద మున్నది. ఏమందువా! కర్ణుఁడు కేవలము తనస్వశక్తిని నమ్మికొనిన

మహాశూరుఁడు. నాపక్షము వహించినవాఁడు గావున నాక్షే
మముఁ గోరి నాకమితప్రోత్సాహ మొనరించినాఁడు. ఇంత
వఱకుఁ గర్ణుని వలనఁ దోషము లేదుకదా? మఱికృష్ణుఁడంటివా,
అతఁడు శూరుఁడే కాఁడు. ఒక్కనిఁ జయింపవలెనన్న, నేమా
యనో పన్ని యేచేఁపయో, యేపందియో, యేఘాతుకమృగమో,
అయి, చిట్టచివరకుఁ జయించుచుండును. వేయేల. కృష్ణునకు
మోసముఁ జేయుటయందుఁ గల లాఘవ మనిఁ జేయుటయందు
లేదు. మఱియు నందు ముఖ్యాంశ మేమన భగవంతుఁడను
పేరుఁ బెట్టికొని బెట్టిదమైన ఘోరకృత్యములఁ గావించి మీ
బారిట్లచేఁ జెల్లించుకొనుచున్నాఁడు. మఱియు, పాండవులారా!
సావధానచిత్తులరై వినుఁడు.

శా. ఆరాధేయునిఁ దుష్టుఁ డంచుఁ గర♦మీర్ష్యాయత్తచిత్తంబులన్
మీర ల్ప్రేలుటె కాని కర్ణుఁ డకటా! మీశౌరితో పాటు దు
ర్వారాభ్యున్నతజారచోరదురిత♦వ్యాపారము ల్జేసెనే
ఔరా! కృష్ణుఁడె కాదె రెండు తెగల♦స్వాత్తించెఁ గయ్యంబునన్.

కృష్ణు —(స్వగతము) ఈదుర్యోధనుఁడు చెప్పిన దానికి నే నిప్పుడు
ప్రత్యుత్తరమిచ్చినచో రోషముఁ జెంది నాదోషము లన్నియుఁ
బయటబెట్టక మానఁడు. ఇచ్చట మానమే ప్రాణము నేను
కార్యవాదిని గాని ఖడ్గవాదినిగాను. ఈదుర్యోధనుఁడు గూడ
యెట్లో కడతేఱినా నాపూన్కి తప్పక నెఱవేఱును. కాని
ఈ వెఱ్ఱిధర్మరాజు తానేటికి వృథాప్రగల్భము లాడుటని ఇతఁడు
వట్టి మాటలప్రోవు. పట్టుమన్న నితఁ డొక్కబాణమైన నేయఁ
జాలని మహాశూరుఁడు. గదాయుద్ధమున నితనికిఁ బ్రిక్కసున్న.

కావున నేనిప్పు డితనికిఁ బిఱికిమందు వేయుటయే కార్యము. ఇతని నిరుత్సాహపఱచి యున్నమాట ద్రిప్పించెదను. ఊఁ. ఇంతలో పోయిన దేమి కార్యసంఘటనముఁ జూడవలెను గాని! మాటబొంకుననును వయభంగముననును జూతురా యేమి? (ధర్మజుని సమీపించి జనాంతికముగా) ధర్మరాజా!

ఉ. ఇట్టిరయమారయకత్వమున నే నిఖిలావనిఁ గోలుపోయి వా
కట్టునఁ బడ్డసింగ మనఁ గాఁ దిరుగాడి వనాంతరాళముల్
మెట్టి రహస్యవృత్తిఁ గొని నీ విపు డెట్టులో రాజ్యలక్ష్మిఁ జే
పట్టితి వింతలోనె తెగి, పందెముఁ గట్టెద వేల జూదరీ?

చాలుం జాలు! గణించువాఁ డొకఁడు గుణించువాఁ డొకఁడన్నట్లు ముప్పతిప్పలం బడి మూఁడుచెర్వులనీరునుం ద్రాగి ఎట్టెట్టో నీకు నేను రాజ్యసంపాదనఁ జేయుచుందును మఱి నీవు దానితో జూదమాడుచుందువు. నిన్నుఁ గూడుటం జేసి నాకుఁ గూడ మాటవచ్చినది. ఏజోలికిం బోక నాయింట నేను కూర్చుండి నచో నాకన్నిమాటలు రావుగా?

ఉ. చెప్పిన సిగ్గు బాటోదవుఁ చేష్టలఁ జేసియొ కిక్కురించియో
తప్పులఁ బల్కియో కదనధర్మముఁ దాఁటియొ నష్టభాగమే
సప్పనజేతు; నీవు తెగ నాడుము జూదముఁ దాసి నొడ్డుచుం
ముప్పునుఁ దీర్పవచ్చి సడి ముగ్గుచు నుందును నేను సిగ్గఱన్.

బావా! "ఉడబ్బియు లేనివాఁడు దోసముం దెక్కె" నన్నట్లు గద చేఁబట్ట నేరనివాఁడవు ముందుగ దుర్యోధనుని గదాయుద్ధమునకు రమ్మని కాలుద్రవ్వెదవేల? దుర్యోధనుఁ డలఁతులఁ బోఁడు సుమీ! ఏమందువా?

మ. గదఁ జేఁ బట్టి సుయోధనుండు రథపో గ్రక్రీడగా వచ్చినన్
గదలం జాలక నిల్చియుండు వలదిద్దం తానిక్రీడలున్
గదలం దేవత లందఱున్ వడఁకి నాగాభీలగులం బర్విడు
న్నెదిరింపఁగలవారు గా రతని బ్రహ్మేంద్రాది దేవేశులున్.

బావా! నుడికొక్కటిఁగూడ చెప్పెదను. కోపమునఁ జెందకుము. ఏ
మందువా!

చ. కలిగిన దేవము లించు నవకంబుగఁ గూర్చుని యుండలేక
క్కొలఁదికి మీఱుకార్యములకుం జనఁగా దగునే! సుయోధనుం
డల బల్లరాము నొద్ద శ్రమకాదట నోర్చి యనూనవైఖరి
న్జెలఁగి గదాప్రలాఘవము నేర్చె నజేయుఁడు నీకు నాకునున్.

బావా! చూచితివా! ఎంతలో నెట్టియిక్కట్టుఁ దెచ్చిపెట్టితివో? మన
భీమసేనుఁడు దుర్యోధనులతో సరిసమానుఁడు గాకపోయి
గదాకళావిశారదుఁడని మాత్రము చెప్పవచ్చును. ఇంతవఱకు
బొందిన జయము జయముకాదు. దుర్యోధనునిఁ గదాయుద్ధ
మునఁ జయించువఱకు మనము జయించితి మనుకొనరాదు.
అకటా! ఈగదాయుద్ధములో నాకేమి యపకీర్తి సంభవించునో
కదా? ఏమైనం గానిమ్ము! బావా! ప్రస్తుతము భీమసేనునిఁ
గెల్వుమని దుర్యోధనునికిం జెప్పుము. తరువాత సంగతిఁ జూచు
కొందము.

ధర్మ—బావా! మాధవా! నీమాట కే నడుగుదాఁటువాఁడను గాను.
చిన్ననాటనుండియు నిన్నే నమ్ముకొని యుంటిమిగదా! (దుర్యో
ధనునిపై పునరుదిరిగి) ఇదిగో! దుర్యోధనా ముందున్నుఁ గాదు
మాలో భీమసేనునిఁ గెల్వుము. చూతము. (భీమునివైపునకుఁ

దిరిగి) భీమసేనా! నీవు దుర్యోధనునితో గదాయుద్ధమున కప్రమత్తుఁడవై సిద్ధముగా నుండుము.

భీము — అన్నయ్యా! ఏమినాపుణ్యము? నేఁడుగదా నాగద కుచితమైన యాహారము దొరకుచున్నది. ఓరోరి! గర్వాంధ! రమ్ము నీకండకావరం బడంచెద. ఓరోరి! కురుకులాధమా!

మ. అల దుశ్శాసనుఁ గొమ్ముఁ జీల్చి రుధిరం♦బత్యంత మేగ్రోల ను
ష్మ్నలికం బొందుచుఁ బారిపోయి యిపుడీ♦ మమ్ముం జయింపంగదా
కలహం బియ్యెడఁ జేయవచ్చితివి నీ ♦ కాసమ్ము; నిన్నిష్టప్ర
కృలుగా ఖండనఁజేసి నాగదకుఁ గైం ♦ కర్యంబుఁ గావించెదన్.

ఓతల్లీ! గదామతల్లీ! ఇదిగో నిన్నుం బ్రార్థించుచున్నాను.

శా. భూభాగం బసియాడ గోదసీకుహర మే♦పుందక్క మార్మ్రోఁగఁగా
నాభీలం బగుఘాతము ల్సెలఁగ ది♦వ్యస్ఫూర్తి దుర్యోధను
న్గాంభీర్యంబుగఁ దొట్టి లాఘవముగా♦ నర్తించి నానాగితు
లోభిల్లం గరమందు నుండఁగదవే♦ శుంభద్గదాదండమా.

(చేనున్న గదను పైకెత్తి) అన్నయ్యా! చూడు మీగదావిశేషము.

సీ. సమరోర్విగూడినఁ ♦ చటులారి సైన్యాంబు
దావళి కేది జం ♦ ఝూనిలంబు
ధ్వానహీనమ్ములై ♦ దైవారుపూర్వ్యహాకాం
తారములకు నేది ♦ దావకీలి
వినువీధి నొఱసెడు ♦ ద్విరదంబు లనుజీవ
గోత్రంబులకు నేది ♦ కులిశధార
భుజగర్వమున మీఱి ♦ భువి మిన్నుఁ గానని
యరికోటి కేది నే♦త్రాంజనంబు

వీరవర్యుల మనుకొంచు ♦ విఱ్ఱవీఁగు
వారికి సహిత మొకక్రోసు ♦ దూరమందు
నేడి కన్పడఁ బ్రాణంబు ♦ లెగసిపోవు
నట్టి మద్గద యుండ భ ♦ యంబు గలదె?

ఓహో! దుర్యోధనా! "ఉట్టికెగుర లేనమ్మ స్వర్గమెక్కఁ బ్రయత్నించె నఁట" నీబోఁటి పిఱికి పందయెక్కడ గదాయుద్ధ మెక్కడ. చాలుంజాలు నూరకొనుము.

దుర్యో—ఓహో! భీమసేనా! మేఁకపోతు గాంభీర్యమున కేమిలే! చచ్చునందాఁక నిట్టి ప్రగల్భములఁ గొట్టుచుండుట నీబోఁటి పందకు సహజమే.

భీము—ఏదీ! బలరామునొద్ద నీవే మో కష్టపడి విద్దె నేర్చికొంటివఁట?

దుర్యో—ఛీ! ఇందుఁ గదాయుద్ధము ముక్కుమొగ మెఱింగినవా రెవరు? ఆ తాలాంకుఁడే యిందుండినచో నేఁడు గురువుగారి ఋణము తీరక పోవునా?

[ప్రవేశము-బలరాముఁడు.]

బల—ఏమి నాపుణ్యము! నేఁ డీకృష్ణద్వైపాయనప్రాదముకడఁ గౌరవపాండవేయులఁ జూడఁగల్గితిని. సోదరుఁడు కృష్ణుఁడు ద్వారకానగరమున నుండుననుకొంటినిగాని ఇతఁడుఁగూడ నిచ్చటనే యున్నవాఁడు.

కృష్ణ—అన్నయ్యా! నమస్కారము. మీరుకుం గుశలమా? మిమ్ములఁ జూచి యెంతకాలమైనది! (పరిరంభణముఁ జేయుచున్నాఁడు)

బల—తమ్ముఁడా! దీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము.

కర్ణ—బావా! నమస్కారము. (కౌఁగిలించుకొనుచున్నారు.)

[భీమార్జున నకుల సహదేవులు కూడ నమస్కరించుచున్నారు.]

బల — అభీష్టప్రాప్తిరస్తు.

దుర్యో — గురువర్యా! నమస్కారము.

బల — స్వస్తిరస్తు.

దుర్యో — (స్వగతము) నన్నుఁగూడ నభీష్టప్రాప్తిరస్తుయని యాశీర్వదించక దద్వ్యర్థిగా "స్వస్తిరస్తు" అనుచున్నాఁడేమి? అభీష్టప్రాప్తియే స్వస్తి వేరుగ నన్వయించుకొనుట కీబలరామునకు నాపైఁ గోపమాయేమి?

బల — (ధర్మజుంజూచి) బావా! ధర్మరాజా! నిక్కము వచించెద వినుము.

ఉ. నేనటు తీర్థయాత్రఁ జని నిన్నుఁ దలంచనిరోజు లేదు; పా
ర్థానిలసూనశౌర్యముల నాదట మెచ్చని గోష్ఠి లేదు; నీ
మానవతీపరాభవము మానస మేర్చనిపూఁట లేదు; నా
ప్రాణము లెంతయుం గవలపైఁ గడువ్రాలనినాఁడు లేదుసూ.

ధర్మ — అవునవును! బావా! మహాత్ముల ప్రేమానుబంధ మట్టిదే కదా! నేఁడు మీరాకచే మాలోచనచకోరములు ధన్యములైనవి.

బల — బావా! కౌరవపాండవు లుభయులు నాకు సమానబంధువు లగుటంజేసి నేనెరికిం బోనటుఁ జేయనొల్లక తీర్థయాత్ర నడపితిఁ గాని వేరుగఁ దలంపకుము.

దుర్యో — గురువర్యా! మహాత్ముల గుణవిశేషంబు లట్టివే సుమీ! మఱి పక్షపాతము వహించిన బంధువులో, లోలోనఁ గోపులం

ద్రవ్యము నబద్ధములాడింపుము, పాపకృత్యములఁ జేయుచుఁ బ్రతిజ్ఞాభంగమ్ముఁ గావింపుచుఁ బాపము మూటఁగట్టుచుందురు సుమీ ?

బల—దుర్యోధనా ! గతించినదానిం గూర్చి చింతిలినచో నేమి లాభము ? (కృష్ణునివైపుఁ దిరిగి)—కృష్ణా !

శా. ఉన్నారా యదువంశజు ల్కుశలులై ♦ యుత్సాహ మింపొందఁగ
న్జైనొన్నొప్పారఁగ రేవతీరమణి తా ♦ క్షేమంబుగా నున్నదా ?
విన్నావా మనవార లందఱు మనో ♦ విశ్రాంతి నున్నట్టు ? ల
న్నన్నా ! పెక్కు దినంబులయ్యెఁగద ! యా♦త్రార్థంబు నేఁబోయియుఁ .

కృష్ణు—(స్వగతము) ఎట్లైన నీబలరాముని సత్వరితముగా నింటికి సాగ నంపనిచో ముందు కాఁగల కార్యమున కసందర్భము కలుగును. ఇతఁ డసాధ్యుఁడు. కావున నిందుండి యితనినింటనే జేపర మేశ్వ యనిపించవలె. (ప్రకాశముగా) అన్నయ్యా ! తావక కృపావిశేషమున నందఱుఁ గుశలంబుగ నున్నావారు. భవ దీయపునరాగమంబునకై పౌరులేమి బంధువులేమి ఆబాలగోపా లము వేపల్లెలో నెదురుచూచుచున్నారు. తీర్థయాత్ర అయి నది కావున మీరు సత్వరితముగ నింటికేగుట లెస్స, తరువాత మీయిష్టము.

బల—ధర్మజా ! నేఁ బోయివచ్చెదను. (దుర్యోధనునిఁ జూచి)—

మ. [illegible]టా ! కౌరవనాథ ! నీ కపటద్యూతం ♦ బట్టుదుఃఖాస్పదం
బు; కలంగంజను దైన విద్యుత్తు జయిం ♦ పంబోల రాలంబునం

ప్రకటంబ బఱ్యెను ధర్మవైఖరియు మీ ♦ ప్రఖ్యాతియుం జెల్లరే!
ఇకనైన న్గురుపాండవేయులకు సం ♦ ధిల్లుంగదా! స్నేహముల్.

కృష్ణు—ఓహో! ఈబలభద్రుఁడు దర్వార్థిగా బల్కుచున్నాఁడే? జరుగఁ బోవు గదాయుద్ధముఁ గూర్చి ఇతనికిఁ దెలిసి యుండదు కద? (ధర్మరాజును కృష్ణుఁడును, కృష్ణుని ధర్మరాజును చూచు కొనుచున్నారు.)

దుర్యో—గురువర్యా! అటు లన్నఁ గాదు. నామాట వినుఁడు. నా పుణ్యవశమున మీ రిట కరుదెంచినారు. మిమ్ముంలఁ గూర్చి లోఁ దలంచుచుండ, నాడఁబోయిన తీర్థ మెదురుగ వచ్చినట్లు మీముఖారవింద మిచ్చటనె ప్రత్యక్షమయ్యె. యుద్ధమందునఁ బాండవేయు లొనర్చిన అధర్మమంతయుఁ గర్ణాకర్ణిని మీర లెఱింగియే యుందురు. నేఁడు పాండవులును కృష్ణుఁడును ఈ హ్రదముకడఁ గుర్వకోలుఁగొనియుండుటకు గారణము నేఁ జెప్పద వినుండు. భీమునకు నాకుఁ గధాయుద్ధము కాఁగలదు. ఈ యొక్కటి కయ్యమునఁ బాండవుల నొక్కొకని నే నోడించిన యెడల రాజ్యమంతయు నాకుఁ దక్కవలసినదే. రథాశ్వగజ వాహన విహీనులమై పదాతులమై గదాయుద్ధముఁ బాడిదప్ప కుండ నిరువురము నడపవలసినవారము. కాని వీర లాఱుగురు; నే నొక్కఁడను. వీర లిదివఱకు యుద్ధమున నధర్మమొనరించినట్లు లిప్పుడుఁ గూడ నిప్పట్టున మోసమార్గముఁ బట్టుదురేమో యని సందేహపడుచుంటిని. ఒకవేళ వీరధర్మముఁ జేసినను అడ్డానిం గనిపెట్టుటకైనను నాకు దిక్కు లేదయ్యె. కావున శిష్య వాత్సల్యము నాయందుంచి ఈయుద్ధసమయమున న్యాయా

న్యాయములఁ బరీక్షించు చుండవలయునని మిమ్ములఁ బ్రార్థించు చున్నాను.

బల—(స్వగతము) ఏమేమీ! దుర్యోధనుతోఁ బాండవులు గదాయుద్ధముఁ జేతురా! అందుఁ బాండవులోడినచో రాజ్యమంతయుఁ గౌరవేంద్రునకుఁ బోవలెనా? సరిసరి. బాగుగనున్నది. ఇంతకుఁ గౌంతేయులకు రాజ్యప్రాప్తి లేదుకాఁబోలును. నాతమ్ముఁడు పాండవులకై పడ్డ పాట్లన్నియు వ్యర్థాయాసము చనవలసిన యోగమున్నది కాఁబోలును. నాప్రియశిష్యుఁడగు దుర్యోధనుని జయించువాఁ డెవఁడు. మదీయ శిష్యులగు భీమదుర్యోధనుల గదాయుద్ధముఁ దప్పక చూడవలసినదే! (ప్రకాశముగా) దుర్యోధనా! అట్లులే కానిమ్ము. (ధర్మరాజుంజూచి) బావా! ఏమి గడుసుఁదనమోయి! ఇన్ని విశేషము లిచ్చటఁ బొసఁగనైయుండఁ దమ్ముఁడు కృష్ణుఁడు మఱచిపోయినను నీవైనను నాకుం జెప్పకపోతివికదా! (దుర్యోధన భీమసేనులంజూచి) ఈహ్రదమున కనతిదూరమునఁ బొలికల ననంబరఁగు ప్రదేశము గలదు. అందుఁ జచ్చినవారికి స్వర్గప్రాప్తియఁట. ఇప్పుడు మనమున్న ప్రదేశ మాప్రదేశములోనిది కాదు. కావున మీర లిరువురు నాప్రదేశమున యుద్ధమునకు సిద్ధముగనుండుఁడు.

ధర్మ—భాగ్యము (పాండవులును, దుర్యోధనుఁడును, బలరాముఁడును, నిష్క్రమింతురు.)

కృష్ణ—ఓహో! చిట్టచివరకిట్లు పరిణమించినది. ఇప్పుడీ నీలాంబరుని నే నెట్లుసాగనంపఁ గలను? (అని తల పంకించి) నొక్కి వక్కాణించినచో నితని కనుమానము తట్టును. ఇప్పుడు

# ప్రసన్న పాంచాలీయ నాటకము.

ప్రదేశము–పొలికలను.

ప్రవేశము–కృష్ణుఁడు; భీముఁడు.

కృష్ణు—నాయనా! భీమన్న! కుడిచి కూర్చుండియుండలేక ఈగడా యుద్ధముఁగూడ దెచ్చికొంటివిగదా!

చ. ఎటులఁ జయింతువో! కురుమ హీతలనాథుని గెల్వఁగా నిను
న్నటకట! పంపు మంటి యమ నందనుఁ డేగిన ముప్పు వచ్చునం
చటమటఁ జెంది నీవును మ హాబలవంతుఁడ వౌదు కాని యొ
క్కటిమురమందు నాతనికిఁ గౌశల మెక్కుఁడు గానఁ గుందెదన్.

మఱియు నన్యథా తలంపక సావధానచిత్తుఁడవై యిటు వినుము.

చ. మరయు బల మెక్కుడై తనరు మాత్రమున న్జయ మబ్బునంచు లో
మయిమయి నెంచఁబోకుము స మంజస దేహబలాఢ్యు లొక్కెడ
న్బయఁపడిపోవుటం గనమె భండనమందున? లాఘవం బొకిం
తయుఁ గననట్టినీ వతనిఁ దాఁకి యెట్లు జయంబుఁ గూర్చెదో!

మఱి నీ స్వభావముగూడ నాకు విచారముఁ గల్గించుచున్నదిసుమీ!
ఏమందువా?

చ. ఇరవగుయుక్తిఁ జేయక య థేచ్ఛగఁ జే గదఁ బట్టి పోదు వీ
పురుషవర! క్రోధ మూని సమ రోర్వి స్వశక్తిని నమ్మికొంచు ను
గ్రరిపుల దర్ప మాఁడ్చెదవు కాని యొకింతయు యుక్తిఁ బన్నవో
గురుతరకీర్తి! యాహవమున న్గూల్చుట కష్టముగార్యమే సుమీ!

భీము—(చిరునగవుతో) ఓహోహో హో! బావా! ఎట్టి మహాశూరుఁడవోయీ?

శా. ఈదీనత్వము నీకుఁ దక్క మఱియెం♦దేనిం గననౌదు పో
ఆదుర్యోధనుఁ డాజి నాకు నెదురై ♦ప్రాణంబుతోఁ బోవునా
యాద్రోణాథుఁ గలంచియైనను బ్రిపం♦ చాళి స్థదాఘాతముల్
వేఁ దూలించి విరించిఁ ద్రించి యయిన♦స్సిచం బడంతు స్థలుల్.

కృష్ణు—(స్వగతము.) ఇప్పు డితనికిఁ బిటికిమందు వేయుటకంటె ప్రోత్సాహవచనములఁ బల్కుటయే కార్యసాధనము. (ప్రకాశముగా) బావా! అవునవును నీపరాక్రమసారంభమే నెఱుంగనివాఁడను కానుసుమీ?

. తెగువ వహించి పోయి పొల♦ దిండిబకుం బరిమార్చి వేగ మా
పగతు హిడింబు నేకరుఁడ♦వై పొలిపుచ్చితి వుగ్రశక్తి మై
పగఁగొని కీచకుం జముని♦ వాకిలి కంపితి విట్టికృత్యము
ల్జగమున నేరిసాధ్యములు ?♦ చాఁగురె! మర్త్యుఁడు నీకు లెక్కయే.

ఱియుఁ బావా!

. కూరాత్ముం డలదుస్ససేనుఁడు వడిం♦ గొల్వందునం జొచ్చి బ
ల్నారాచంబులఁ బోలు మాట లనిక్ర♦ ష్ణంబట్టి వేధించుచు
స్థిర క్రోధ్వులుగాగ నొల్వఁ గని యా♦ సీమంతినిం గాచి నీ
శూరత్వం బెటువంటిదో కనుట కా♦ తుదాత్ముని స్వేడితిల్.

ము, దుశ్శాసనుఁ జంపినవాఁ డలంతుల బోవునా! కాని, బావా!

తే. గీ. నిండుసభలోనఁ దుర్యోధ♦ నుండు కర్ణ
రంధ్రములు గాడనాడిన♦ ఫ్రల్లదముల

క్షత్రియకులంబునందున ♦ సంభవించి
నట్టి నీబోఁటి బలశాలి ♦ తగునె సైఁప.

భీము—అబ్బా! యదునందనా! కర్ణశూలంబులంబోలు మాటల నా కిప్పుడేల జ్ఞప్తికిఁ దెచ్చితివి? ఐన, నిదిగో చూడుము.

తే. గీ. నిటలనేత్రుండు బాసలై ♦ నిగుడుఁ గాక
దేవతలు వారితాతలుం ♦ దివురుఁ గాక
అమరాత్ముని దెగటార్చి ♦ యన్న కెలమిఁ
బట్టముం గట్టెదఁ గనుల ♦ పండువుగను.

(అని సంరంభముగ నిట్టటు నడచుచున్నాఁడు.)

కృష్ణు—(స్వగతము.) వహ్వా! ఇదియే మంచిసమయము. ఈ పటాటోప సంరంభియగు భీమునిచే మెల్లఁగ నొకమాటఁ బుచ్చుకొనెదను. (ప్రకాశముగ) భీమన్నా! ఇటుఁ జూడుము.

మ. గదతో యుద్ధముఁ జేయునప్డొకవం ♦ క న్నాదెసం జూచి నె
వ్వ్వది నేఁ జేసెదుసైగ వెంబడిని స ♦ మ్యగ్లీల వర్తించు మ
య్యది ధర్మేతర మంచు నెంచకుము నీ ♦ వాలాగుఁ గావింతునం
చిదె నాచేతినిఁ జేయిఁ బెట్టు మిఁక నా ♦ కీచింత చల్లారెడున్.

భీము—దానికేమి. బావా! నీవుమాత్రము నాచే నధర్మముఁ జేయింతువారయేమి? కానిమ్ము! నీ యిష్టమువచ్చినట్లే చేసెదనులే. (అని చేతిలోఁ జేయివైచును.)

కృష్ణు—బావా! మనమిఁక పోదమురమ్ము. ధర్మరాజాదులు మన కొఱకై వేచియుందురు. కాని గదాయుద్ధమున నావంక మాత్రము నీవు చూచుచుండవలయుఁ జుమీ?

భీము—భాగ్యము. (ఇరువురు నిష్క్రమించుచున్నారు.)

[ఇది విష్కంభము.]

## ప్రవేశము.

(ధర్మరాజు, బలరాముఁడు, అర్జునుఁడు, నకుల సహదేవులు, కృష్ణుఁడు.)

బల—బావా! ఒక నదియా! ఒకపర్వతమా! ఒకదేశమా నేను సందర్శించినది. తలయుఁదోఁకయులేని పురాణగాథలకేమిగాని, వివిధదేశంబులం దిరిగి తిరిగి క్రొత్తక్రొత్త కీర్తి తెలిసికొంటిని. ఏమందువా?

క. పరదేశంబుల కేఁగు మానవునకుం జాపంబు వాటిల్లు నందురు వానిం గులబాహ్యుఁడందురు నరుండై దూరప్రదేశంబులం దిరుగంజాలనివాఁడు జ్ఞాని యగునా? నిత్యం బ్రివర్తింపఁ జేకురునా పాతక మొక్కచో నిలిచిన స్థూపస్థమందునే వా.

ధర్మ—అవునవును బావా! మీరు చెప్పిన దార్య సమ్మతమే సుఁడీ మీరే యేతీర్థములఁ గ్రుంకిడితిరి?

బల—బావా! మొట్టమొదట ప్రభాసనదీతీర్థమున స్నానముఁ జేసితిని. తత్తీరనివాసులగు వాచంయమీశ్వరులముఖంబునఁ దానిం గూర్చిన పురాణగాథ నంతయు సవిస్తరముగ నెఱింగితి. ఆసందర్భమున నాకిట్లు తోఁచినది. ఏమందువా?

తే. గీ. వెలఁదులను బెక్కుమందినిఁ బెండ్లియాడు
వాఁడు సంసారసౌఖ్యంబుఁ బడయలేఁడు
మత్కుణంబులు గల్గిన మంచమునను
జనుఁడు హాయిగా నిద్రింపఁ జాలనట్లు.

మఱియు నందొక్క విశేషముకూడ స్ఫురించినది. అదేమందువా?

మ. బహుపత్నీరతుఁ డొక్కపత్నిఁ గడునాప్యాయంబుగాఁ జూచి దు
స్సహదోషాకరుఁడై ప్రభ న్దొరఁగి కార్శ్యం బంది పోవు న్దదీ
తుహినాంశుం డల దక్షకన్యల నొకర్తుం బ్రేముడిం జూచి తా
రహినిం బాయుచు యక్ష్మరోగమునఁ గార్శ్యం బంది గాసిల్లఁడే!

ధర్మ—అవునవును! దీనికి రెం డభిప్రాయము లుండవు సుమీ. ఆహా! మీవాక్యములు కర్ణరసాయనము లగుచున్నవి.

కృష్ణ—(స్వగతము) నాకిట్టి ధర్మవాక్యములు రుచిగానుండునా? కావు న, నే నిప్పు డేమియు జెప్పక మిన్నకుండెద. (ప్రకాశముగా) అన్నయ్యా! తరువాత, తరువాత.

బల—తరువాత నే ననేకమహాజలంబులఁ దోఁగితి. అందు ముఖ్యంబు లేవియన.

మ. ఉదపానంబునఁ గ్రుంకితి న్దనిపితిన్నోల్లాసినై విప్రుల
న్బదరీపాచనమందు వేడువ నుపస్పర్శంబుఁ గావించి నె
మ్మది సారస్వతి తీర్థసేచనమునన్బాపౌఘముం బాసితి
న్నదులం జేరొకన నేల వచ్చితిఁ గృతస్నానుండనై యున్నిఁటన్.

ధర్మ—అట్టి మహాపుణ్యము మాబోంట్లకు లభించునా?

బల—కాని, అట్లు మునిఁగి మునిఁగి తుట్టతుద కిట్లు గ్రహించితిని. ఏమందురా?

ఉత్సాహవృత్తము—నదుల మున్గినంతమాత్రనరుఁడు దురితభారము
న్వదలఁ జాలవ న్వతంబువానిలో నివాసముల్
బొదలు మీనము ల్బకంబునోట మడియునేల? యె
ల్లిదుఁడు సత్ప్రవర్తనంబులేక నీటికాకి యౌ.

ధర్మ—ఔనవును. గుణముప్రధానముగాని స్థానము ప్రధానమాఏమి.

అర్జు—బావా! మహనీయులగు ఋషీశ్వరుల నేరినైన సేవించితిరా?

బల—బావా! నేఁ జూచినఋష్యాశ్రమమహాత్మ్య మొక్కసారి మీకుఁ జెప్పితినేని నాయాశ్రమవాసు లగుతాపసోత్తముల ప్రభావమును వేర చెప్పనక్కఱయుండదు.

సీ. పాదపంబులు గాలిఁ♦బడకుండ శుండాల
 ములు తొండముల నెత్తి♦బోటులొగ్గ
మధుపంబు లరరుల♦న్మసలకుండఁగఁ గోఁతు
 లరయుచు న్దోలి నా♦కరులఁ జేయుఁ
స్నానవిర్మలతకై♦ సరస్సులందలి నీటఁ
 గాసరంబులు పొంచి♦ కాపుగాయు
నీవారసస్యంబు♦ పైవాసు యుటజసీ
 మ లనేకలమ్ములు♦ గలుపుఁదీయు
పగల విడనాడి పన్నగు♦ ల్పడగ లెత్తఁ
బరమమైత్రినిఁ గేకులు♦ పాటఁబాడు
నద్దిర! తపోబలమహాత్మ్య♦ మైకి మత్య
వృద్ధిహేతు వౌ వైరాగ్య♦వృత్తి నెఱవు.

మహనీయు లగుజడదారులం గొలిచి కొలిచి చివరకు వారివలనం దెలిసిన విషయ మేమందురా?

శా. భక్తి న్సంయమిచంద్రులం గొలిచి త♦ద్వాక్యప్రసంగంబులన్
రక్తి న్దేలితి నాదిదేవు నెద నా♦రాధించి సన్మార్గసం
సక్తి న్హింసను మాని యర్థిజనర♦క్షం జేయువాఁడే కడన్
ముక్తిం బొందు నటంచు లో నెఱిఁగితి♦న్ముఖ్యంబుగా నమ్మితిన్.

ధర్మ—ఓహోహో! ఏమి తమ సుకృతపుంజము! బావా! మన విద్వచ్చూడు తీర్థయాత్ర కరిగివచ్చి నాగలోకమును వర్ణించినాఁడుసుఁడీ. మీరు నాగలోకమునకుఁ గొనిపోవు నదులలో స్నానముచేయ లేదు కాఁబోలును.

బల—బావా! "నిత్యకళ్యాణముపచ్చతోరణము" అనునట్లు అర్జునుని తీర్థయాత్ర అంతయు నవలాలావణ్యాంబుధిలో మంగళస్నానము చేయుటయు, విలాసవతుల యంగముల వర్ణించి స్మరించుటయు ననుదిన మొకబిబ్బోకవతినిఁ బెండ్లియాడుచుండుటయు ఈవిధముగ మన యర్జునుఁడు తీర్థయాత్రాపుణ్యము మూటఁగట్టికొని యిల్లుఁ జేరికొన్నాఁడు. నాకు నాగలోక మెక్కడఁ గన్పడలేదు. నేను స్నానము జేసిన నదు లేమియు నన్ను నాగలోకమునకుఁ గొనిపోలేదు. కవ్వడి పుణ్యమూర్తి గావున నతనికట్టి విపరీతములు సంభవించినవి. వేయేల విజయుఁడు యాత్రార్థమై చని ప్రపంచోపయోగార్థమై విజయు విలాసముఁ గూర్చినాఁడు. నాకట్టి సామర్థ్యము లేదుసుమీ!

అర్జు—(స్వగతము.) ఓహో! ఈ సీరపాణి నన్నుఁ బాగుగ నెత్తిపొడుచుచున్నాఁడే! (ప్రకాశముగా) బావా! తరువాత, తరువాత.—

బల—బావా! మనము మాటలసందడిం బడితిమి. అదిగో చూడుమావైపున గదాయుద్ధము ప్రారంభమైనది. ఓహోహో! ఏమి! భీమదుర్యోధనుల గదాయుద్ధము!

సీ. గళ గదఁ దాఁకిన • గ్గలుగు ఘట్టన నినా
దంబుల న్దిక్కరు • ల్లల్లడిల్ల
మరుకోర్ధమున నొడు • గఱచుచుఁ గావించు
పాద తాడనముల • వ్వసుధ కదల
నేత్రకోణములందు • నెలకొన్న రుధిరరో
చులు మంటలై నింగిఁ జుట్టుముట్టఁ
గసితీఱఁ గావించు • గర్జనంబులు పర్వ
తగుహాంతర ప్రతి • ధ్వనుల నీన
నొండొరు ల్తర్జనంబులు • హుంకృతు లొన
రించి యొకరి నొకరు నీస • డించికొనుచు
భీమ దుర్యోధనులు పోరఁ • బెనఁగుచుండ్రి
వడిగఁ జూపఱు లక్కలగుండు • వడుచునుండ.

వహ్వా! బావా! ఇప్పుడుకదా సరియైనయుద్ధము:—

అర్జు—నీలాంబరా! మాభీమన్నన్నయ్యను జూడు మెంతటి శౌర్యవఁతుఁడో.

ఉ. ఒక్కెడ వ్రేయు నెంచి, మఱి • యొక్కెడ వ్రేయుచు నుంటివీగద
న్జక్కటినుండి నీవ్వగ న • శక్తుఁడ వైతివి; కౌరవేంద్ర! నీ
యెక్కటికయ్య మింతె యిహి • హీ యని గేలి యొనర్చి చేఁగద
న్నిక్కలిఁ ద్రిప్పి వైచెఁ దల • మీఁద వృకోదరుఁ డుగ్రమూర్తియై.

ధర్మ—అవునవును. భీముని శౌర్యము నే నెఱుంగనివాఁడనా! చిన్న నాఁటినుండియు మనభీమునకు దుర్యోధనుఁ డన నించుకేనియు లక్ష్యము లేదుసుమీ? తమ్ముఁడా! మన మీయుద్ధమునఁ గూడఁ దప్పక జయింతు మనుటకు సందియము లేదు. [illegible]!

దుర్యోధనా! నీపాలిటి మృత్యుదేవత యో యనునట్లు భీముఁడు నీపైఁ బడుచున్నాఁడు కాచికొనుము.

బల—వహ్వా! దుర్యోధనా! ఏమి నీ గదాకౌశలము?

వ. గదకుఁ గదం దగిల్చి కినుక నురునాథుఁడు లాగి సత్వన మ్మదమునఁ బైకి లేచి యొకమాఱు దెసం జనుదెంచి వ్రేసి తా నెదిరినిఁ గాచికొంచుఁ దనువెల్లను నెత్తురుగఁ గొట్టె భీముఁ డాఁ పుదల రహించె ధాతుజలమున్ దిగఁబాఱెడు పర్వతం బనన్.

బావా! నీతమ్ముని నీవు కొనియాడుటేకాని దుర్యోధనుఁ డింకొక దెబ్బఁ గొట్టినచో భీముఁడు సైరింపఁ జాలక నేలఁ గూలు నని యెఱుంగవైతివి. ఈపాటి కీయుద్ధము నాఁపుట లెస్స. ప్రాణ మున్న యెడల రాజ్యము లేకపోయినను మఱొక్క తెఱఁగున జీవించవచ్చును. మనకండ్ల యెదుట భీముఁడు బలవంతపుఁ జావు చచ్చునేమో యని భయము కలుగుచున్నది.

కృ—అన్నయ్యా! బలభద్రుఁడు తనశిష్యవాత్సల్యముఁ జూపించుచున్నాఁడు దానికేమి.

బల—ఔరా! చూడు మాదుర్యోధనుని ధైర్యస్థైర్యములు! బెట్టిదం బైన యాగదాఘాతము రుచిఁ గొంచియు దుర్యోధనుఁడు ధైర్యముఁ జిక్కఁబట్టి మనంబున నోకించుకేనియుఁ గలంకఁ జెందక భీమసేనునిగదఁ దుత్తునియలు సేసి ఉపాయంబుగఁ బైకిదాఁటి కులిశాయుధము పర్వతముపైఁ బడునట్లు భీముని నడినెత్తిపైఁ దన్నె.

కృ—బాపా! అది యొక లెక్కలోనిది కాదు. చూడుము మాభీమన్నయ్య వజ్రాయుధ ప్రహారముచే నొక్కయీఁక యూ

డిన గరుత్మంతునివలె జెన్నువహించి ఆశిరస్తాడనము లెక్క సేయక కౌరవేంద్రుని విశాలవక్షము వ్రక్కలగునట్లు చేనున్న గదం ద్రిప్పి గిరాటువేసి లక్షణమ మిక్కటగదం దాల్చి సంరంభముగం ద్రిప్పుచు నెట్లు మనకన్నులపండువుం జేయుచున్నాండో? పద్నాల్గు సంవత్సరములు కష్టపడి నేర్చిన దంతయు మన వడముడికడం బనికివచ్చినదికాదు సుమీ!

బల—ఏమీ! దుర్యోధనుని ప్రజ్ఞావిశేషము! వడముడి విసిరివైచిన గద నొక్కబెండుగం జూచి అయ్యది ముక్కలై పోవునట్లు తన గద నడ్డంబుగా నొడ్డి అంతటం జాలక మెల్లంగ సందుం జేసికొని గదం ద్రిప్పుచున్న భీమునిపైకి నద్భుతవేగంబున నుఱికి దుర్యోధనుం డతని వక్షఃస్థలి నొక్కదారుణ మైనదెబ్బం గొట్టినాండు. ఇంక భీముని పని సరి. పంచపాండవులలో నొకండు పంచత్వ మొందె ననుటకు సందియము లేదు.

[అంత నేపథ్యమున-దుర్యోధనుండు.]

దుర్యో—ఓరోరి దోషైకస్వభావకలితహృదయపరిచండులారా! పాండవులారా! నేటితో మీపరాక్రమ మంతయుం దెల్లమైనది కదా? అక్రమమైనగెల్పు గెల్చి రాజ్యముం జేయంగల్గితిమికదా యని సంతసిల్లుచున్నారుగా, ఓరోరి! భీమసేనా! చిన్నటనాటనుండియు మిన్నుమన్నెఱుంగక ఎట్లు మిట్టిపడితివిరా మూర్ఖా! ధర్మరాజా! భీమసేనుండు చచ్చినాండు. ఇంక నీవేవచ్చెదవా! లేక మీలో నెవరినైనం బంపించెదవా లేక రాజ్యము నాకు విడిచిపోయెదవా?

ధర్మ—(యుద్ధరంగమునం బడిన భీమునిం జూచి) హా! భీమసేన! మదీయ ప్రియానుజ!

ఉ. హా వరసోదరా ! గురుత♦రారిపరాక్రమగర్వనాశనా!
ఏవిధి నిన్నుఁ బాసి భువి♦నే నిఁక నిల్తునురా వృకోదరా !
ఈవగఁ గుందు తమ్ములకు♦ నేమియుఁ జెప్పక లేచిపోతి వే
గ్రీవముతోడఁ జెప్పుదును♦కృష్ణకుఁ గొంతికి నిట్టివార్తనున్.

హా శౌర్యనిధీ ! హా తమ్ముఁడా!

చ. బిరుదుమగండు భీముఁ డతి♦ పేర్మిమెడిఁ జూచుచు నాకు వశ్యుఁడై
పరఁగఁ గొఱంత లేదనుచుఁ ♦ బాముల సైఁచితి నింతకాల మా
కురుపతి రజ్జులాడిననుఁ♦ గోమలి ముం దలఁబట్టి యీడ్చిన
న్నరకరితోడ లక్కయిలుఁ♦ గాల్చి వనాంతరసీమఁ జొన్పినన్.

హా! తమ్ముఁడా! ఇంత జరుగునని కలలోనైన నెఱుంగనైతినోయి !

ఉ. నీ వొకమేటి వంచు మది♦నిచ్చలు నమ్మితి నోయితమ్ముఁడా!
నీవరశౌర్యధైర్యములు♦ నెక్కొనియుండ జయంబు తప్ప దే
రేవిధిఁ గల్గునంచుఁ జరి♦యించితిఁ గాని యెఱుంగ నింత దుః
ఖావధి వచ్చునంచు ననుజా! నను ముప్పున ముంచితే తుదిన్?

అకటా ! భీమసేన! నీచర్య నంతయుఁ దలంచిన కొలంది కడుపు దరిగోసి
కొని పోవుచున్నదోయి !

చ. ఉరుతరశత్రుకోటుల ము♦ హూర్తములోననె రూపు మాపి సం
గరమున ఘోరరాక్షసని ♦ కాయములం దునుమాడి చే గదం
గొరగొరఁ ద్రిప్పి యేనుఁగులఁ ♦ గూల్చి రహించిన నీదులావు న
బ్బురమగుకీర్తియు న్మఱచి♦పోదుమె! మేమునుఁ దల్లి గొంతియున్.

అర్జు—హా ! అన్నయ్యా ! నీశపథము రిత్తజేసిపోతివా!—

చ. కుడిభుజ మట్లు భీముఁ డొన♦గూడఁగ నేమిభయం బటంచు మే
మొడ తెగనట్టికష్టముల♦ నెన్నియొ సైఁచి వనాంతరాళముం

బడితివి మేరునుం బడని♦పాట్లను తప్పక కౌరవేంద్రు పెం
దొడలనుఁ గొట్టి మాకు♦నల ద్రోవదికి న్గసిఁ దీర్చ రావుగా!

ధర్మ—నాయనా! భీమసేనా! నాపైఁ గోపమా?

చ. ఉరవడిఁ దుస్ససేనుఁ డటు♦లుగ్మలి వేనలిఁ బట్టి యీడ్చి పె
ల్లురుదుగఁ దిట్టినట్టిసమ♦యంబున నైననుఁ గానవంబులం
దిరిగి నిగూఢవృత్తిఁ గొని♦దీనత నుండినవేళ నైన సం
గరమున కంప కేను నినుఁ♦గట్టడిఁ బెట్టితి మందబుద్ధి నై.

కటకటా! ఈమాయయుద్ధమునకు ని న్నేలబంపితి నోయీ?

చ. అతిముద మంది గొంతి కడు♦పార నినుం గని సర్వభంగుల
న్నతతము నంగరక్షలను♦సల్పుచుఁ జెన్నలరారఁ బెంచి ని
న్నితరుఁడు చావ నాకరము♦బెట్టెను; న న్నొకతండ్రిలాగు స
మ్మతముగఁ గౌరవించు నిను♦మాయసుయోధనుపాల్పఁ బెట్టితిన్.

అర్జు—ఔరా! దైవమా! నీవిలాస మద్భుతావహ మై యున్నది.—

క. "తగిలినకాలే తగులును;
నొగిలినకొంపయె నొగులు;" న♦నునటుల వగచేఁ
బొగిలెడిమే మన్నమరణ
ముఁ గనవలసె పూర్వపాప♦పుంజము కాదే!

ధర్మ—అక్కటా! నా కేటికి మొండిబ్రతుకు?

శా. రామారత్నము నీడ్చి నిండుసభ మ♦ర్యాదం దొలంగించిన
న్స్వామి న్భాగము వీడి నట్టడవిలోఁ♦బో ల్చేది తిర్గాడియు
న్నామాకారము లేది యన్యవృత్తి దీ♦నత్వంబుగాఁ గొల్చియు
న్భీమం డీల్గఁగఁ జూచియు న్బ్రతికితి♦న్బన్నొండి నై యీశ్వరా!

నకు—హా! భీమన్నన్నయ్యా! మా కేమి చెప్పితివి. మమ్మునుగూడ నీతోఁ దీసికొని పోరాదా ?

సహ—అకటా! అన్నయ్యా! ఈధర్మరాజుదుఃఖమును మే మెట్లు చల్లార్చఁగలము ?

ధర్మ—ఏమి యదునందనా! చూచుచు నూరకొనెద వేమి ? నీ వెంత కఠినహృదయుఁ డవోయీ !

శా. బావా! చెప్పినమాటల న్వినక నాభ్రాతృ న్గదాయుద్ధముం
బ్రావీణ్యంబున పట్టుచుఁ దేనె లోలుకన్వాక్కుల్ ప్రోత్సాహించి ఢీకొల్పి పై
పై వేడ్కన్ గనుచుంటి వీయనుజుఁడే పాడయ్యె నీ కేమిలే?
నీ వేషాల నెఱుంగనైతి మునుఁగె న్నీవల్ల మా కింతయున్.

(కన్నీరు తుడుచుకొని)

బావా ! నమ్మినవారిపట్ల నింతటక్రూరతనమా !

కృష్ణ—(చిఱునగవుతో) ధర్మజా! అన్నదమ్ము లగుమీలో మీరు కలహించుటేమి, చిట్టచివర కక్షతలగింజల నాన త్రిప్పి వేయుట యేమి ? సరిసరి, ఇదియేనా ధర్మము.

ధర్మ—బావా ! నిక్కము వచించెద వినుము.

చ. ఇలఁ గల దన్నదమ్ములు మహీస్థలిఁ గూర్చి పెనంగుచుంట; నీ
వలె నొకపక్షము న్వలచివచ్చి మముం బురికొల్పి బాసట
న్నలిపెడివేళ హస్తమునఁ జక్రముఁ బట్టక వేడ్కఁ జూచువా
ర లొరులు పుట్టి రీవిటకువాంఛలకయుండిన నింత పుట్టునే.

కృష్ణ—అవునవును బావా! న న్నిట్లనక యేమందువు ? పడమటి జయము బడసియుండినచో న న్నిట్లనక నీయంతటివాఁడు లేఁడని గోరంతలు కొండంతలు చేసి న న్నభినందించియుందువు కదా?

ధర్మ—అవునవును బావా! నాబుద్ధిమాంద్యమే నన్నింతకుఁ దెచ్చి నది. ఏలయన,

చ. అని నొనరింపఁ బుట్టి కల • హంబది తీండ్రిగ నెంచి చండశా
సనబిరుదు న్వహించి వ్యభి • చారగుణంబున మీఱి యారితే
జీన గడిదొంగ నైనవిప • రీతు నిను న్మది నమ్మినట్టి న
న్ననఁ దగుఁ గాని నిన్నన ర • వంతయు లాభము లేదు మాధవా.

కృష్ణు—బావా! అనుజవియోగము సైరింపఁ జాలక నన్నాడిపోసి కొనుచుంటివి కాని నిక్కము వచింపుము. కౌరవపాండవేయు లిరువురు నాకు సమానప్రియులే కదా!

ధర్మ—ఆఁ. ఇట్టి కుత్సితపుమాటయే మొదటినుండియు మాయుభ యుల కొంపలఁ దీసినది.

మ. అరయ న్గౌరవపాండవేయు లుభయు • ల్ప్రాణప్రియు ల్బంధు లి
ర్వుర నేనొక్కతెఱంగుఁ జూతు ననుచు • న్మూర్ఖంబుగాఁ జెప్పి మా
కురువైరంబుగఁ బక్షపాత మతివై • యుత్సాహ మెచ్చించినా
వరరే! సజ్జను లైనమానవుల స • ఖ్యం బింత పాటించునే.

కృష్ణు—ధర్మరాజా! ఇంతకంటె నే నేమిచేయఁగలను. సాధ్యమైనంత వఱకు మీకుభయులకు సంధిఁ జేయవలె ననియే ప్రయత్నించి తిని కదా? ఇఁక నావల్లఁ దోష మేమున్నదో చెప్పుము.

ధర్మ—ఏమి మాటకారివోయీ! ఇంత కుత్సితుఁడ వని యెఱింగి యుంటినేని నిన్ను రాయబారిగ నియోగించి యుండను కదా? ఓహోహో! ఏమిరాయబారి వోయి? దూత్యమునకుఁ బోయి మఱింత క్రోధము భగ్గని మండునట్లు చేసినావు.

ఇంతకు, నీకు మాత్రము మా యిర్వురకుఁ బొం దొనర్చవలె
నని మనసార నున్నది కనుకనా!

చ. ఎదిరినిఁ బొందుగూర్చుమది♦నేగితి వేని సఖు న్సుయోధను
న్మొదటనె కాంచి వానిగ్రహ♦ముం బసఁ జేయుచు మంచిమాటలం
బొదలఁగఁ జేతుగాని చల♦ముం జెయి వెట్టి కలంచినట్లు నా
విదురునియింట సాపడుదు♦వే మఱి నీ వొకరాయబారివే.

కృష్ణు—బావా! ఊరడిల్లు మూరడిల్లుము. నీవిచ్చియే కాని ఏటి
కీవ్యర్థపుంబలుకులు? నీబోంట్టి మహాజ్ఞాను లజ్ఞానులవలె మర
ణముఁ గూర్చి విలపింతురా?

ఉ. మరణము దేహికిం గలుగు♦మానఁద దెంతటివానికైనఁ బై
కరిగినవాఁడు రాఁడు నెగు♦లంది కృశించిన నేమి యైన నీ
శ్వరునకు సృష్టియు స్థితియు♦సంహరణాదుల నంది మూర్తు లా
గురుతరమూర్తియాజ్ఞలకుఁ♦గుందుట కేవల పామరత్వమే.

పామరత్వము సహింపవచ్చుఁ గాని అన్యనిందారోపణఁ జేయుచు
వాపోయెడుపామరు లసహ్యులు జుమీ?

ఉ. ఎల్ల జగంబులందునను♦నెవ్వనియాజ్ఞ యవారితంబుగాఁ
జెల్లుచునుండునో యతని♦చెయ్దికిఁ గారణ మన్య మంచు నీ
యుల్లములోనఁ దుఃఖపడు♦చుండుట వెఱ్ఱితనంబు కాని నా
వల్లనె యింత మూఁడె నని♦పల్కుట పాపము మాటఁ గట్టు లే.

బల—ధర్మరాజా! శాంతిల్లుము. శాంతిల్లుము. ఈగదాయుద్ధము
జరుగునని విన్నప్పుడే నాకు సందియము తోఁచినది. కాని
అప్పుడు నే నేమియుఁ జేయలేకపోతిని.

కృష్ణు—బావా! నీవు నాపై నింద మోపి దురపిల్లుటే కాని నావల్ల దోష మింతయు లేదు సుమీ? ఏమందువా?

చ. కురుపతితోడఁ గయ్యమునకుం దగువాఁ డలభీమసేనుఁ డే
యెరు లసమాను లంచు నెదనూహ నొనర్చితి మీవు దానికి
న్నరి యని వానిఁ బంపితివి; చాఁగురె! గెల్చిన నీదుప్రజ్ఞయో?
పరిభవ మైన నాప్రతిభ వల్లనొ! పుట్టినవాఁడు గిట్టఁడే!

(అంత నేపథ్యమున.)

భీము—ఓహెూ! ధర్మరాజా! సోదరులారా! భయపడకుఁడు. భయంపడకుఁడు. మీర లచ్చటనే యుండి చూచుచుండుఁడు. ఓరోరిమానవిహీనా! దుర్యోధనా! రా రమ్ము నీకండకావరి బడంచెద.

అర్జు—అన్నయ్యా! బావా! ఏమి ఈచిత్రము! తమ్ములారా! మన భీమన్నన్నయ్య సజీవితుఁడు. మీరు విచార ముడిగి సంతసం బుండుడు. ఆహా! ఇంతలోఁ దిరిగిలేచి సుత్రాముఁడు నముచిం దాఁకిన విధంబున మన భీమన్నన్నయ్య రారాజుపై కుత్తికి నానావిచిత్రగతులఁ గదాసంరంభము నెట్లు చూపించు చున్నాఁడో చూడుఁడు! మేలు భీమన్నన్నయ్యా మేలు—జయ మగుఁగాక.

(అందఱు చప్పట్లుఁ గొట్టుచున్నారు.)

ధర్మ—బావా! నారాయణ! నన్ను మన్నించి క్షమించుము. శోక భారము సైరింపఁజాలక నిన్నట్లంటిఁగాని వేరొండుకాదు. నీ దయవల్లనే మాకింత మేలొదవినది సుమీ,

కృష్ణ—ధర్మజా! ఈ వెఱ్ఱిమాటల కేమికాని రహస్యముఁ జెప్పెద వినుము. పెద్దకాలము పరిశ్రమవ్యాపారములు లేకపోవుటం జేసి మనభీముఁడు గదాయుద్ధమునఁ దుర్యోధనున కీడు కాఁడు. ఇప్పటికే కడు డస్సియున్న మనవడముడి జయ మ్మందునని తోఁచకున్నది. వేయేల భీముఁ డోడిపోవునని ఘంటాపథముగఁ జెప్పఁగలను. దుర్యోధనుఁడే జయించినయెడల నాతనికి సరి పోలువార లిఁక నెవ్వరును లేనందున మనయొప్పందము వెంబడి నందఱ కాతఁడే రా జగుకాలము సంప్రాప్త మగును. అట్టి విపరీతకాలములోఁ దలంచినచో నొక్కమీకే కాదు నాకును గుండెలు ఝల్లుమనుచున్నవి. తరువాత మీయిష్టము.

అర్జు—అవునవును. గదాయుద్ధమున భీమదుర్యోధనుల తారతమ్య మట్టిదే? కాని యిప్పుడు మనము చేయవలసినపని యేమున్నది?

(కృష్ణార్జునులు జనాంతికముగ.)

కృష్ణ—అర్జునా! ఇటురమ్ము. రారాజు తొడలను విఱుగఁగొట్టెదనని భీముఁడు నాఁటిసభలోఁ బ్రతినఁ బట్టినాఁడుకదా? దాని నిప్పుడు దుర్యోధనుఁడు మఱచి యుద్ధము చేయుచున్నాఁడు. గదా యుద్ధమున నాభికింది దిగువభాగమునఁ గొట్టరాదను విధి యున్నను ప్రతిజ్ఞ నెఱవు నెపంబూని ఆభాగమున భీముఁ డిప్పు డతనిఁ గొట్టవచ్చును. దుర్యోధనుఁ జయించుట కింతకన్న వే ఱుపాయం బొకండులేదు. నేఁ జెప్పునది యన్యాయ మను కొందువేమో? న్యాయమే సుమీ. మహనీయుఁడైన దేవేం ద్రుఁడంతటివాఁడు వృత్రాసురవధ నెట్లు నిర్వర్తించినాఁడు!

అట్లయినచో నావధారించినంతయు నకారణమేనా? అమహా నీయునికంటె మీర లెక్కువవారలు కారుగదా?

అర్జు—మాధవా! భీముఁడుఁగూడ తన శపథమును మఱచియే యున్న వాఁడు కదా! ఈసంగతి అతనికిఁ దెలియుటెట్లు?

కృష్ణు—ఆవిధమంతయు నే నిదివఱకే కేర్పఱచియే యుంచితిని. మనము సైగఁ జేసినయెడల దానిం గైకొని అటులఁ జేయునటుల వడముడి నే నొడంబఱచితిని.

అర్జు—హరిహరీ! ఎంతమోస మోయీ! (అని ముక్కుపై వ్రేలుంచుకొని)

కృష్ణు—సరిసరి. మోసమా! ధనుంజయా! నీతొడలపై నీవు చఱచుకొన్నంత నే మోసమగునా? "భీమసేనా! తొడలపైఁగొట్టుము"ని చెప్పినయెడల మోసమగును. ఇదిగో భీమసేనా! అని నీతొడలపై నీవు చఱచుకొనుము. ఇందునఁ దోషమేమియు లేదు.

అర్జు—దీనికి నామనం బియ్యకొనకున్నది. కాని ఇందు నాదోషమేమున్నది? బావా! అటులనే చేసెదనులే.

బల—(స్వగతము) ఏమేమీ! ఈకృష్ణార్జును లేమేమియో గుసగుసలు వోవుచున్నారు. దుర్యోధనుఁడు గదాయుద్ధమున నప్రతిమానప్రవీణుఁడని కొనియాడుచుందురు. అంతకంటె నెక్కు వేమి యుండును? (ప్రకాశముగా) అదుగో దుర్యోధనుఁ డనాయాసంబుగఁ బైకెగసి మాంసఁపుఁదునుకం జూచి యమాంతముగ నేలపైవ్రాలు గరుత్మంతునివలె, భీముని శిరముపైఁ గొట్టుటకుఁ గ్రిందున కుఱుకుచున్నాఁడు. ఇం కెక్కడిభీముఁడు. ఈ దెబ్బతో భీమునిపని సరి.

కృష్ణ—(జనాంతికముగ నర్జునునితో) ఫల్గునా! ఇదియే మంచియదను. ఇది దాఁటినయెడల మనకుఁ జయము పూర్ణానుస్వారమే.

అర్జు—(బిగ్గరగా) ఇదిగో భీమసేనా! వహ్వా! భీమసేనా! (అని తొడలపైఁ జఱచుకొనుచున్నాఁడు.)

బల—(పైకెగసి క్రిందునకు వచ్చుచున్న దుర్యోధనుని భీముఁడు నాభికిఁ దిగువభాగమునఁ గొట్టుటంజూచి) ఔరా! ఏమి యీ ఘోర కలి! ఇంత దురంతమా! ఇంత మాయదారితనమా? ఇదియా మీర లిరువు రింతదనుకఁ గుసగుసలాడినది? ఓరోరి చండాలా! దుర్యోధనుని నాభికిఁ దిగువభాగమునఁ గొట్టితివేమిరా మూర్ఖా! ఓరోరి! అర్జునా! నీటక్కరితన మంతయుఁ దెలిసినదిలే? అక్కటకటా! ధారాజు క్రిందుఁ గూలిపడినాఁడు. ఛీ! పాండవులారా! మీముఖములఁ జూడరాదు పొండు.

భీము—(నేపథ్యమున) ఓరోరి! కౌరవాధమా! దుర్యోధనా! ఇకనైనఁ బుద్ధిఁదెచ్చుకొమ్ము మూర్ఖా! (అనితొడలు తెగిన దుర్యోధను నీడ్చుకొనివచ్చుచున్నాఁడు.)

[ప్రవేశము. భీముఁడు దుర్యోధను నీడ్చుచు]

(సక్రోధుఁడై.) తే. గీ. బంధువులు మిత్రు లెల్లరుఁ బలసియున్న
నిండుపేరోలగమున నుద్దండలీల
నేకవస్త్ర బాంచాలి నీడ్పించి భంగ
పఱచినట్టి క్రూరున కిదె ఫలము సుమ్ము.

ఆనాఁ డాకొల్వుకూటమున, నీవు చూపించిన పటాటోప మిప్పు డేమయ్యెరా మూర్ఖా!

తే. గీ. ఏగురుధురంధరులు భర్త లెదుట నుండఁ
బౌరుషవిహీను లై నట్టివారు వీర
లరివ! నాతోడఁ గూర్చుండు" మనుచు సైగఁ
జేసిన దురాత్ముఁ దలఁ దన్నఁ జెంద దఘము.

ఓరోరి! దురాత్మా! ఆనాఁటి దుండగీనితన మిప్పుడు చూపవేమిరా! దుర్మతీ! (అని దుర్యోధనునిఁ దలపైఁ దన్నుచున్నాఁడు.)

దుర్యో—హా! కలుషాధమా! హా! అధర్మస్వరూపా! ఇట్టి అధర్మ యుద్ధముఁ జేసి మీఁదుమిక్కిలి నాశిరముఁ దన్నుదువా? ఇదియేనా న్యాయము! ఛీ పాండవులారా! ఇదియేనా మీ మర్యాద?

భీము—ఏమి నీధర్మము? ఛీ! వాచాటా! మమ్ముల నధర్మపరుల మని ఇంకయు నోరెత్తుచుంటివిగా?

క. పసు లన్యాయమనస్కులు
బుసిపోయెను వీరికీర్తి పామ్మని మ మ్ము
ల్లసమాడిన పాపుని పైఁ
గసిఁ దీర్చుకొనక విడుచుట కలుషము కాదే!

నీమేనమామ యగుశకుని వెనుకంగుఁ జేయుచుండఁ దుష్టబుద్ధివై సాగ టాలపాళిపై నీ వప్పుడు జూదమునఁ గొల్వులోఁ జూపించిన కౌశల మిప్పు డేమయ్యెరా! దురాత్మా!

క. నచ్చని సారెలఁ గైకొని
దచ్చి బారాదుగతిగ దస్సని కపటం
బచ్చుపడఁగఁ గచ్చుటకా
దెచ్చినమగఁటిమి రిపునిఁ జయించు టనంగన్.

ండీ! ఆశకుని ఇప్పుడడ్డపడఁడేమిరా ! దుర్నీతీ! జూదప్పువ్వుపాదు మెక్కుటచేఁ బెఱిఁగిన నీకండకావర మిప్పు డడఁగివది కదా! ఓహో! సోదరులారా !

ఆ. వె. ముట్టరానిదానిఁ • బుణ్యాంగనామణి
నేమి యెఱుఁగనట్టి • యేకవస్త్రఁ
బరమపావనగుణఁ • బాంచాలి సభకు నీ
డ్పించినట్టి శూరుఁ • డితఁడు గాఁడె?

అర్జునా! అతఁడేనా ఇతఁడు? అతఁడే ఇతఁ డైనచో నిప్పు డిట్లు వట్టి పిఱికిపంద యై తొడలు తెగి కూర్చుండునా?

బల—ఔరా! భీమసేనా! ఇంత ఆతతాయితనము పనికిరాదుసుమీ ! నీవు చేసిన దధర్మము. నీపటాటోప మీపాటికిఁ జాలించుము. ఇంతపాపకర్మమున కొడిగట్టుకొందువని కలలో నైన నెఱుంగ నై తినోయీ !

భీము—ఓహో హో! దుర్యోధనుఁడు పుణ్యాత్ముఁడు కాఁబోలు నేమి?

క. నరకం బయిసను సరియే
సరియే సురపుర మయినను • సభలో మమ్ము
న్విరసంపుఁగాఱులఁ గూసిన
కురుపతిఁ గూల్చితిని కృష్ణ • కు న్మొదవ మొదవఁగ.

దుర్యో—ఏమిధర్మరాజా! ఇంతటిదే కదా పాండవధర్మము?

ధర్మ—దుర్యోధనా! నే నేమి చేయఁగలను. క్రోధాయత్తచిత్తుఁ డైన భీముని చేష్టల నంతగ నరకుసేయకుము. ఏమి! భీమసేనా ! ఎక్కడివాఁడవోయీ !

చ. పరవశ మొంది నీ వటులఁ బాదమున న్దలఁ దన్నరాదుపో
కురుపతి బంధుమిత్రులను గోల్పడి యేకతనుండి గౌరవం
బరయుచు నిట్టియుద్ధమునఁ గాయితుఁ డయ్యె; ముదం బదేల! పా
మరుఁడవె? యన్నదమ్ములకు మాఁతులమే కద! యెట్లు చూచిరన్.

దుర్యోధనా! ఈనీభంగపాటునకు నే గదుంగడు ఁంతిలుచునే యున్నా
ననుకొనుము. చింతించిన నేమిలాభము. ఇంతకు.

ద్విపద.—నీవల్ల నే నింత నిందపాలైతి
నీ వింతతోనైన నెమ్మదిఁ గొనుమి
చే జాఱిన వెనుకఁ జంతిల్ల నేల
రాఁజాలఁ డొకఁడైన రణరంగహతుఁడు
పతితుఁ డైనసుతుఁ జేపట్టుతండ్రివలె
నతిదయాకరుఁడైన యాదిదేవుండు
నీకాత్మశాంతియు నెమ్మది నొసఁగి
కై కొనుఁగాత నిన్గరుణతోఁ జూచి.

దుర్యో—నీలాంబరా! గురువరా! చూచితివికదా ధర్మరాజువై ఖరి.
కొఱవిఁ బెట్టి కాల్చి పైని నీరుబోసినట్లు లెంతకుత్సితముగా
మాటలాడుచున్నాఁడో చూడుము? ఇట్టి టక్కరిమాటలవల
ననే ఇంతవఱకుఁ దెచ్చినాఁడుసుఁడీ. ఇందలి ధర్మాధర్మములు
మహనీయులును నిష్పక్షపాతమతులును అగు మీకుఁ దెలిసినది
కద! భారతయుద్ధ మంతయు నిట్లే జరిగినదనుకొనుఁడు. కాని,
మీఋణముఁ దీర్చలేకపోతినికదా యని మిక్కిలి విచారముగ
నున్నది. సరియైన యుద్ధమే యైనచో గురువు ఋణము
తీఱక పోవునా?

బల—(సక్రోధుఁడై) ఓరోరి బాలిశులారా! ఓరోరిధూ రవ ర్తనులారా!

శా. ఏమేమీ! యిది న్యాయ మై తనరెనా! యిచ్చోట నే నుండఁగా
మోమోటం బిసుమంత లేక బలిమి న్స్వార్థంబుఁ దన్నింతురా
భీమా! నీదుపరాక్రమక్రమము సం ప్రీతాత్ముఁ గావించెబో
మీమర్యాద నెఱింగినాను కలరే మీవంటి శూరు ల్ధరన్.

ఆహనరంగమున మీరు నెఱపిన దుర్వ ర్తన మంతయుఁ గర్ణాకర్ణినివిని పోనీ మనకెందుకని వినియు విననట్లూరకుంటినికాని నేఁడు మీధర్మము నంతయుఁ గన్నులారఁ జూచినాను. ఛీ! ఛీ! ఇట్టి యధర్మముఁ జేసి గెలుపొందుటకంటె బిల్లులవలె నేయడవినో యొకమూల నొదిగియుండుట మేలు. చాలుఁజాలు. ధర్మజా! నీ శిష్టత్వము! నీధర్మపరత్వము! నీసద్వ ర్తనము! నీసత్యగుణము ఇవన్నియు నేటితో నీరుగాఱిపోయినవి లే!

శా. కౌరవ్యేంద్రునినాభికిం దిగునభా గంబందు నొప్పించినాఁ
డౌరా! భీముఁడు నాదుశిష్యు నిటు ల న్యాయంబుగాఁ గూల్చునే?
మీర ల్ధర్మపరాయణైకహృదయు ల్మీవంటివార ల్భువిన్
ఘోరంబు ల్పచరించిన న్గలుగునే గోప్యంబు మీపట్టునన్.

ధర్మ—(స్వగతము) ఈబలరాముఁడు మోమోటము మాలి నన్ను నిలువఁదీసి యడుగుచున్నాఁడు. అధర్మము జరిగినదని నే నొప్పుకొందునా యేమి? మౌనముఁ దాల్చి కూర్చుండెద. (కండ్లు చికిలించుచు నూరకొనును.)

అర్జు—(వెలవెలబోవుచు నిట్టూర్పువిడిచి యూరకొనును.)

నకుల-సహదేవులు—(ఎగదిగఁజూచుచు మిన్నకుందురు.)

కృష్ణు—(ముఖముఁ జిటిలించుకొని కాలిబొట్టనవ్రేలు నేలపై నిట్టట్టు వ్రాయుచున్నాఁడు.)

బల—ఓహో హో! పాండవులారా! అధర్మమన్న నింత వెఱవని మొఱకు మానవు లెందైనం గలరా! నోటఁ గడ్డకొట్టుకొన్నట్టు లొక్కఁడైన మాటాడలేఁ డేమి పాపము.

క. సాగరి పుల్కుపుల్కు మను•చుం గనుచుంటి విదేమి ధర్మజా!
మొగి మది నెత్తులేక యను•మోదము పీడె నిదేల యర్జునా!
ఎగదిగఁ జూచి నేమి యన•రేమివిచిత్రము మాద్రిపుత్రకుల్!
లగువుగ నెంచి నీళ్లు నమ•లం దగునే యిది మేలె కృష్ణుఁడా?

ధర్మ—(స్వగతము.) ఈబలరాముఁ డసాధ్యుఁడై గట్టిగ దగులుకొన్నాఁడు ఇతనికిఁ గట్టి కోపమేవచ్చినది. ఇప్పుడు గోవిందుఁడైనను నిరుత్తరుఁడై కూర్చున్నాఁడు. నాకేయుపాయముఁ దోఁచకున్నది. ఉఁ కానిమ్ము! అన్నిఁటికి శ్రీకృష్ణుఁడే యున్నవాఁడు.

కృష్ణు—(స్వగతము) ఈబలరాముఁ డతిక్రుద్ధుఁడై యున్నవాఁడు. ఇప్పు డితనితో మాట్లాడినచో మఱింత క్రోధము హెచ్చును. ఇప్పుడు నే నూరకుండుట మంచిది.

అర్జు—(కృష్ణునికడఁ జేరి జనాంతికముగ) బావా! చిట్టచివరకుఁ బలరామోపాఖ్యాన మొక్కటిఁ గూడఁ దెచ్చి పెట్టితివిక దా?

బల—ఏమేమీ! ఒక్కఁడైన మాట్లాడఁడుగా? ఐన నిదిగో చూడుఁడు! (సక్రోధుఁడై.)

౦. ప్రళయోజ్జృంభితవహ్నినేత్రుఁ డల స•ర్వజ్ఞుండు రానీ, మహా
బలవద్గోత్రవిభేదనాయుధముతోఁ•బాకారి రానీ, హాళా

హాళి మచ్ఛిష్యసి మోసపుచ్చినజడుండాకూళ నాభీము నే
హాలముం గైకొని వచ్చి కూల్చెదను సవ్యం బైనయుద్ధంబునన్.

గోపాలా! తేలుకుట్టిన దొంగవలె నూరకొనెదవేమి. నిపురుంగప్పిన నిప్పుబోలు నీధర్మరాజు సహవాసముం జేసియిట్టి యపకీర్తిం దెచ్చికొంటివికదా? చిన్నప్పుడు నీవు చేసిన అల్లరి నంతయు నెట్లో సైరించితినికాని ప్రాజ్ఞుడవై నీవొనరించుచున్న యిట్టి ప్రాణగొడ్డపుంబనుల కొడలు రవులుకొని పోవుచున్నది సుమీ? తమ్ముఁడా! ఎంతపనిచేసితివోయీ!

మ. అనకృత్యం బిది యేల చేసితివి కృష్ణా! దుర్యశం బంటె యా
దవవంశంబున కెల్ల; భక్తజనసంత్రాణంబు సన్మార్గమం
దవలంబించి యొనర్పనెచ్చుఁ గద! యర్థాకాంక్షి యా ధర్మజుం
డవమానంబును నీకుఁ దెచ్చె నిది రాజ్యం బేలువాఁడే కదా!

కృష్ణు—(స్వగతము) మెత్తనివారిని జూడ మొత్తబుద్ధియఁట. ఇప్పుడు నేనూరకొను టుచితము కాదు. ఇతని మెల్లఁగ శాంతి పఱచి ఆవలకు సాగనంపెద. (ప్రకాశముగా) అన్నయ్యా! (చేయిఁ బట్టి) ఒకసారి నాకేసి జూడుము.

ఉ. చిత్తము శాంత మందఁ దయసేయుఁడు మీ రిటుఁ బాండుపుత్రకు
ల్గోత్రతగ వచ్చినారె! మనకుం బరమిత్రులు భవ్యు లందు మే
నత్తకుమారు లైరి కద! యన్యులె వీరలు? కౌరవేంద్రుచే
నుత్తలపాటుఁ జెంద మనమూరక యుండుట పౌరుషేయమే!

అన్నయ్యా! స్నేహధర్మమైన నాలోచింపక పోతివికదా? చూడుము, నిజమైనసంగడికానిస్నేహలక్షణ మెట్టిదో?

చ. కనకనలాడు వహ్నిపయిఁ గ్రాఁగి సహింపగలేక దుగ్ధము
లున్మనుకొని దానిలోఁ బడఁగఁ బూనినవేళ నిజానురాగము
న్గొని చరియించి నీరములు గొబ్బునఁ బైఁబడి యార్తిఁ దీర్చులా
గునఁ దనకష్ట మెంచక సుఖం దరిఁ జేర్చు నిజాప్తుఁ డెందునన్.

అదియునుం గాక మహనీయులైన తపోధనుల నధఃకరించిన యీపాగరుఁ బోతుపైఁ జాలిపడెద వేల?

ఉ. న్యాయము కాదు పాండవుల నాఅడిఁ బెట్టుట మాను మన్న మై
త్రేయునిఁ బాటి సేయక ధరిత్రిఁ బదాంగుళి వ్రాసి యూరువుల్
మ్రోయఁగ గొట్టి నవ్వెఁ గురుముఖ్యుఁడు; దానికతండు నీతొడల్
వాయుజుచేతఁ ద్రెయ్యు నని పల్కినశాపము [illegible]త్తవోవునే.

కావున, క్రోధం బుడిపికొని నన్ను క్షమింప వేఁడుకొనుచున్నాను.

బల — ఓహోహో! తమ్ముఁడా! నీమాట నైపుణ్యము, అభినయముతోఁ గూడిన నీవాచాలత, నీవాగ్ధాటియు విచారణశక్తి మాలిన ఆధర్మరాజుకడఁ జూపించుము. ఇట్టి మాటలతో మసిఁ బూసి మారేడుకాయఁ జేయుటకు నాముందర సరిపడదు సుమీ!

చ. పని గొని తేనె లుట్టిపడఁ బారలు చాచి వచింతు వౌర! నె
మ్మనమునఁ జింతఁ దక్కి యవమానకరంబుగఁ బ్రాణగోడ్డుఁపుం
బనులను జేసి వానిని సమంజసకృత్యము లంచు వాగ్వివా
దనిపుణత స్రహించిన నధర్మము ధర్మము గాదు మాధవా

అదియునుం గాక, తమ్ముఁడా! కామక్రోధలోభమదమాత్సర్యములు మానని ఋషీశ్వరులు వందనీయులుగారుసుమీ? గడ్డములు మూరెఁడు మీసములు బారెఁడు పెంచుకొని చీటికి మాటికి

శపించుచుండు జడదారులయందుఁ జూచుకొని నీవు దిక్కుమాలిన పనులఁ జేయుచుందువా? శాంతస్వరూపులుగాని ఋషుల వాక్యము లమోఘములగునా? ఏమూలనో కూర్చుండియెప్పుడో దుర్యోధనుని మైత్రేయుఁడు శపించెననుటకేమిగాని "నీవధర్మ దోషముఁ దెచ్చుకొందువుగాక" యని నిన్నెవరు శపించినారు చెప్పుము? కావున నీవిట్టి మాటలు మాని ఇంతటినుండియైన జాగ్రతగ సంచరింపుము.

కృష్ణు.— అన్నయా! క్షత్రియధర్మ మంతగ మనకుఁ దెలియదు సుమీ? ఏమందువా?

తే. గీ. సభను గురుపతి కన్నెఁగఁ ♦ జలిపినపుడె
వీనితొడలను దెగగొట్టి ♦ వేతు ననుచుఁ
బట్టియున్నాఁడు భీముఁడు ♦ గట్టిప్రతిన
ప్రతినఁ దీర్చుట రాజధ ♦ ర్మంబు కాదె!

బల— తమ్ముఁడా! ఇంత విచారణశక్తి మాలినవాఁడు గొల్లవాండ్రలో నీవు తప్ప మఱెవ్వఁడును లేఁడు సుమీ? ఒకసారి మునిశాప మనియు మఱొకసారి భీముని ప్రతిజ్ఞ యనియుఁ బొంకు చునాన్నావుగా?

క. ముని శపియించె నంచుఁ బలు ♦ పోకలఁబోయెద వేల? తాను చె
ప్పినపలుకుం గణింపమికిఁ ♦ జేరలుకం గొను మాని మానియే!
మునిపతిమాటయుం బవన ♦ పుత్రుప్రతిజ్ఞయుఁ జెల్లవచ్చునే?
పనిగొని నీవు పెన్దొడల ♦ పైఁ జలపింపక యూరకుండినన్.

తే. గీ. ప్రతిన నెఱవేర్చుట నృపధ◆ర్మంబె కాని
సరిసమానపు యుద్ధంబు◆సలుపవచ్చి
సమరధర్మంబు విడనాడి◆శత్రుఁ గూల్చి
శపథ మీడేర్చుకొనువాఁడు◆క్షత్రియుండె?

కృష్ణు—అన్నయ్యా! భూమిమీఁద నిలఁబడియున్నప్పుడు నాభికి దిగువ భాగమునఁ గొట్టఁ గూడదుకాని మీఁది కెగసి క్రిందున కుఱుకు నప్పు డాభాగమునఁ గొట్టుట గదాయుద్ధధర్మేతరము గాదు సుమీ?

బల— తమ్ముఁడా (చిరునగవుతో) ఇదెక్కడి కట్టుబాటోయీ! నీవొనర్చిన దోషముల సమర్థించుటకై తమంతఁ దా ముద్భవించెడు గీటకంబులవలె వేనవేలు శాస్త్రములును కట్టుబాట్లును నప్పటప్పటి కేవియో జనించుచుండును. శాస్త్రముల కేమిగాని ఈశ్వరదత్తమైన నైసర్గికవిచారణశక్తిని మాత్ర మేవియు నడఁచలేవు సుమీ? ఓయి పిచ్చివాఁడా! నేఁ జెప్పెదవినుము.

తే. గీ. సరవి ధర్మార్థకామమో◆క్షమ్ములందు
నొక్కటైనను జెడకుండఁ◆జక్కఁబఱచి,
కొనుచుఁ బ్రతినఁ దీర్చుకొనుట◆గొప్పకాని
ఇటుల నెఱిఁ దప్పి కసిఁదీర్చు◆టెంత గొప్ప!

కృష్ణు—అన్నయ్యా! నేఁజేసిన దధర్మమే యున్నను, ఇందుఁ దోషము లేదు సుమీ! దుర్యోధనుఁడు సామాన్యుఁడా యేమి?

చ. పదఁపడి భీమసేనుఁ డటుఁ◆బట్టిన పూన్కిఁ దలంపఁ డీతఁ డ
య్యది మనతప్పు కాదు; గద◆హత్తెను నాభికిఁ గ్రిందున న్విష

జదికిలి పాండవేయుల యం♦శంబుఁ గలంకముఁ జేయఁ జూనినా
డదుమఁగవచ్చు దోషచరి ♦ తాత్ము నధర్మముఁ జేసినాఁడనర్జ.

బల—తమ్ముఁడా! నీ కువాదమునకు నీవే మెచ్చుకొనవలెను. భీముఁడు న్యాయమార్గమున శపథమీడేర్చుకొనునని దుర్యోధనుఁడు నమ్మియుండును గాని యిట్లన్యాయమార్గమునఁ మాటచెల్లించుకొనునని తలంచి యుండఁడు సుమీ? తమమాటయే మాటయనుచు నితరులు చెప్పు దానినిఁ బెడచెవులం బెట్టెదు నహంభావులతో వాదముచేయరాదు. కాని ఒక్కటి మాత్రము నిజము. మీ మ్మాటికి నిజమై నిచ్చలు రంజిల్లుఁగాక. ఏమందువా! వినుఁడు పాండవులారా!

తే. గీ. ఇట్టిచెనఁటి గెల్పుఁ గెల్చి♦నట్టిభీముఁ
డెల్లకాలం బపఖ్యాతి♦ కెక్కుఁగాక
కదన ధర్మంబుఁ దప్పని♦కౌరవేంద్రుఁ
డితఁ డనశ్వర పదవి రం♦జిల్లుఁ గాక.

ఆచంద్రతారార్కమిది సత్యమై యొప్పుఁగాక. (పైనుండి పూలవర్షము కురియుటఁ జూచి.) సత్యము; సత్యము. అదిగో దేవతలు పుష్పవర్షముఁ గూడ గురియుచున్నారు. ధర్మనందనా! కా దధర్మనందనా! ఇంతనుండి నీవే రాజ్యమేలుకొనుము. ఛీ! మీముఖముఁ జూడరాదు. (అని రథానముగ నిష్క్రమించుచున్నాఁడు.)

కృష్ణు—(స్వగతము) ఈబలరాముఁడు మోమోటము విడిచి దూదినేకి నట్లు నన్నుఁ గట్టిగ నేకివేసినాఁడు. ఇతని నిచ్చటనుండి సాగనంపుటకుఁ దల ప్రాణము తోఁకకు వచ్చినది. ఈపాండవులు

ముచ్చి చేసిన బొమ్మలవలెఁ జేష్టలుడిగి కూర్చుండి యున్నవారు. కలఁకబాఱిన వీరి హృదయములను చక్కఁబఱచి మెల్లఁగ వీరి కుత్సాహము కలుగఁ జేయవలెను. ఇప్పుడేమయినది? ముందున్నది ముసుళ్లపండుగ. నేటిరాత్రి వీరలిచ్చటనున్నచో 'నశ్వత్థామ వీరిని బొలివుచ్చక మానఁడు. కావున వీరి నుత్సాహపఱచి మెల్లఁగ ద్వారకాపురమునకుఁ గొంపోయెద. (ప్రకాశముగా) ఓహో హో! బావా! ధర్మరాజా!

తే. గీ. కోర్కె తీరె రాజ్యంబు చేకూరె నను మ
సంతసిల్లక బంధునాశనముఁ జేసి
నట్టి దుష్టభీముఁడు తన్ని యపయశంబుఁ
దెచ్చె ననుకించబడుదు వే పిచ్చిబావ?

పాండవులారా! బలభద్రునిమాట మాటకాదు సుఁడీ! ఈబలరాముఁడు చిరకాలమునుండి మన మెఱింగిన బలరాముఁడేకదా? ఏమందురా!

చ. కురుపతితోడఁ వియ్యమునకుం గాను నువ్విళులూరి మిమ్ములం
బరిభవ మందఁజేసెఁ బలభద్రుఁడు; వీనిఁ గదాప్రలాఘువ
స్ఫురణునిఁ జేసినట్టి గురువృందగ న్యాయముఁ జెప్పు మన్నఁ జె
చ్చెరఁ దనవానిపక్షమునఁ జెప్పఁడె! నీరి నెఱింగి యుండమే!

అట్టి నాఁగేలుందాలుపుచెప్పెడి న్యాయమెట్లుండునో ఎఱుంగుడు?

ఆ. వె. పక్షపాతమతిని ప్రాడ్వివాకునిఁ జేసి
పాడిఁ దెల్పు మనుచు వేఁడికొన్నఁ
గాని దైన దంచు నైనది కా దంచుఁ
గదువచింపఁ డొక్కొ కరుణమాలి.

ఓపాండవులారా! నేఁ జెప్పెదవినుఁడు. మనము చేసినదానిలో గోరంతైన నధర్మములేదు. కావున మీరలట్టి సంకోచము మాని సుఖంబుండుఁడు.

దుర్యో—ఓరోరి! ధూర్తవర్తనా! నందనందనా!

సీ. గాలిగానికి మ్రొక్కి • కంసదాసుఁడు గన్న
పుత్రుఁడు పోకిళ్లఁ • బోవకున్నె?
సిగ్గుమాలిన నీవు • చెప్పిన తెఱఁగుఁ గై
కొని క్రీడి తొడలపైఁ • గొట్టకొనియె
వీర్యహీనుఁడుగాన • వివ్వచ్చు చఱపుల
నొప్పడఁగాంచి భీముండు • పొల్పుఁ దప్పెఁ
బాపకర్మము నాక • పాడిఁ దప్పినభీము
క్షత్రియుండనినీవు • చాటఁ దగునె?
గొడ్లఁ గాసి బ్రతుకు • గొల్లవానికి నింత
పొగరుఁ బోతుతనము • తగవు గాదు
నేలపాలు జేయు • నే మిమ్ము నందఱేఁ
బాడి గలిగినట్టి • పవరమైన.

(సక్రోధుఁడై)- తే. గీ. ఓరితులువ! యోరికులఘ్న! • యోరిద్రోహి!
ఎట్టిగ్రహాలక్షణంబున • బుట్టినావొ!
పుట్టినప్పటినుండియు • నిట్టిఘోర
కృత్యములఁ జేయుచున్నావు • కృత్రిమముగ.

ఒరోరి! నీచా! ఆనాఁడాశౌర్యసమగ్రుండగు భూరిశ్రవుఁ డొక్కని తోఁ బోరునట్లొనరించి చీఁకటిమాటున నన్యాయంబుగఁ గవ్వడిచే నాతనిఁ గొట్టించిన దుష్టబుద్ధివి నోరుమూసికొని సిగ్గుపడి

యుండక, ఇంకయుఁ దగుదునమ్మాయని ఏమేమో నీయన్న ప్రోలఁ బ్రేలఁ జొచ్చితివేమిరా మూర్ఖా! ఛీ! కలుషాత్మా! ఇట్టిమాయబ్రతుకు బ్రతుకుటకంటెఁ జచ్చిన మేలురా దుర్మతీ! ఓరోరి! పలుగాకీ! వృథాజల్పముల మాని ఇట్టి హీనజన్మము నొందితిని కదాయని సిగ్గుఁ దెచ్చుకొనుము?

కృష్ణు—(సక్రోధంబుగా) రేరే! ముష్కరచక్రవర్తీ! "ఇన్ని కంతులఁ గోసితినికాని నాకంతి యంతబాధ నొసఁగెడను లే" దన్నట్లిప్పుడు తొడలు విఱిగిపడిన నీవు మమ్మన్యాయపరులమని యధిక్షేపింపకుందువా? వృకోదరునిఁ బాములచేఁ గఱపించి, అన్నమున విషముఁ బెట్టించి, అగాధజలంబులం ద్రోయించి, దుర్మార్గగాములగు చెలికాండ్రతోఁగూడి సంతసిల్లిన ట్లుండదు కాఁబోలు నిప్పుడు! పాండవు లేగురుఁ గుంతీసహితులై నిద్రించుచుండిన లక్కయింటిలోఁ జిచ్చుఁబెట్టి వారు చచ్చిరని నీవును నీతండ్రియుఁ జంకలు గొట్టికొంటిరికదా! జూదపుఁ గొలువులో నీతమ్ముఁడగు దుస్ససేనుఁడు పాంచాలిని భంగపఱచినప్పు డిట్టి ఘోరకృత్యము నేలచేసెదవురా యని యదలించు మగవాఁ డొక్కఁడైనఁ గలుగకపోయె. మదోద్ధతిచే మిన్ను మన్నుఁ గానక పరుషవాక్యములాడి ఆపావనిని నీతొడలపైఁ గూర్చుండుమని సైగఁ జేసినవాఁడవు నీవుకావు కాఁబోలు నేమి? అప్పుడు నీవు వెల్లడించిన డాబుదర్పము లన్నియు నిప్పు డేగంగలోఁ గలిసిపోయినవి? నీ వేతొడలపైఁ బాంచాలినిఁ గూర్చుండమని సైగఁ జేసితివో ఆతొడ లిప్పు డేమైనవి? పోనిమ్ము. ఎట్ట యెదుటఁ దనకోడ లొక ముష్కరునిచేఁ బరిభవింపఁ బడుచుండ మామయగు ధృతరాష్ట్రుఁడైనను నోరెత్తక యూరకొనుట

పరువుగా నున్నదికాఁబోలును. నిన్నుఁ జయింపఁగల సామ
ర్థ్యముఁ గలవాఁ డయ్యు నీవు కావించిన అనేక యిక్కట్టుల
కోర్చి దుస్తరమైన అజ్ఞాతవాసదీక్ష నెఱపి వచ్చిన యీధర్మ
రాజు పంపున భాగముఁ బెట్టుమని నేను నిన్నడుగవచ్చినప్పుడు
వాఁడిసూది మొన మోపినయంతనైన భూమి నీయనన్నవాఁడ
విప్పు డంతయు నీతలఁ గట్టుకొని పోవుచున్నావు కాఁబోలు
నేమి ? మీఁదుమిక్కిలి నాగుట్టు మట్టుపఱుంగక నన్నుఁగూడఁ
జంపించుటకు యత్నముఁ జేసినాఁడవు సుమీ ! జ్ఞప్తికిఁ దెచ్చు
కొమ్ము. నీలోభమే నిన్నింతకుఁదెచ్చి అంతకుం జాలక
శాంతనవాది మహావీరుల ప్రాణహానికిఁగూడ ప్రబల కారణ
మైనదని వాపోవక నిన్ను నేనేమో మోసముఁ జేసినానని
ఏడ్చెదవేల ? భీష్మద్రోణులఁ జంపుటకై తపోయజ్ఞ ప్రభావ
ములచే నుద్భవించిన శిఖండియు దృష్టద్యుమ్నుఁడును వారినేల
నేలపాలు గావింపకుందురు ? బ్రాహ్మణుని నధఃకరించిన కర్ణుఁ
డడుగంటకుండునా ! అనేక రాజులతోఁ బెద్దకాలముపోరి డస్సి
యుండిన నాసోదరుఁడు సాత్యకినిఁ జంప సమకట్టిన భూరిశ్ర
వుని నెట్లైన వధించక ముద్దుపెట్టుకొందుమా యేమి? ముక్కు
పచ్చలారని సౌభద్రేయుని బాలుఁడని విడిచిపెట్టక ఆచిన్ని
కుఱ్ఱనిఁ బలవంతముగఁ జంపించినవాఁడవు నీవు మాదయకుఁ
బాత్రుఁడవగుదువా ? పరమపతివ్రతయైన ద్రుపదరాజనందనిం
బరిభవించిన సైంధవునిఁ బాండవమధ్యముఁడు విడిచిపెట్టి ఎక్క
డనో ఒక్కడ మీకండఱకు నోదిగి కూర్చుండవలెను కాఁబో
లును. ఇదియేనా న్యాయము ? ఇన్నిఁ జెప్పితివి కాని దుర్యో
ధనా ! ధర్మరాజు శల్యుని వధించిన విధముఁగూర్చి ఏమియుఁ

జెప్పవేల ? ఆవిషయమునైనను బాండవులు న్యాయమైన గెల్పె గెల్చిరి కదా ? పోనిమ్ము దానికేమి ? విశ్వాసవిహీనుఁడవై పొందిన యుపకారములను మఱచి బంధుజన నాశనమునకు గారణభూతుఁడవైతివి కాని కపిధ్వజుఁడు నీప్రాణముల నెన్నిసార్లు కాపాడినాఁడుగాఁడు. అవునవును. పాలుపోసి పెంచినను త్రాఁచుపాము పెంచినవాఁ డనుమాట లేక వానిం గఱవకుండునా! వేపచెట్టు నీరుపోసి పెంచినను విషఫలంబుల నీయకుండునా ?—దుర్యోధనా! జ్ఞాపకముఁ జేసికొనుము.

చ. బిరబిర నీవునుం గృపుఁడు♦భీష్ముకు ద్రౌణియు శూరులందఱు
న్విరటుని గోవులం దరిమి♦వెంబడి పోవుచునుండ నర్జునుం
డెరగలిఁ బోలితాఁకి మిము♦నెల్లర భీషణ మోహనాస్త్రము
ర్భర వివశాత్ముల న్విడిచి♦రాఁడె! శిరోంబర తృప్తుఁడై దయన్.

మఱియు నెమరునకుఁ దెచ్చుకొనుము ? దుర్యోధనా !

చ. వనముల నీవుపాండవుల♦వంచన సేయఁగ ఘోషయాత్రకే
గినతఱి చిత్రసేనుఁడను♦ఖేచరనాథుఁ డెదిర్చి నూతనం
దనుఁడట వెల్లఁబోవ నర♦దంబున నిన్ను సతీసమేతుఁ గై
కొని చనినప్డుక్రీడి యొన♦గూడఁడె? నీదెసఁ బ్రాణదాతయై.

వేయేల ? చిన్నప్పటినుండియుఁ బాండవులు నీకొకప్పుడైన నపకారముఁ జేసినవారు గారు. మొట్టమొదట ద్యూతంబను గుద్దలింగొని నీవ ఇంతవఱకు రెండువంశములను మొదలంటఁ గెల్లగించినావు. ఇన్నితప్పులు నీ నెత్తిపైఁ బెట్టికొని నాపైఁబడి ఏడ్చెదవేల ? ఇందు నేఁ జేసినదేమి ? పాండవుల పక్షమున ధర్మము రంజిల్లుచున్నది. ధర్మపరాయణుఁడనైన నేను వారిపక్ష

మవలంబించుట తప్పా? ఒకవేళ తప్పని నీబోఁటి యధర్మ స్వరూపులకుఁ దోఁచినను నే నది పాటిసేయువాఁడను గాను సుమీ? కావున నోదుర్యోధనా! ఊరడిల్లు మూరడిల్లుము.

దుర్యో—ఛీ! శుంఠా! ఇఁక నీప్రఖ్యాతి అందఱకుఁ దెలిసినదిలే. నీముఖము చూడరాదని నీసోదరుఁడు బలరాముఁడే ఇందుండి రౌద్రాకారుఁడై లేచిపోయె. నీబోఁటి సిగ్గుమాలినవానితోఁ బ్రసంగించు టుచితము కాదురా మూర్ఖా! కాని నేను సర్వవిధములచేతను ధన్యుఁడ నైతినిలే?—ఏమందువా?

ఉ. సాంతము వేదశాస్త్రముల♦సార్థముగాఁ బఠయించినాఁడ; న
శ్రాంతము బీదసాదలను♦రక్షణఁ జేసితి; యజ్ఞకోటి సు
స్వాంతముతోడఁ జేసితిని♦సంపదలం దులతూఁగినాఁడ; దు
ర్దాంత పరాక్రమోద్ధతి న♦రాతుల గూల్చి యశంబుఁ గాంచితిన్.

చ. ఇతరుల పెట్టుపోఁతల కొ♦కింతయు డోసిలి నొగ్గకుండి సం
తతమును దానధర్మము లొ♦నర్చి యధేచ్ఛగఁ జాకచక్యతం
బ్రతికిన నాల్గురోజులును♦ప్రాభవమొప్ప సుఖించి నే నవి
న్నీతసుతసంగతి స్దవికి♦నేగుచునుంటి నిఁకేమి కానలెన్.

(నేపథ్యమున) సత్యము; సత్యము; దుర్యోధనా! (పైనుండి పూల వర్షము గురియుటం జూచి)—అదిగో నేఁ జెప్పినది తథ్యమని దేవతలందఱు నేకగ్రీవముగ వక్కాణించుచుఁ బువ్వులవర్షము గురియుచున్నారు.

కృష్ణు—దుర్యోధనా! నీ వాలాగుననఁ దృప్తిఁజెందక మఱేమి చేయఁ గలవు? ధర్మరాజా! మన వచ్చినపని పూర్తియైనది. మనము

జయముం గాంచితిమి. ఈదుర్యోధనునితో నిఁక ననవసర ప్రసంగ మేటికి. పోదము రండు పాండవులారా?

ధర్మ — భాగ్యము. బావా! తావకకృపావిశేషముననేకదా పాండవు లింతవఱకు సుఖంబుగ నున్నవారు.

కృష్ణు — (పాండవులతోఁ గొంచెము ముందు నడచి జనాంతికముగ) పాండవులారా! మిమ్ముల నొక్కసారి చూడవలెనని యాదవు లందఱు నిరీక్షించి యున్నవారు. అదియునుం గాక, అడవు లలో నిడుమలం బడి పడి యిప్పుడు జయముఁగాంచిన మిమ్ముల నొకసారి నాయింటఁ గౌరవించుట మీ మఱఁదినైన నాకుఁ గర్తవ్యమైయున్నది. కావున నేఁటిరాత్రి మీరందఱు నాయింట నుండి నన్నానందింపఁజేయ వేఁడుకొనుచున్నాఁడను. ఉపప్లావ్య మునుండి ద్రౌపదినిఁగూడ నక్కడకే రావించెదను.

ధర్మ — బావా! ఇంతమాత్రమున కిట్లు మీరు మమ్ముల వేఁడుకొన వలెనా! సరిసరి మే మెప్పుడు నీవారమేకదా! అటులనే వచ్చెదములే.—

(పాండవులును, కృష్ణుఁడును నిష్క్రమింతురు.)

దుర్యో — ఔరారా! ఎంత విపరీతము సంభవించినది! కన్నకుమా రులఁ గోలుపోతిని. విక్రమధురంధరు లగు ననుజన్ముల నాఁచి కొంటి. అగ్నిసాక్షిగఁ బరిణయంబైన ప్రియురాలి నెడఁబాసితి. విశేషించి దిక్కుమాలినవాఁడనై తొడలు తెగి అపరిమితమైన బాధ పడుచు నిట్టి నిర్జనప్రదేశమునఁ బలవించుచుంటి. అక్క టకటా! నన్నుం జూడవచ్చిన రథికత్రయముఁగూడ దవ్వున కంపివేసితి. ఇఁక నాకు దిక్కెవ్వరు? హా! దైవమా! హా! హతవిధి!

[అంత నశ్వత్థామ కృపాచార్య కృతవర్మలు ప్రవేశించుచున్నారు.]

అశ్వ— మామా! ఇదియేకదా పొలికలను భూమి!

కృపా —అవునవు నిదియే!

కృత—మనకు బాటసారి చెప్పినట్టు లిం దెక్కడఁ దుర్యోధనుఁడు కానరాఁ డేమి?

అశ్వ—మామా! అతఁ డిందున్నట్లు తోఁచకున్నది సుమీ?

కృపా —కుమారా! అతనింగూర్చి వెదకుచుఁ బోదము రమ్మి?

అశ్వ—(దుర్యోధనుఁ జూచి) హా! దుర్యోధన! హా! రాజరాజ! నీ కిట్టియవస్థ సంభవించినదోయి?

సీ. కద్దు భయంకరమైన♦గాలిచేఁ గూలిన
ఫలపుష్పయుతపాద♦పం బనంగ
ఘోరకిరాతవా♦గురులలోఁ జిక్కిన
కమనీయమదకుంభ♦కలభ మనఁగ
ప్రళయకాలానల♦ప్రతిభచే నింకిన
గంభీరగర్భసా♦గర మనంగ
విపరీతకాలంబు♦పిరుపీఁకు సేయఁగా
నిల ద్రుల్లిపడినపూ♦ర్ణేందుఁ డనఁగ
వసుధఁ గూలియు నొకయింత♦వన్నె చెడక
ఇన్న రేంద్రుఁ డిచ్చోటఁ గూ♦ర్చున్నవాఁడు
కటకటా! వీనిఁ గాంచినఁ♦గడుపు చెరువు
గాదె? యేమిచెప్పుదు వీని♦కాలమహిమ!

హా! మహారాజా!

చ. పలువురు భూపులెప్డు భయ♦భక్తులతో వెనువెంట వచ్చి ని
న్గొలువఁ బసిండిగద్దెపయిఁ♦గుల్కుచు నీవిగ రాజకార్యము

న్నలిపెడివాఁడ వొక్కఁడ వ♦శక్తుఁడ వై పడియుంటి వక్కటా!
పలుకుము వేగ నిన్గనిన ♦ వారలకు న్నిలువెల్ల నీరగున్.

కృపా—అక్కటా! దుర్యోధనా! సర్వసర్వంసహాచక్రము నేకఛత్రముగ నేలిన మహారాజు భగ్నోరుఁడై నేఁ డొంటిగ నూలి యుండవలసి వచ్చినదికదా?

చ. సిరి యొనగూడె నేని నరుఁ♦ జేరఁగవత్తు రనేకమంది ము
న్గనుగని బాంధవం బపుడు ♦ సాఁగెను నందఱు సఖ్యు లేజుమీ!
సిరి చెడినప్పు డేమఁ దరిఁ ♦ జేరరు బంధువు లాప్తు లందఱుం
గరకరి లేచిపోదురు వ ♦ కావకలై చను పక్షులోయనన్.

కృత—హా! దుర్యోధనమహారాజా! ఎంద ఱెందఱినో అనదల నెప్పుడుఁ దయఁబ్రోచిన నీకిట్టి యిక్కట్టు కల్గునని కలలోనైన నెఱుంగనైతిఁగదా?

అశ్వ—అక్కటకటా! దుర్యోధనమహారాజ!

సీ. ఎండక న్నెఱుఁగని♦యొకిమీఁదు గొడుగు లే
కయె యెండలోఁ బడి♦ క్రాఁగవలసె
సరిగంచుధౌతము♦ స్ధరియించు రారాజు
మట్టికి గుడ్డలలోన♦ముడుగవలసె
పన్నీటి స్నానంబుఁ♦బచరించు భూపతి
ధూళివాటిన మేనఁ♦ దొర్లవలసె
కమ్మతెమ్మెరసోఁకఁ♦గనుగందు భూవరుం
డూపువుత్తైగ బాధ♦కోర్వవలసె
భోగిఁ జోగిఁ జేయు♦జోగి భోగి నొనర్చు
చంచలాత్మమైన♦మించుఁబోఁడి

పూఁతపసిఁడిమంటి♦పోలువుఁ గుల్కెడునారి
కలిమి పడఁతి కెందు♦గలదు స్థిరము?

కృపా—రాజా! మాకేమియుం జెప్పక మిన్నకున్నచో నేమిలాభము?

అశ్వ—ఇదిగో రాజరాజ! ద్రోణాయుని జీవితుండై యుండ నీకేమి భయము?

ఉ. నాకనుపండువై మెలఁగి ♦ నారలు వారల భీష్మకర్ణులే
నాకముఁ జేరియుండి రిఁక♦న న్నెవరుం దిలకింపరంచు దుః
ఖాకృతి నుండరాదు; నినుఁ♦బ్రాణపదంబుగఁ జూచు ద్రోణినే
నీకయిఁ బ్రాణమైన నిడ♦నిల్చితి నీదగునిష్టసిద్ధికై.

అనన్యశత్రురాజన్యభీకరుఁ డైన ద్రోణాచార్యపుత్రమిత్రున కింత తీవ్రవేదనం గూర్చిన ఘోరచరిత్రుఁడు తప్పక దండితుఁడు కాక మానఁడు. ఆదుష్టబుద్ధి యెవ్వఁడో సత్వరితముగ వచించుము రాజరాజా!

కృత—నెచ్చెలికాండ్రమైన మాకుఁ జెప్పక కప్పిపుచ్చు టుచితము కాదుసుమీ రాజా!

దుర్యో—రథికవరేణ్యులారా! యుద్ధరంగమున జయాపజయములు దైవవశంబులు. కావున,

చ. ఒకపరి సంతసంబు, మఱి♦యొక్కపు డార్తియు వచ్చుచుండుఁ దా
నికి జనుఁ డాత్మ మోదమును♦నెంజిలిఁ బొందఁగరాదు రెంటిలో
నొకటిగఁ జూచుమానవున♦కొచ్చెములేని సుఖంబు గల్గుఁగా
ని, కపటవర్తనంబున న♦ని న్నను శత్రులు గూల్చవచ్చునే?

అశ్వ—రాజా! కపటవర్తనమా! ఏమేమీ! మామా! మోస మార్గమున నీమహారాజు నీపాటునకుఁ దెచ్చినవారు పాండవులేనా?

కృపా — పాండవులేయని చెప్పుట కెట్లు వీలుపడును?

దుర్యో — ద్రోణాయనీ! అధూర్తగోపాలుఁడు పాండవపక్షపాతియై యుండునంతవఱకుఁ బాండవు లధర్మవర్తనులుగాక మఱే మగుదురు?

తే. గీ. కొంతికొడుకులు వరసత్యవంతు లనుచు
కాని తెలిసెఁబో వారి ప్రఖ్యాతియెల్ల
కపటవర్తను లవినీతి కార్యరతులు
నమ్మవచ్చునె వారి స్వప్నముననైన?

మరియు

ఉ. మాయలమారికృష్ణుఁ డభిమానపథంబు వహించి యింతయు
న్యాయముఁ జేయఁగా జను లనారత మాతనిఁ దేవుఁ డంచు నా
ప్యాయముగాఁ భజించెద రబద్ధము మోస మధర్మమార్గముం
బాయని దేవునిం గొలుచుమానవు లొందరె! తద్గుణంబులన్.

నాకును వృకోదరునకును నిప్పుడు జరిగిన గదాయుద్ధమందు ధర్మాధర్మములఁ గనిపెట్టుచుండిన బలరాముఁడే ఇందుకుసాక్షి.

అశ్వ — ఏమేమీ! ఇంతలో హలధరుం డిటకు వచ్చుటయు వెళ్లుటయుఁ గూడనా! ఇంతలో గదాయుద్ధ మయ్యెనా? (ముక్కున వ్రేలుంచుకొని) మామా! చూచితివా! ఇంతలో నెంతవింత జరిగినదో?

కృపా — రాజా! ఇంత అధర్మము జరిగినప్పుడు సీరిచూచి యూరకుండెనా!

దుర్యో — ఆచార్యోత్తమా! అయినదాని కేమయిన నేమి?

కృత — ఇప్పుడుగూడ మోసముఁ జేయించినవాఁడు కృష్ణుఁడేకద?

దుర్యో — అందుకు సందేహమేమి?

అశ్వ—రాజా ! గదాయుద్ధమునఁ జరిగిన యధర్మమేమి ?
దుర్యో—అట్టియుద్ధమున నాభికిఁ దిగువభాగమునఁ గొట్టుటయే ?
అశ్వ—ఔరా ! ఇదియధర్మమే. ఇంత యధర్మ మెందైనం గలదా ?
దుర్యో—పోనిండు. దాని కేమి ?

చ. అకట! పరాక్రమాన్యులు మ॥హాత్ములు ద్రోణసరిత్తనూభవుల్
మొకమునఁ గట్టినట్లు మును॥ముందటఁ గన్పడుచుండ నొంటినై
వికలతనున్న న న్గపట॥వృత్తి నరు ల్పడఁగొట్టి సత్పథం
బై కలుగజేసి రైన నొక॥మే లొదవె న్మిముఁ గాంచినందునన్.

ఏకరుఁడనై యున్న నాయొక్కని బాహుబలవీర్యధైర్యస్థైర్యములు పాండవులకుఁ దలమున్కలై చనుటంజేసి పాపము వా రిట్టి మోసమార్గ మవలంబించినారు. అందువలనఁ బాండవు లోడి పోయినారని యెంచవలసినదే కాని జయించినారని చెప్పుటకు వీలులేదు సుమీ? ఎవ్వరు జయించిన నేమి వారి యధర్మము మాత్రము వెల్లడియైనది. నాకంతియ చాలును. కాని ద్రోణా యనీ ! భీముని ఆతతాయితన మొక్కటి మాత్రము రోష ఖేదములఁ గల్గించుచున్నదోయీ ! ఏమందువా ?

చ. అరులు జయించినా రనఁగ॥నార్తి జనింపదు; రాజరాజనా
బిరుదు వహించి లోకమునఁ॥బేరుప్రతిష్ఠలఁగొన్న రాజశే
ఖరులు తల న్వహింపఁ దగి॥గౌరవ మందిన నాతల న్వృకో
దరుడుఁటఁ దన్నినప్పు డెదఁ॥దాకెనె ఖేదము ద్రోణనందనా!

అశ్వ—(సక్రోధుఁడై) ఓరోరీ ! చండాలా ! భీమసేనా ! ఎంత పాప కర్మముఁ జేసితివిరా !

కృపా—కుమారా! చూడుము. క్రోధస్వభావ మెంత యనర్థ దాయకమో!

కృత—ఇట్టి దుండగంబున కాభీముఁడు తప్పక దండితుఁడు కావలెను సుమీ?

దుర్యో—ఓగురుకుమారా! క్రోధముఁ జెంది నీ విప్పుడేమి చేయఁగలవు? అందుకుఁ గారణము లేకపోలేదు సుమీ! ఏమందువా?

చ. కడుపునఁ బొంగుదుఃఖ మెగఁ ద్రక్కుచు నుంటిని కాని పార్షతుం
డుడుగక నీదుతండ్రి కురు లొత్తిలిపట్టి గళంబుఁ ద్రున్నినన్
వడవడ నూరకుంటి మట వీర్యవిహీనులఁ బోలె నందుచే
వడముడి నన్నుఁ దన్ను మగవాఁ డగుచుం దఱిఁ జేర రాఁడొకో!

మనము చేతులారఁ జేసికొన్నదానిని మన మనుభవింపక తీఱదుసుమీ? వీరవరేణ్యులు భీష్మ ద్రోణ కర్ణాదులు యుద్ధరంగమునఁ గూలినను నంతటి మహావీరులు మీరు మువ్వు రున్నవారుగదా యని సంతసిల్లితిని. కాని—ఇంతకు—

ఉ. పాండునృపాలపుత్రకుల పక్షముఁ జెందిన కృష్ణ వంచనా
పాండితిలో నెఱింగియును భండనమందున మీరు నాకుఁ బ్ర
హ్మాండముఁ జేతురంచు ముద మందితి నైనను జ్యేష్ఠ నాపయి
న్దాండవ మాడుచున్నపుడు ద్రౌణి యశక్తుఁడుగాక శక్తుఁడే!

అశ్వ—(సక్రోధుఁడై) ఏమేమీ! దుర్యోధనా! సర్వశత్రుగర్వలతాలవిత్రుండగు ద్రోణపుత్రుఁ డశక్తుఁడుగాక శక్తుఁడగునా యనుచుంటివా! అయిన నిదిగో చూడుము.

శా. అస్త్రాత్మం దరుదెంచిన స్సరియె; స్ప•ష్టాహంకృతిం జూపియా
ధృష్టద్యుమ్నునిఁ జంపి మజ్జనకు సం•తృప్తాత్ముఁ గావించి యా
దుష్టస్వాంతులఁ బాండవేయులను దో•ర్దర్పోద్ధతిన్ ద్రుంచి యే నిన్ను సం
తుష్టుం జేయకయున్న న న్ననకుమీ•ద్రోణాయనీయం చిరన్!

అబ్బా! నీ దీనాలాపములను విన్నప్పటినుండియుఁ గడుపులో ఘుండి
పోవుచున్నదోయీ?

చ. పగఁగొని పాపమార్గమునఁ•బార్షతుఁ డప్పుడు నాదుతండ్రిఁ జం
పఁగఁ గని పాండుపుత్రకు ల•పార ముదంబునుఁ బొందిరన్న దా
దిగ మదిఁ గాల్చుచున్న యతి•తీవ్రఁపుఁ గ్రోధఁపు టగ్ని జ్వాలయై
బగబగ మండఁజొచ్చెను భ•వత్పరిభావఘృతప్రసక్తిచేన్.

ఓరోరి క్రూరకర్ములారా! ఇదిగో వినుఁ డియశ్వత్థామ ప్రతిజ్ఞ.

ఉ. రోష మవార్య మై ప్రబలి•క్రోధముతో గవగూడి నిర్దయా
భీషణవజ్రభావమును•ప్రేరణఁ జేయుచు నుండె; రేయిఁ బ్ర
త్యూషము కాకమున్నె చని•ద్రోణతనూజుఁడు పాండువంశని
శ్శేషము గాగ నందఱి న•సింహ దునుమాడును కాచుకొం డిఁకన్.

ఛీ! ముష్కరులారా! పాండవులారా! నేఁటితో మీ కాయువు చెల్లి
నది కాఁబోలును. ఏమిరాజా! మిన్నకుంటివేమి? (అని కత్తి
ఝుళిపించి)

ఆ. వే. రోషవహ్నిఁ గాల్చి•క్రోధోపలంబుపైఁ
బదును వెట్టిన కర•వాలు మిదిగొ
పట్టినాను నేఁ డ•పాండవ మొనరింప
నాజ్ఞ నొసఁగు మిప్పు•డైన తేఁడ.

దుర్యో—(స్వగతము.) ఔరౌరా! బంధుమిత్రసుతసోదరులం గోలుపోయి చిట్టచివరకుఁ దొడలు తెగి పడియున్న నా కింకయు నాశ జనించుచునే యున్నది. ఆహాహా! కాయమునకుఁ దొడలు తెగినను నాయాశకుఁ దొడలు తెగినవి కావుకదా? ఈ అశ్వత్థామ సాధారణుఁడు కాఁడు. ఇతని కిప్పుడు తీవ్రమైన క్రోధము జనించినది. ఇట్టి సమయమున నితఁ డొక్క పాండవులనే కాదు ఆమాయులమారి కృష్ణుని సహితము రూపుమాపఁగల సామర్థ్యముఁగలవాఁడు. కావున నే నిప్పుడితనిని సైన్యాధిపతిం జేసెద. ఇందునఁ బోయిన దేమున్నది. పోయినచో నే బోవలెఁ గాని ఇఁక బోవువా రెవరు? చిట్టచివరదీయుద్యోగ మెట్లగునో చూచెదఁ గాక. ఔరౌరా! ధర్మరాజు జూదమునోడిన కొలందిఁ బందెముల నొడ్డినట్లు నేను యుద్ధమున నందఱిం గోలుపోయినకొలఁది యుద్ధప్రయత్నమే కావించు చుంటిని కదా! (ప్రకాశముగ.) అన్నా! ద్రోణనందనా! నిన్ను సేనాధిపతిం జేతు నని చెప్పట కిప్పుడు నో రాడకున్నది. సైన్యమా శూన్యమయ్యె! పరికరములా పూజ్యములు. అవి కలిగినప్పుడు కర్ణునిపైఁ గల మోహము నన్నుఁ గన్నుగ్రమ్మినది. అయిన నో ద్రోణాయనీ!

చ. సకలచమూపతుల్ వెలుఁగి సైన్యములం బరికొల్పు మంగళో
పకరణశోభితంబుగ ద్విపప్రభటాశ్వసమూహ మొప్పఁగాఁ
బ్రకటితభంగి నిన్నుఁ బడవాలుగఁ జేయని నన్ననుగ్రహిం
చి కలతఁ దీర్చుమయ్య! యభిషిక్తునిఁ జేసెద ద్రోణనందనా!

కృపా—నిష్క్రమించి నీరము దెచ్చుచున్నాఁడు.

దుర్యో—(కృపాచార్యుఁడు దెచ్చి ఇచ్చిన నీరముల నశ్వత్థామకరముల యందు విడుచుచున్నాఁడు.)

అశ్వ—(సక్రోధుఁడై) ఓరోరీ ధృష్టద్యుమ్నా! శవమై పడియుండిన నాతండ్రి గొంతుఁ గోసి కసిఁ దీర్చి కొంటి నని కులుకుచున్నావు కాఁబోలును, ఓరోరిపాండవాధములారా! అన్యాయ విధమున రాజరాజుతోడలం దెగఁగొట్టి జయించితి మని మీ శిబిరంబున స్మారకముఁ దప్పియున్నారు కాఁబోలును. ఓరోరి పాపాత్ములారా! ఇదుగో అశ్వత్థామ తోఁక ద్రొక్కిన త్రాచువలెఁ బగఁ బట్టి వచ్చుచున్నాఁడు కాచుఁకొనుఁడు, మామా! కృపాచార్యా! కృతవర్మ! మీరుఁ గూడ లెండు పోదము. వింటిరికదా నాప్రతిజ్ఞ. ఆలస్యముఁ జేయకుడు లెండు, లెండు.

కృపా—కుమారా! ఇప్పు డెక్కడకు బోఁగలము? అదిగో సాయంతనసమయ మైనది.

కృత—కుమారా! ఇట్టిఘోరప్రదేశమున దుర్యోధను నొంటిగ వీడుట భద్ర మని తోఁచకున్నది. కావున నితని నిం దెచ్చట నైన ఘోరమృగనిర్భయప్రదేశమునందుంచవలయును.

కృపా—ఆలాగునే చేయవచ్చును.

అశ్వ—ఆహాహా! మామా! పక్షుల కైన నెంతగుణగ్రహణశక్తియో చూడుము. ఆపక్షులకున్న విశ్వాసము మానవుల కైన లేదు సుమీ? చూడు మాపశ్చిమదిక్కునఁ బతంగుఁ డేమిచేయుచున్నాడో—?

చ. ఇల ద్విజవంశకల్పతరు • విద్విజరాజకులీనుఁ డియ్యెడ
న్బలమఱి కూలి యుండెఁ దమిఁ • బట్టగఁ గొమ్మయుఁ గానరాదు మా
కొలమున కెంత వచ్చెనని • గొల్లున నేడ్చుచునున్నవో యన
న్గొలకొలపక్షు లెల్లెడలఁ • గూయఁ బతంగుఁడు వార్ధిఁ గ్రుంకెడిన్.

ఏమి రథికవరులారా! జాగు చేసెదరేల? మీరు రారా యేమి? అయిన నిదిగో చూడుఁడు.—

తే. గీ. పాండవాస్త్ర దోషంబు • పర్వ ననఁగ
నెటికి చీఁకటి నల్దెస • ల్గ్రమ్మదలు కొనియె
గుహ్యకోద్యాని మిణుఁగురుఁ • గూడుచుండె
రేయిటే యేగెదఁ జుండి నే • నేకసంధ.

(అని రథసంఘముఁ గనఁ బోవుచున్నాఁడు.—

కృపా—కుమారా! అంత తొందర పడెద వేల? నీతో మేముఁ గూడ వచ్చుచున్నారము. ఆఁగు మాఁగుము.

(దుర్యోధనుని మఱొక్కచోట సురక్షితముగ భద్రపఱచుటకై మెల్లఁగఁ దీసికొని ముగ్గురు నిష్క్రమించుచున్నారు.)

అవనిక జారును.

ఇది తృతీయాంకము సంపూర్ణము.

శ్రీ

# ప్రసన్న పాంచాలీయ నాటకము

## చతుర్థాంకము.

ప్రవేశము—పాండవశిబిరప్రాంతము.—

ప్రవేశము—అశ్వత్థామకృపాచార్య కృతవర్మలు.—

కృపా—(ఆయాసము నభినయించుచు) కుమారా మన కీవృథాయాస మేల?

కృత—ద్రోణాయనీ! మిత్త్రునకు పల్లమనకు ఈగాఢాంధకారమునఁ గాళ్ళు మనల నెక్కడికో ఈడ్చుకొని పోవుచున్నవి సుమీ! మనకర్తవ్య మేదియో గంతవ్యస్థాన మేదియో మనలకే తెలియ దయ్యె!

కృపా—నాయనా! ద్రోణనందనా ఇప్పుడు నీయుద్యమము కొనసాఁగు నని తోఁచకున్న దోయీ! ఏమందువా?

ఉ. మాయగఁ బర్వి చీఁకటి సమస్తజగంబును నేలుచుండెఁ; గో
మ్మాయువు లూళలం జెలఁగె మాఁటు మడంగిరి మంది; ఘూబలుం
గూయఁ దొడంగె; బెబ్బులులు గొంది లుచున్నవి. గింగుర ధ్వని
జ్జేయుచు నుండెఁ జిమ్మటలు; చివ్వ నొనర్తుమె చిమ్మచీఁకటిన్?

కృపా—కుమారా! నేనింతవఱకు నిద్రించుచునే నడచుచున్నాను సుమీ!

(నిద్రనభినయించుచు.)

ఉ. నిద్రను మానవాళికి మనీష నొసంగు రసాయనంబుగా
భద్రము జేసినాఁడు భగవంతుఁడు; సృష్టిని జంతుకోటికి
న్నిద్రయె జీవనామృతము; నిష్ఠగ హెచ్చను తగ్గులేక ని
ర్నిద్రతఁ దీని వాడెడిమనీషి వసించును పెద్దకాలముల్.

కృపా—కుమారా! మనకృతవర్మకుఁ గాఢనిద్ర వచ్చుచున్నది. నేనును గడుడస్సి యున్నవాఁడ. ఇంతకు మన మిప్పుడు చేయఁదగిన దేదియు లేదు. కావున, మన మిప్పు డిచ్చట నొకించుక విశ్రమించి ప్రభాతమున సంగతిఁ జూచుకొందము.

అశ్వ—మామా! ఈరాత్రియే కష్ట మనుభవింతుము కాని అనుదినము నిట్టిప్రయాస మొందుదుమా యేమి? చూడు మిచ్చట నేదియో మహావృక్షము గన్పట్టుచున్నది. (అని సమీపించి) మామా! ఇది యొకమఱ్ఱిచెట్టు. ఆహాహా! ఏమి దీని విజృంభణము.

సీ. ఫలమిచ్చునంతనె నిలువెల్ల నీరుగా
నిలఁ గూలుకదళి యదేటి దాత?
ఒడ లొల్చి కన్నులం బొడువగా జలమిచ్చు
నట్టి నారికడ మదెట్టి దాత?
ఒకవేళ ఫల మిచ్చి యొకవేళ నింతైన
నీయని మావి యదేటి దాత?

పడికాపుఁ గాసిన♦న్ఫలము రాల్చక కొన
నీటువోయెడు నిత్తు♦ వేటిదాత?

అనుచుఁ దరువుల నిరసించి♦యఖిలపక్షి
జాలమునుఁ బాంథతతి నని♦శంబుఁ బోవఁ
దివిరి శాఖోపశాఖలు♦దిక్కు లంట
వీఁగి వినువీధి నొఱయు నీ♦విటపిఁ గనుమి?

ప్రపా—ఆహాహా! భగవత్సంకల్పము?

క. అతిసూక్ష్మస్థితినుండి మానవుఁడు ది♦వ్యోన్నత్యముం బొంది స ద్గతికి న్రావలె నంట కీశ్వరుఁడు తా♦ర్కాణంబుఁ జూపింప స ల్పతరంబౌ కనరాని విత్తనమునా♦పాదించి యందుండివి స్తృతమై పాంథ శకుంతవాసమగు నీ♦వృక్షంబుఁ గల్పించెనూ!

ప్రత—ద్రోణాయనీ! ఇమ్మహీజము మన కలభ్యయోగముగఁ బెట్టని కోటయై సమకట్టినది. కావున నీచెట్టుక్రింద నొకించుక సేపు విశ్రమింతము.

ప్రపా—కుమారా! పిలువఁ దోడును నిలువ నీడయు లేని మన బోఁటి బాటసారులకు భగవంతుఁ డీచెట్టునీడను దోడునీడగఁ జూపించినాఁడు సుమీ? ఆహాహా! ఏమి ఈభూమిజము యొక్క చల్లఁదనము. కమ్మతెమ్మెరల వీచుచుఁ జల్వనొసంగు చున్న యీవృక్షమునీడ నడుగుపెట్టినవాని కెవ్వనికైన హాయిగా నిద్రరాక మానునా? ఆహాహా! ఘాతుకమృగసమావృతంబైన విపినంబునుంబోలు నీప్రదేశమున శయనించు మనబోఁటి దిక్కుమాలిన వారి కాదీనదయాపరుఁడైన భగవంతుఁడే దిక్కు.

ఓకళ్యాణ స్వరూపా! ఓఅనంతా! ఓ-ని-త్య-స-త్య-వ్ర-తా!
(అని నిద్రించుచున్నాఁడు.)

కృత—ఓనిర్హేతుకజాయమానకరుణాపయోనిధీ! నీ పరిశుద్ధమైన మహిమయే సర్వలోకములయందును రాజ్యముఁ జేయుచున్నది. నీవిలాసమన్ననో మహోన్నతావహమై చెన్నుమీఱుచున్నది. ఆహాహా! నిర్మలమై నక్షత్రశోభాయమానమై రహించుచున్న ఆకాశము నీమహిమనే వేనోళుల జాటించుచున్నది. ఓకళ్యాణ గుణాభరణా! ఇట్టి సమయమున మమ్ములఁ గాచు భారము నీదే అయి యున్నది. ఈ అవస్థయందు మా దేహము ప్రాణము వేయేల మాసర్వస్వమును నీకే యర్పించితిమి. ఓతండ్రీ! ఓనిర్వికల్ప! ఓదీనశరణ్యా! (అని నిద్రించుచున్నాఁడు.)—

అశ్వ—ఈరథికవరుల కెంతలో గాఢనిద్ర పట్టినది!

చ. కృప కృత వర్మ లీతరువు♦క్రిందునె నిద్దురవోయి రక్కటా!
నృపుని విపద్దశందలచి♦నెవ్వగఁ గుందుచు వాడివత్తలై
వపువుల మాటయే మఱచి♦వ్రాలిరి కర్కశమీాధరాస్థలి
న్నృపుల పరాక్రమాఢ్యులగు♦వీరవరేణ్యుల కెంత గల్గెగా!

ఔరౌరా! మహానీయుఁడైన ఈకృపాచార్యునిఁ జూచిన కొలంది నాకు దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నది.

చ. అమల మనీషయుం జరత♦రానుభవంబునుఁ గల్గు వృద్ధుఁ డీ
సమరకళావిశారదుఁడు ♦ సద్గుణశాలి సమస్త రాజధ
ర్మములఁ నెఱింగినట్టి జన♦మాన్యుఁడు; మజ్జనకాప్తుఁడీ; కృపుం

రారా!—తే. గీ. నలిన హీనంబులైనట్టి•కొలఁకులట్లు
కలిమి జవరాలు మెచ్చని•కవులపోల్కి
రాజరాజును వీడి యీ•రథికవరులు
జాలిఁ గొల్పుచునున్నారు•స్వాంతమునను.

టకటా! నేను వీరివలె నిద్రించుటకైన నోఁచికొనలేదా?

౹. గోవృషకేతనుండు గుఱు•కొట్టుచు నిద్రిలె; స్థానభేదమ
న్భావ మొకింతలేక కృత•వర్మ నిజాంగముఁ గాచు భారము
న్దైవునిపైనిఁ బెట్టికొని•నిద్దురవోయెను; నేను నిద్దురం
బోవుటకైనఁ గన్నులవి•మూయవు జ్యోతులఁ బోలి వెల్గుచున్.

నిద్రాదేవీ! నీవైనను నాకు సహాయపడి సుఖంబుఁ గూర్చలేవా?

౹. పగలిఁట మానవుండు బడు•బాములనెల్ల నిమేషమాత్రిలో
నగపడనీక నిర్మల సు•ఖానుభవంబున నాత్మ రంజిల
న్నగలను దూరమందునిడి• వచ్చెడితల్లి సుషుప్తి! నాదుక
న్నుఁగవ వసించి నామదిని•నూల్కొనఁ జేయఁగదమ్మ ప్రమోదమున్.

కానేను, నాబోటివానికి నిద్రరాకపోవుట సహజసిద్ధమే? ఏలయన!

౹. జనకు నధర్మమార్గమున•శత్రులు చంపినతీరు ప్రక్కఁ గ్రు
చ్చిన నిసితాయుధంబటులఁ•జిచ్చెదఁగొల్పి దహింపఁ గౌరవేం
ద్రుని పరిభావము న్వినఁగఁ•దాఁకిన క్రోధపు టగ్నిచుమ్మ చు
ట్లొనరుచుచుండఁ బాండవ, వ•ధోన్ముఖుఁ డెట్టుల నిద్రవోయెదున్?

గౌరవేంద్రునికడఁ గడుం గృద్ధుఁడనై ఈరాత్రి ప్రత్యూషముగాకము
న్నపాండవవంశ మపాండవముఁ గావింతునని గట్టిప్రతినఁ బట్టితి.
సైన్యమా శూన్యము. పరికరములా పూజ్యములు. మఱి
పాండవులా అనన్యపరాక్రమధుర్యులు. అదిగో ఇప్పుడు రాత్రి

రెండుయామము లైనది. నే నొక్కఁడ నిప్పు డేమి చేయఁగల వాఁడను? కటకటా! అపాండవ మొనరించుట కుపాయ మేదియుఁ దోఁచకున్నది. ఎట్లో కదా? (అని తల పంకించుచుఁ జెట్టుపైకిఁ గలయఁ బరికించుచున్నాఁడు.)— ఆహాహా! ఈ చెట్టు మీఁద నొక ఘోరహింస జరుగుచున్న దే!—

చ. మెఱుఁగుల నీను టెక్కలను మెల్లఁగ సంకుచితంబుఁ జేయుచు న్గొఱవులఁబోలి వెల్గు మిడిగ్రుడ్లను నిట్టటు నామిషంబుకై నెఱపుచుఁ గుడ్లగూబ కడు నేర్పుగ సుప్తములైన కాకులం దఱచుగఁ జంపుచున్న దలదండధరంబలె భీతిఁ గొల్పుచున్.

ఆహాహా! ఏమి దీని పరాక్రమ విశేషము! ఔరౌరా! ఈఘూక రాజము మెల్లమెల్లఁగ జొంపములమధ్యకుం బ్రాఁకి కాకి మూఁకల నన్నిటిఁ దనపాట్టఁ బెట్టుకొనుచున్న దే? కటకటా! ఏమి విచిత్రహింస.

క. కొన్నిఁటి నెఱకల నఱుకుచుఁ
గొన్నిఁటిఁ జరణములఁ ద్రుంచి కొన్నిటిదలల
న్దన్నుచుఁ గొన్నిటిఁ గన్నన
వెన్నముకలఁ గూల్చుచుఁ గనుఁ బ్రేఁగుగ మించెన్.

ఆహాహా! ఈవృక్షరాజముపై నిద్రాణములై పడియున్న కాకానీకము లీగూబ కేమి యపకృతిఁ గావించెనో కదా!

ఛ. వెఱపన చేట; ఘూకమిది సేగిగఁ గుంద్రలు కొల్పుచున్నది న్వాలపతి క్రూరబుద్ధిఁ గని వృక్షముమీఁద సుషుప్తిఁ జెంది మే నెఱుఁగని కాకిమూఁకలను స్వేచ్ఛగఁ గొన్నిఁటిఁబట్టి గొంతుల న్గొఱుకుచుఁ గొన్నిటిం గఱకుఁ గోళ్లనుఁజీఁజి వధించు టేలొకో!

ఇట్టి ఘోరహింస కేదియో ఘోరకారణ ముండి తీరవలెను.

ఉ. అంబక దృష్టిలేని సమ•యంబది కాకులు జూచి యాయులూ
కంబునుఁ గన్న కౌశికముఁ•గాఱియ వెళ్లెనొ ? దీనిమిత్రుఁ గా
కంబుల ధర్మమార్గమునఁ•గాళ్లను దున్చెనొ ? లేకయున్న ఘూ
కంబున కింత క్రోధ మనఁ•గా విపరీతము కాదె చెప్పఁడా ?

యందున్నకైన నొక్క కాకము నుంచనని వ్రతమూనినది కాఁబోలు నీగూబ. ఏమి దీని ఉపాయవిశేషము ?

క. వాయస వంశమంతయున•వాయసముం బొనరింపఁబూని యీ
రేయి నులూకమిట్లు చెల•రేఁగి వధించుచు నున్న దన్నిటి
న్నాయురె ! గ్రుడ్లగూబ యిది•మానుషవృత్తిఁ జరించి తద్వ్యపో
పాయముఁ బన్ని యింత చల•పాదితనంబునఁ గోర్కెవం దెఁగా !

హా ! ఈఘూకరాజము కఱదులుగలి పులుఁగని చెప్పుటకు సందియము లేదు. మఱి దీని ప్రారంభబలమునకు దైవబలముకూడ సహాయపడినది. ఆహా ! ఏమి దీనిపుణ్యము ? నిద్రావస్థలో నున్నవానినిఁ జంపవచ్చునా ! చంపఁగూడనియెడల నీరాత్రివేళ నీవిధముగ నీకౌశిక మేల చరించినది ?

కం. అరయ న్నిద్రాణములో
వరటంబుల నైనఁజంపి•వైరముఁ దీర్పం
బూరయుదు పాపంబని యీ
శ్వరుఁ డీఘూకమును నాకు•సమకూర్చె నొకో !

చిరాత్రి తెల్లవాఱకమునుపు పాండవవంశ మంతయు నపాండవముఁ గావించు టెట్లాయని తలపోయుచున్న నాకుఁ దీనిమూలముగా భగవంతుఁ డుపాయముఁ దోఁపించుచున్నాఁడు గాఁబోలును.

కం. కాకున్న నిద్రఁబ్రోయెడి
కాకములను నిర్దయఁగొని•కౌశికము వెసఁ

దాఁకు తెలుఁగు నాదృష్టిం
దాఁకునె? యిచ్చోటఁగాక • తాలీయముగాఁ.

ఓహో హో! ఈగుడ్లగూబ నాకిప్పు డేమని బోధించుచున్నది?

కం. అరుదైనది ఘూకంబిది
గురుపదముగఁ నాకిపు డౌన • గూడిన దిచ్చో
గురుసుత! పాండవు లందఱఁ
బొరివుచ్చు తెలుఁగిదె యంచు • బోధనఁజేసెఁ.

వేయేల, దీని మాదిరినే నేనుఁగూడ వర్తించినచో నీరాత్రియు అపాండవము కాగలదని నాకు నమ్మిక పుట్టుచున్నది.

చ. తెలిసెఁ గురూపదేశమిఁకఁ • దీనికి శిష్యుఁడనై తిఁ బాండవు
ల్గల శిబిరంబుఁజొచ్చి యట • గాఢముగా నిదురించువారి ని
ద్రాలఁగఁగనీక యందఱిని • దుస్మద నీ నిశవేళ ఘూక మీ
వులుఁగుల నర్ధరాత్రిఁ బొలి • వుచ్చినరీతి ప్రమాణ మిత్తఱఁ.

కాని ఇంకయు నాచిత్తము శంకాయుత్త మగుచునే యున్నది. గుడ్లగూబకును నాకును భేదమున్నదికదా? నేను మానవుఁడను. అది యొక్కపక్షి. పక్షియు మానవునివలె హేయములైన అస్తిమాంసములచే నిర్మింపఁబడిన దయ్యును తగు విచారణ శక్తి లేనిదగుటచే నది నరున కులిగాడగుచున్నది. నరుఁడైన వాఁడు నిద్రావస్థలో నున్నవారి నమాంతముగ జంపవచ్చునా? సరియే, కూడదని నా యంతరాత్మ నాకు బోధించుచునే యున్నది. మఱి యిఁక, నాప్రతిజ్ఞను దీర్చుకొనుటకు వేఱొక్క విధము తోఁచకున్నదే?

చ. త్వరపడి పాండవాన్వయమ మంపాండవముం బొనరింతునంచు నేఁ
గురుపతి మోలినిప్పు డతిక్రోధముఁబూని ప్రతిజ్ఞఁబట్టినా
నరయఁగఁ బాండవేయులు మహాత్తర వీరవరేణ్యు లొంటినై
యురవడి వారిపైఁ బడుటయోజన కాదిఁక నేమిసేయుదున్.

మఱియు—

చ. వఱియగు కర్జ్యమున్నలిపి శత్రులఁ గూల్చుట మేలెకాని యే
వెరవునఁ జూచుకొన్న నదివీలని తోఁచకయుండెఁ బంకము
న్నెరవక పోతినేని ననునీచముఁజేయు సుయోధనుండు సు
స్థిరముగ నేను పట్టుదలఁదీర్చుటె ముఖ్యముగాఁ దలంచెదన్.

అయిన, ననుభవశాలురయిన కృపాచార్య కృతవర్మలను మేలుకొల్పి వీరి యభిమత మెట్టులుండునో కనుంగొనియెద. మామా! మామ! అబ్బా ఎంతగాఢముగ నిద్రపట్టినది! కృతవర్మా! కృతవర్మ! ఇఁక నీకుఁ బడినదే పాటు కదా!

కృపా—(లేచి కన్నుల నులుముకొనుచు) ఔరా! ఈచెనఁటినిద్ర లజ్జయు భీతియు నెఱుఁగదు కదా? రాజరా జావిధమ్ముగఁ దొడలుతెగి కుందుచుండుట యేమి! మేమిట గాఢనిద్రకుం బడుటయేమి! ఛీ! ప్రపంచములో నిద్రలేకున్న మేలని తోఁచుచున్నదోయీ!

కృత—ప్రపంచ మట్టిట్టయినను సరే రాత్రి పడినతోడనే నాకు నిద్ర రాకమానదు సుమీ? నానిద్రఁ దలంచిన నాకే సిగ్గుచున్నదోయీ!

కృపా—కుమారా! నీ వింతవఱకు మేల్కొనియే యుంటివా?

అశ్వ—దీర్ఘవిచారదందహ్యమానమానసుండ నైన నాబోఁటివానికి నిద్ర యెట్లువచ్చును.

కృపా—కుమారా! విచారము నకైనను మేరయున్నది కదా?

కృత—ఎంతవఱకు? ప్రొద్దు గ్రుంకువఱకునా?

అశ్వ—మామా! తెల్లవాఱినతరువాత మాత్రము మన మేమిచేయఁగలము. అప్పుడు మాత్రము నాప్రతిజ్ఞ నెఱవేఱునా?

కృపా—అదియే సందేహముగ నున్నదోయీ!

అశ్వ—మఱి యింక దెల్లవాఱిన లాభ మేమి?

కృపా—ఏమిచేయుటకును దోఁచకున్నదోయీ!

అశ్వ—(ఆత్రముతో) మామా! ఈరాత్రి నేనపాండనముఁ జేయలేననియా నీయభిప్రాయము?

కృపా—కుమారా! ఏమిచెప్పుటకును దోఁచకున్నది.

అశ్వ—మామా! అట్లైనచో నే నొక్క యుపాయముఁ జెప్పెద వినుఁడు. ఏమందువా? పగటిపూటఁ గయ్యముఁ జేయుటకు మనకు సాధనసామగ్రి లేదుకదా? ఆహేతువుచేత మన మీ నిశాసమయమున నే ఎట్లో పాండవుల నఱుమాడి మనప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుట లెస్స. పోనిమ్మని యూరకున్నయెడల రారాజు మనల నలగతులుగఁ జూచుటయేగాక ప్రతిజ్ఞాభంగముఁ గూడ సంభవించి మఱింత సిగ్గుబాటగును. ఈనిశీథమున మనము కౌంతేయులఁ దునుమాడు కెట్లందురా వారిప్పుడు జయించితిమి కదా యని హాయిగ నొడళ్లు మఱచి విడిదలలో నిద్రవోవుచుందురు. ఆశిబిరములోనే గోపాలుఁడును సాత్యకియు నుండక మానరు. సేనాపతియగు ధృష్టద్యుమ్నుఁడును తప్పక నందే యుండును. ఈసమయమున మనమందఱ మా శిబిరములోనికింజొచ్చి అందు నివసించియున్న ప్రాణికోటులనెల్ల దుత్తునియలుగఁ దునిమి మనపంతము నెఱవేర్చుకొందము.

ఇందుకు మీరు వల్లేయనెదరేని లెందు పోద మల్లదియే శిబిరము ?

కృత— కుమారా! ఏమైనం గానిమ్ము. నాకుమాత్ర మిప్పుడు కన్నులు విప్పుపడుట లేదు.

కృపా— ద్రోణాయనీ! ఇప్పు డింత తొందరపడినచోఁ గార్యము చెడును. ఊహఁ జేయుటకేమి? అయ్యది ధర్మేతరముగ నుండఁగూడదు సుమీ? ఇంతకు మఱొక్కటిఁగూడ జెప్పెద, వినుము. ఏమందువా?

చ. పనిఁ గడముట్టఁ జేయుటకుఁ బౌరుష దైవబలంబులెప్డు సా
ధనములు గాకయున్నెడ వృథాయగుఁ జేసినదెల్ల; యెట్లన
న్పునిగొని దున్నినన్పొలము పండునె? వర్షము లేకపోయిన
న్దనివిగ వానకల్గినను ధాన్యము లబ్బునె దున్నకుండినన్?

నాయనా! మానవునియందు నంతరాత్మ కలదు. మఱి దానివిశేష మెట్టిదందువా?

చ. పరమ పవిత్రమైన పరిభద్దనరారి మహేశ్వరాంశమై
నరులకు మంచిచెడ్డల ననారత మేర్పడఁ దెల్పుశక్తియై
పరఁగెడి హృత్సరోజమది పాడినె తప్పక చూపి సర్వదా
నరు ములుకోలయై పొడుచు న్యాయపథంబు నతిక్రమించుచోన్.

కృత— నాయనా! ద్రోణాయని. అంతదూరము చెప్పనేల. ప్రపంచములో మంచిచెడ్డ లనునవి యున్నవికదా?

కం. పలువుర కనుమతమై మఱి
పలువుర కుత్కృష్టసౌఖ్యపదమై భువిలోఁ

జెలఁగును సత్క్రియ దాని
న్సలిపెడి వానికి విధియునుఁజను బాసటయై.

మఱియు

మ. అరిషడ్వర్గముచేత నీడ్వఁబడి దుర్వ్యాపార సంసక్తుఁడై
నరుఁ డంతఃకరణ ప్రబోధితము సన్మానింప కిచ్ఛారతి
న్వరస్వాతంత్ర్యముఁ బొందిచేయుఁగ్రియందానంగల్గు లాభంబుఁదాఁ
బొరయున్ స్వైర విహీనుఁడై పిదప దేవుంగూర్చి వాపోయెడున్.

కృపా—నాయనా ! ద్రోణాచార్య నందనా ! నిద్రావస్థఁ బడినవారిని, ఆయుధము పీడినవారిని, నారిని మొదలైనవారినిఁ జంపఁగూడ దని పురాతనగ్రంథము లెన్నియో ఘోషించుచుండ వానిఁ ద్రోసివేయవచ్చునా—?

కృత—ఆచార్యోత్తమా ! నీవు చెప్పినది సహేతుకరముగాదుసుమీ! ఒకవేళ నిట్టి యకృత్యము సమ్మతమని శాస్త్రమైనఁ జెప్పిన యెడల నీవు దాని నంగీకరింతువా యేమి ? గ్రంథముల కేమి ? ఏగ్రంథమునఁ జెడ్డయని చెప్పఁబడుచుండునో ఆగ్రంథమునందే అయ్యది మంచియని చెప్పఁబడుట కాధారములు గన్పట్టు చుండును.

చ. గురుతర శేముషీధనులుకోవిదు లెప్పుడు వందనీయు లె
ల్లరకును ; వారిపాండితియుశ్లాఘ్యము ; వారి పురాణశాస్త్రము
ల్పరిగణనంబులైనను స్వభావ విరుద్ధము లంతరాత్మకుం
బరువుగఁదోఁచు ధర్మములుప్రస్తుతికెక్కునె? వారుచెప్పినన్.

కాని ద్రోణాయనీ ! ఒక్కటిమాత్ర మాలోచించుచుం. ఏమందువా ?

చ. నయమును నీతియున్విడిచినాన యొకింతయు లేక హృత్కుశే
శయమును రెంటఁజేసి విరసంబుగ దుష్క్రియ సల్పువానికిన్

రయముగ సంభవించును పరాభవఖేదకరంబు లాపద
ల్భయముజు గుప్పయుం గలుగుఁ బౌరులు మెచ్చరు వాని నెప్పుడున్.

కృపా—కుమారా ! నామాట వినుము. నీవిప్పుడు తొందర పడెద వేని నీమతమునకు భంగము కల్గును. మఱి ఘతమన నేమందువా ?

చ. కలఁ డొకఁ డాదిదేవుఁడు జగంబుల కెల్లెడఁ; దత్కళాంశమే చెలఁగును నంతరాత్మ యనఁ జీవులయం; దదియెప్డు మంచినే తెలుపుచునుండుఁ; దాని విధిఁ దీర్చుట దేవునిఁ జేరుయత్నమున్ బలుపుట; దానిపే ర్మతమునంబడు; దానిని వీడవచ్చునే?

ద్రోణాయనీ ! ఇటు వినుము. ప్రతిజ్ఞ నెఱవేర్చుట తప్పని చెప్పనుగాని అయ్యది నీతికి లాఁతియైనచో మతము చెడుచున్నది. ఏమం దువా ? మతమునకును నీతికినిఁ గల యన్యోన్యసంబంధము క్షీరోదక న్యాయము ననుకరించి యుండును. మతములేని నీతి యుండదు. నీతిలేని మతములేదు. నీతిమాలిన మతా చారులు జీవచ్ఛవములవంటివారు. మఱి వీరికర్థ మేమందువా ?

చ. మతమున కొప్పునీతి పరమం డెన మయ్యది వేరటంచును న్మత మనుపేర లోకు లవమాన కరంబులఁ బ్రాణిహింసల న్సతతముఁ జేయుచుందు రిలసత్ఫలహీనులఁ దేవుఁడొల్లఁ డెం తతప మొనర్చినం దుది వృథా యగు బూడిదఁబడ్డ నేయియై.

కావున, గురునందనా ! వృద్ధుఁడ నైననామాట వినుము. నీతి మత ములు చెడినచో నిహపరంబులు రెండును జెడుచున్నవి.

కృత—ద్రోణనందనా ! ఇంకొక రహస్యముఁగూడఁ జెప్పెదను వినుము. నీతి మతములకుఁ బ్రబల శత్రువులు కామక్రో

ధాది గుణములు. వీని నణఁచి వేయువాఁడు చక్కఁగ నీతి మతముల రాణింపఁజేసి శాశ్వతపదవి నందుచున్నాఁడు. మఱి కుద్ధుఁ డంటివా?

చ. అరు లపకారము ల్సలిపినప్పు డహంకృతిఁ జెంది క్రుద్ధుఁ డౌ
నరుఁడు గణింపఁ డార్యవచనంబుల; లెక్కఁ గొనండు మిత్రులన్
త్వరపడి ఘోరకర్మలను తద్దయుఁ జేయును తచ్చికిత్సకై
నరయఁగ నట్టివానికి నిహంబె ప్రధానము ద్రోణనందనా!

ఇఁక, నుత్తమమధ్యమాధమలక్షణ మెట్లుండునో చూతుము?

చ. తమ రపకార మొంది యనుతాపకరంబు మహోపకారము
న్నమతునకుం బొనర్చి తమ వైరముఁ దీర్చుకొనం దలంతు రు
త్తము లగువారు; న్యాయవిధిఁ దప్పక తత్ప్రతిఁ జేయు చుంద్రు మ
ధ్యము లనయోగ్యకార్యముల నాకసిఁ దీర్చెదువారి నేమనన్!

కావున నోగురునందనా! వృత్తిభేదమువలన జాతిభేదము సంభవించి నట్లును, మంచిచెడ్డల నొనరించుటవలన సత్పురుష కాపురుషభేదము జనించినట్లును పగఁదీర్చుకొనుటలో సహితము సాధన భేదంబునం జేసి మానవులు మూఁడు తెఱంగు లగుచున్నారు సుమీ? ఏది ఎట్లున్నను, మనము ధర్మేతరముగఁ బ్రవర్తించ కూడదు. ఇంతకు నింత తొందరపడినయెడల మన కపఖ్యాతి తప్పక కలుగును. ఇప్పుడు నీయుద్యమము మానుము?

అశ్వ—ఓహోహో! మీశుష్కోపన్యాసముల నిఁకఁ జాలిం చుఁడు. చీటికి మాటికి శంకించుచు వేదాంతమార్గముఁ బట్టు వాఁ డెన్నటికైనఁ గార్యసిద్ధిఁ బొందునా! మానుషమే పరిధా

నము జేసికొనువాని కిట్టి కుశ్శంకలు బుట్టునా? చాలుం జాలు. ఇంతకుఁ దలవంపులు నావిగాని మీకేమి?

తే. గీ. ఇట్టి నిసితాయుధముఁ జే ధ♦రించి మించి
బిరుదుమగఁ డనుపస్తుతిం♦బరఁగు చుంటిఁ
బితరుఁ జంపినశతుృవు♦బ్రతికియుండ
నలుగు రందునఁ దల నెత్తి♦మెలఁగు టెట్లు.

వేదాంతప్రచారమున కేమి. కమ్మని వేదాంత మెంతయైనఁ జెప్పవచ్చు.
.. వేదాంత మెక్కువైనచో దేశమున కరిష్టము సంభవించును. వేద్ధాంతము మానవుని మందునిఁ జేయక మానదు. మందత్వము శూరలక్షణమును బాడుచేయక మానదు. సర్వమును త్యజించి ఏమైనం గానిమ్మని తెగువ వహించుటయే శూరుని లక్షణము. అట్టి శూరునకే కార్యము సిద్ధించును. ఓహోహో! రథికవరేణ్యులారా! ఇంతవఱకు బడిపిల్లకాయకుఁ బాఠముఁ జెప్పినట్లే చెప్పితిరికదా?

చ. ఎఱుఁగనివానిఁగా దలఁచి♦ ఇన్నిమహత్తరనీతు లన్నియుఁ
గఱపిరిమీరు గా కొరులు♦ నాకుఁ గలారె? నయంబుఁ జెప్ప నే
నెఱుఁగనివానిఁ గాను మది♦ నెంతయు యోజనఁ జేసినాఁడ నా
కఱకఱి తీఱుమార్గమను♦కంప వహించి వచించు మాతులా!

ఛీ! సర్వసంగపరిత్యాగము నేర్పని వేదాంత మేటికి? ఇఁక నాకు మీ యుపన్యాసములతో నిమిత్తము లేదు. అదిగో రాత్రి రెండు యామములు దాఁటినది. తెల్లవాఱినచో మనము మేఁకపిల్లల వలె నొకమూల నొదిగి యుండవలసినదే! శతృవుల సమయించుటే ప్రధానకార్యముగ నెంచికొనుఁడు. ఉచితానుచి

తనుల లెక్కఁగొనక, మీరు శూరులరైతిరేని, పంకముఁ దీర్చికొనుటకు సత్వరితముగ రండు. మామా! కృతవర్మ! నామాటఁ దీసివేయకుఁడు?

క. కడుపునఁ గలవగ వేఁడిమిఁ
బడఁజాలక శత్రుకోటిఁ బరిమార్చుటకే
నొడు పొక్కటి నూహించితి
నడిరే యని సంశయపడిన నైదు నదియుఁ౯.

ఇది దాఁటినచో మనమాపంద్రతారార్కము దుర్వ్యథకుఁ బాల్పైపోవల సినవారమే? ఒకవేళ మీకీకార్య మసాధ్య మని తోఁచు చున్నది కాఁబోలును. ఏమేమీ! ద్రోణాచార్యపుత్త్రుఁడనైన నేనే కార్యమునకుఁ బూనుకొనినప్పుడు కార్యము నెఱవేఱక పోవుట కూడనా! మామా! మనకుఁ దప్పక జయము గాక మానదు. ఏమందువా?

క. జయ మందితి మని యొమ్ము
న్నైయి నిడి గుఱువెట్టుచుఁ గడు నిద్రింతు రహల్
రయముగ నేఁజని వారిం
బుయి లోడక పెద్దనిదుర వోవగఁ జేతుఁ౯.

కృపా—కుమారా! దేశకాలపాత్రముల నెఱింగిక దా శూరుఁడు వైరముఁ దీర్చికొనుటకుఁ బ్రయత్నించవలసినది. అందు మన కొక్కటియు వీలుగనుండలేదు. నామాటవినుము. చెప్పినదే చెప్పుచున్నానని తలంచకుము.

క. క్రోధముఁ దీర్చుకొనుటకు ని
(సమయ మదునుగాదు చేయఁగ నను వౌ

సాధన మెల్లి వచించెద
గాధముఁ దెలియక జలముఁ దిగం దగ దెందుఁన్.

నాయనా! నీయుద్యమము సరియైనదికాదు. మనబోంట్లధర్మమార్గమున వర్తించు టుచితముకాదు. క్రోధగుణైకగాత్రుఁడ వగుటచే నీవాగతముం జూడకుంటివి. ఇప్పుడిట్టి ఘోరకృత్యమును జేసెదవేని నీకీర్తి సర్వకాలము గాజువాటి యుండవలసినదే.

కృత—కుమారా! క్రోధగుణోద్దీపితుఁడైన వానికి న్యాయమెక్కడిది?

అశ్వ—ఓహో హో! న్యాయమా? చాలుంజాలు భీష్మద్రోణకర్ణాదులను వధించినపుడు పాండవులు వెల్లడించిన న్యాయమంతయు జగద్విఖ్యాతమే కదా?

కృత—నాయనా! ద్రోణనందనా! పాండవులొనర్చిన యన్యాయమే ప్రమాణ మనుకొనకుము. అదియునుంగాక, ఒక రన్యాయమొనర్చి రని మనముఁ గూడ నన్యాయమే చేయవలెనా? న్యాయమార్గులను ప్రమాణముగ గ్రహింపరాదా? కావున నో ద్రోణాయనీ!

శా. లోపాలోపము లెన్ని కల్గినను నీలో నీవు సైరించి దు
ర్వ్యాపారంబుల పోకఁ బోవక యో లోపం బూడ్చుటే శ్రేయమౌ
పాపంబు ల్పొనరించు, స్నేహితుల నొవ్వం బల్కు దుర్మార్గుఁడై
కోపాటోపసమేతుఁ డన్నిటను చిక్కుం దెచ్చు ద్రోణాయనీ!

కృపా—కుమారా! నీవిప్పుడు తప్పక జయమందఁ గలవా?

అశ్వ—మామా! జయముమాట యొక లెక్కలోనిదికాదు. కాని, (సక్రోధుఁడై)

తే. గీ. చంద్రనిప్పులపైఁ జెలుఁ జేఁ బొరలించు
నట్లు తనుఁ జేర్చునాడు క్రోధానలంబు
పార్థతుని నల్ల చుం యనిఁ పైనఁ బడినఁ
గాక చల్లార దన్యమార్గమున మాకు!

ఏమి! సంశయపడెదరేమి? రథికవరులారా!

చ. మన నను హోమకుండమునఁ మంకు ప్రరోషఁపుటగ్నిలోని కిం
ధనముల యట్లు పాండునృపఁ నందనులం బడవైచి పార్థతుం
డను పశువు న్వధించి రుధిఁ రాంచితఖండముఁ జీల్చి నాపలం
బనిరెడి సోమిదమ్మ మదిఁ హర్షముఁ బొంద మదీయ హేతి యు
ష్మనతర సోమయాజి కుతుఁకంబున వేలిమిఁ జేయుఁ జూడుఁడీ.

మీరుమాత్రము నాసవనతంత్రములో ఋత్విగులరై హెచ్చరికగ స్వాహామంత్రములఁ జదువుచునన్ను ధన్యునిం జేయుఁడు. చూడుఁ డేమిచేసి వచ్చెదనో.

తే. గీ. పాండవకులంబు నేఁటితోఁ బాడువాఱి
నచ్యుతునిమాయ నేఁటితోఁ నణఁగునట్లు
శిబిరమునుఁ బీనుఁగుల పెంటఁ జేసి యుంచు
భూతభేతాళగణములఁ బొందుపఱుతు.

ఇలన్యముఁ జేయకుఁడు. ప్రొద్దుచాలదు. అల్లదియే పాండవశిబిరము. తడవుసేసినచో బొరవులు మేలుకాంతురు. లెండు రథికవరులారా! లెండు.

కృత—(స్వగతము) ఓహో! ఇతఁడు తాఁబట్టిన కుంచేలునకు మూఁడే కాళ్లనుచు ననుభవశాలి యగు కృపాచార్యుని మాటలఁ గూడ

పెడకేవులం బెట్టి గట్టిపట్టుఁబట్టి కూర్చుండి యున్నవాఁడు.
(ప్రకాశముగా) కుమారా! ప్రయోజనము లేని యీకార్యము
నేలచేసెదవు లెండ్రీ?

అశ్వ—కృతవర్మా! ప్రయోజనమే లేదనుచుంటివిగా? ఇందువల్ల
రెండు ప్రయోజనములున్నవి. ఏమందువా? మిత్రుఁడైన దుర్యో
ధనుఁ డపరిమితానందకందళితహృదయారవిందుఁ డగును.
మఱి రెండవ దేమందువా?

తే. గీ. కనులపండువుగాఁ జూచి కన్నతండ్రి
మోద మందితిఁ జాలురా ముద్దులయ్య!
అనుచు స్వర్గమం దుండి లో దనరుచుండఁ
దీర్చు వేతు వానిఋణము ద్విగుణముగను.

కృపా—ద్రోణాయనీ! అట్టి ఫలితముల నొందుట కిది సమయము
గాదోయీ! నామాటవిని తొందరపడక ఒకింతసేపు నిద్ర
బొమ్ము!

అశ్వ—ఏమేమీ! మామా! నిద్రయా! ఏంతమాటాడితివి!

తే. గీ. ద్రవ్య మెటులైన నార్జింపఁ దలఁచువాని
కాతుణము కార్యమగుటకై సరయువాని
కధికకోపంబు గలవాని కతివఁ బొంద
వలపుఁ గొన్నవానికి నిద్ర పట్టదండ్రు.

కృత—(ఆత్రముతో) ద్రోణాయనీ! నీకుఁ గ్రోధమొక్కటి తక్క
మతేదియు లేదుకద!

అశ్వ—క్రోధమొక్కటియేనా!

చ. జనకునిఁ గూర్చి మిక్కిలి వి◆చారము; వైరిఁ దలంచినప్పు నె
మ్మనమున మంట; వానిఁ బరి◆మార్చుట యెట్లని చింత; కౌరవేం
ద్రునిఁబడగొట్టినా రనఁగ◆దుఃఖము; వానిప్రియంబు సేఁత కిం
తనఁ దగనట్టి యాతనయు◆నన్నియుఁ గల్గిన నాకు నిద్రయే!

కావున నో రథికవరులారా! నామాటవిని నాముద్దుఁ జెల్లింపుఁడు. కాదనక వెంటనే లేచి రండు. ప్రొద్దుపోవుచున్నది. మన ప్రతిజ్ఞ దీర్చుటకుఁ గాలము చాలదుసుఁడీ.

కృపా— ఓహో! కుమారా! అంతతొందరపడెద వేల? మఱొక్క సూక్ష్మముఁ గూడఁ జెప్పెదను వినుము. కామక్రోధార్థలోభ మదమాత్సర్యములే లోకమున వివిధజాతులం గల్పించుచున్నవి. ఏమియు నెఱుఁగక మూఢుఁడై ఇదమిత్థమని తెలుపఁజాలనివాఁడు శూద్రుఁడు. ఈతరగతియందుఁ గేవల మజ్ఞానగుణమే ప్రధానము. ఇది ధర్మ మిది యధర్మమని తెలిసియుఁ దనకు లాభముఁ గల్గించు కార్యమునే తాత్కాలికముగాఁ జేయువాఁడు వైశ్యుఁడు. ఈతరగతియందు స్వార్థపరత్వమే ముఖ్యగుణము. ధర్మాధర్మముల నెఱుంగుం గావున శూద్రునికన్న వైశ్యుఁడే మంచివాఁడు. మఱి క్షత్రియుఁడో ధర్మాధర్మముల నెఱింగిన స్వార్థపరిత్యాగియే కాని తన పట్టుదలఁ దీర్చుకొనుటనే ముఖ్యముగఁ జూచువాఁడు. ఈతరగతియందుఁ గ్రోధగుణమే ఎక్కువపాలు. స్వార్థపరత్వమ్ము లేమిం జేసి వైశ్యుని కంటె క్షత్రియుఁడే ఎక్కువవాఁడు. ఇఁక బ్రాహ్మణుఁడన్ననో, ఏగుణంబులు లేక సత్వగుణైకప్రధానుఁడై నిరంతరనారాయణధ్యాన పరాయణుఁడై ముక్తిమార్గము నధిగమించువాఁడు. కావున బ్రాహ్మణుఁ డన్నిజాతులలో నుత్తముఁడు. క్రమక్రమ

ముగ బుద్ధివికాసమునొందినకొలంది తక్కువ తరగతిలోనివాఁ
డెక్కువతరగతి కెక్కుటయు బుద్ధిభ్రంశము సంభవించుకొలఁది
నెక్కువజాతివాఁడు తక్కువజాతిలోనికిఁ దిగజారుటయు నాయా
ప్రవర్తనా విశేషములఁబట్టి సంభవించు చుండును. మఱి
నీవన్ననో! ద్రోణాయని! ఉత్తమబ్రాహ్మణకులీనుఁడవు. అందు
విశేష మేమందువా?

ఉ. దండితవైరిమండలుఁడు దారగుణుండు ప్రశాంతమూర్తి దో
ర్దండపరాక్రమాఢ్యుఁడు పరాత్పరభక్తి నికేతనుండు కో
దండకళావిశారదుఁడు ధారుణిదేవునకు జ్జనించి యీ
దుండగ మేల చేసెదవు? దుర్యశ మంటదె నీకుఁ దండ్రికిన్?

అశ్వ—ఓహో హో! మామా! నేనుత్తమబ్రాహ్మణకులీనుఁడ
నయ్యును మధ్యమున క్షాత్రము గ్రహించినాఁడను. ఆకారణము
చేత నాబోఁటివాని కిట్టి విధముగఁ బ్రతిజ్ఞ దీర్చుకొనుట తప్పు
గాదు. మామా! మీ యుపన్యాసముచే నన్నేల అలయించె
దరు? కొట్టకొనకు నేఁ జెప్పెద వినుఁడు.

శా. ధీరాగ్రేసరుఁ డిద్ధవంశజుఁడు భూదేవోత్తముం బట్టి దు
ర్వారౌద్ధత్యతఁ బార్షతుండు గళమున్ వాలంబునం గోయఁగ
న్నారం జూచియు మీర లేటికొ యుపన్యాసంబుఁ గావింత్రు! బ
ల్గారుణ్యంబునుఁ బూనుఁడీ! గురుని లోఁ గామింపుఁడీ! యుప్పొదుర్
ఱటియు రధికవరేణ్యులారా!

చ. అనిశము మిమ్ముఁ బ్రోచుచు దయామతివై నుతియించి ప్రేమమైఁ
గనుఁగొనినట్టి తేఁ డిపు డఖండపరాభవ మంది యూరుఖం
డనమునఁ గూలి మిక్కిలిఁ బడల్పడి పల్కిన దీనవాక్యముల్
వినియునుఁ జాలిఁ బొందరె? భువిం గలరే! యిటువంటి స్నేహితుల్.

కావున నోకృపాచార్య కృతవర్మలారా! లెండులెండు. కాలయాపనఁ జేయకుఁడు. మిమ్ములఁ బరిపాలనఁ జేసి మిమ్ముల సన్మానించిన రాజరాజును సంతోషపెట్టుట మీకు విధాయక కృత్యమై యున్నది. మీ రెన్ని చెప్పినను నాయుద్యమమును నేనుమానువాఁడను గాను. (కొంచెమాఁగి) ఏమేమీ! దారుగా! ఎగదిగఁ జూచుచు మిన్నకుంటి రేమి. అయిన నిదిగో చూడుఁడు.

ఉ. గండరిగండ నై మెలఁగి♦గండడఁగింతును ముందుఁ బార్థుతుం
బాండవకీటకంబులను♦మచ్చునకైనను నుంచకుండ నే
ఖండనఁ జేసి వచ్చెదను♦కా దన కీరలు లేచి రండు; రా
కుండిన నేన పోదు నిది♦గో శివుఁ డడ్డిన లెక్క సేతు నే!

(అని కత్తిఁ ద్రిప్పుచు రభసంబునఁ బోవుచున్నాఁడు.)

కృపా—ఆఁ ఆఁ ద్రోణాయనీ! ఇది నీకు న్యాయమే కద? మేముఁ గూడ వచ్చుచున్నార మాఁగు మాఁగుము. ఎట్టివాఁడ వోయీ? (అని అశ్వత్థామ నాఁపుచున్నాఁడు.)

అశ్వ—రథికవరులారా! అట్లైనచో నాలస్యము జేయకుఁడు. అదియే పాండవశిబిరము. మీరు సత్వరితముగఁ బోయి ఈశిబిరమునకు వెనుకభాగమున నప్రమత్తులరై కాచుకొని యుండుడు. నేనీ ప్రాంగణము నుండి శిబిరములోనికిఁ బోయి కార్యము నెఱవేర్చుకొని వచ్చెద.

కృపా-కృత—అట్లనే చేసెదము. (అని ఇరువురు నిష్క్రమించుచున్నారు.)

అశ్వ—ఛీ! పాండవాధములారా! ఓరోరి! ధూర్తగోపాలా! ఇదిగో వచ్చుచున్నాను. నేఁటితోఁ మీకాయువు చెల్లినదనుకొనుఁడు.

చ. పఱపఱ మేఁకపోతులఁ గృ♦పాణముచేఁ దెగఁ గోయునట్టి బ
ల్కఱకుకసాయివో? భువికిఁ♦గాలుఁ ద్రొక్కి? యనద్రౌణి యిప్పుడ
గ్గఱ కరుదెంచెనో పసుల♦కాపరి! నీవు మహేంద్రజాలము
న్నెఱపుట దెట్లొ పాండవుల♦నీవిఁకఁ బ్రోచు టదెట్లొ చూడఁగన్.

ఓరోరి! ధృష్టద్యుమ్నా! ఓరోరి పాఱుఁబోతా! ఛీ! పశువా!
చచ్చిన శవమునుఁ జంపిన నిన్ను ముక్కముక్కలుగఁ గోసి
నను పాపము లేదురా! చండాలా! యుద్ధకాంక్షవీడి సారూ
ప్యము నొందియున్నవానినిఁ జంపుటకు నీకుఁ జే యెట్లాడెరా!
తులువా! ఓరోరి! ద్రోహీ! నీవొనర్చిన ఘోరపాపమునకు
ఫలము నీ వనుభవించుకాలము సమీపించినదిరా మూర్ఖా!

చ. మనసుకలంగి భూమిపయి♦మ్రాన్పడి ప్రాణము లేకయున్న మ
జ్జనకునిఁ జుట్టుఁబట్టి రిపు♦సన్నిధిఁ గంఠముఁ గోసినట్టి యా
చెనఁటినిఁ బార్షతాధమునిఁ♦జెచ్చెర నిష్ఠుర బాణపంక్తి నే
హననముఁ జేయకుండి పశు♦వట్లు వధింతు విచిత్రహింసచేన్.

ఓరోరి! ధర్మరాజా! పయోముఖ విషకుంభమువలె వర్తించుచు నింత
వఱకు లోలోనఁ గోతుల ద్రవ్వుచు జయమందితినని హాయిగ
శిబిరమున నిద్రించుచున్నావుగా?

మ. ఒకవిప్రుం గెలువంగఁజాల కని మా♦యోపాయ సంసక్తిచే
టకటాంకు ల్వచియించి నీవెలమి ధృ♦ష్టద్యుమ్నుచే వానికు
త్తుకఁ గోయించి యసత్యదోషమును తో♦డ్తో బ్రహ్మహత్యోగ్రపా
తకముం బొందితివిప్డు తత్ఫలముఁ బొం♦దంజూతు నిర్ధర్మజా!

ఓరోరి! వృకోదరా! ఘస్మరా! గోముమీఱిన నీకాయము
నెల్ల కాకిగ్రద్దలకుఁ బలిచేసెదను చూడరా దురాత్మా! నీ

యాతతాయితనమునకు నీవనుభవింతువులే? (శిబిరప్రాంగణముఁ జొచ్చి)

శా. గంభీరంబుగ నాభికిం దిగువభాగంబందు రారాజుపై
నాభీలంబుగఁ గొట్టి తృప్తిగొన కోరా! మూర్ధమునందన్నిబ
ల్దంభోక్తుల్వచియించినా విపుడు నీధైర్యంబుఁ జూపింపరా!
ఛీ! భీమా! నిను ముక్కముక్కలుగఁ జేనేఁజెండాడ కెట్లుండెదర్,

(అని కత్తి ఝళిపించి నిట్టటు నడచుచున్నాఁడు.)

(అకస్మాత్తుగ నాఁగి ఆశ్చర్యము నభినయించుచు) ఏమేమీ! కను విచిత్రముగ నున్నదే! నే నిప్పు డెచ్చట నున్నాను; ఏమి చేయుచున్నాను? నాక్రోధమంతయుఁ జల్లారిపోయినది. మనస్సున నేదియో ఒకవిధమైన అక్కటికంబు పొడముచున్నది. ఓహోహో! ప్రపంచమంతయు మఱొకవిధముగ దృష్టికిఁ గోచరమగుచున్నది. అకటకటా! ఇట్టి నిశాసమయమున సుషుప్తిం బడియున్న ఈశిబిరవాసుల నెల్లరఁ జంపుటకు నాకుఁ జే యెట్లాడును?

ఉ. ఏ నిపుడేమి చేసితినొయింత నెఱుంగను; కాలుసేతులా
ధీనము తప్పిపోయె; మదిఁ దిట్టత వీడుచునుంటి; లోన నెం
తేనియుఁ దాపముంగలిగె; నేమియుఁదోఁచదు; చిత్రమిద్దినా
మేనునఁ జెమ్మటల్ వొడమె మేదిని నింగియు నేకమైచనెన్.

ఔరౌరా! భూమిపైఁ దాపడము చేసిన చిత్తరువుఁబోలె నిశ్చేష్టుఁడనైతినే!

మ. నడువన్పాదము లొల్లకుండె నిది యన్యాయోరుమార్గంబొకో!
సలుప న్జేతులు రాకయుండె నిది దుష్కార్యానుసంధానమో!

పలుకన్మాటలు గూడకుండె నిది యేం। ప్రాశ స్త్యంపుం భావమో!
తలఁప న్బుద్ధియు మాంద్యమయ్యెనిది నా। తాత్పర్యము న్మెచ్చదో!

కటకటా! ఈశిబిర మెంత నిశ్శబ్దముగ నున్నది! ఇందు నివసించి
యున్న మానవులందఱు నిర్జీవ ప్రతిమలవలె నిద్రవోవుచున్నారు
కదా? అకటా!

ఉ. శిబిరముఁజూచి యిందు నివ। సించిన ప్రాణులలోఁ దలంచినన్
గబగబ గుండె లెంతయును। గల్లగఁ గొట్టుకొనంగసాఁగు దే
హబలము క్షీణమైచనెడు। నక్కటికంబున వంతగల్గు ని
ద్రఁబడినవారిఁ జంపుటనఁ। దథ్యమొడల్నిలువెల్ల నీరగున్.

హా రామా! ఏమి నాయవస్థ! నాకన్నులేమియో చిరుతలు క్రమ్మ
చున్నవి. నాకిప్పు డేవియో నానావిధములైన వికారరూప
ములుగూడఁ బొడచూపుచున్నవి. ఏమేమీ! అయుగపడు
వారు నాతండ్రిగారేనా? ఔ నౌను! తండ్రీ! నమస్కా
రము. నమస్కారము.

ఉ. నెమ్మొగమంం ద్రిపుండ్రమను। నిద్దపుఁ గుంకుమబొట్టుఁదీర్చి వి
ల్లమ్ములఁ గేలఁబూని రుధి। రాంచిత నేత్రములు న్వికాల వ
క్షమ్మున స్మితమ్మునంగలిగి। కన్నుల పండువుగాగవచ్చినాఁ
డమ్మక చెల్ల! మజ్జనకుఁ। డల్లదుగో వెసఁ గౌఁగిలించెదన్.

అని పిచ్చివానివలె ముందు నడచుచు) ఏమి! తండ్రీ! పుత్రున కొక
దీవనమాటైన నాడవేమి? ఎంతకాలమైనది మిమ్ముఁజూచి
నాయనా? నేను నీప్రియపుత్రుఁ డశ్వత్థామను గానా!
నావంకనైనఁ జూడ వేమిపాపమప్పా!

ఉ. గుండాయింబలె నూరకుంటి వనుచుం। గోపంబు కాఁబోలు నా
ముద్రాటంబెద నేర్చుచున్నయది న। న్మన్నించు మప్పప్ప! నీ

వేంద్రం బోర్చక మానవయ్యా! దయతోవిచ్చేసి ముద్దాడుమో తండ్రీ! పుత్రుఁడు వేఁడుకొన్నకొలఁదిన్దాదవ్వులం బోదువే.

నాయనా! కలశసంభవా! అనుమానించకుము? నీవైరియగు ధృష్టద్యుమ్నుని నేఁ జంపకపోయినయెడల నన్నీపేరునం బిలువకుము. పోకుము పోకుముతండ్రీ! అచ్చటనైన నాఁగుమాఁగుముతండ్రీ! బతిమాలుకొనుచున్నాను నామాటవినుము. ఇంతకోపము తగవుకాదు సుమీ?

మ. ప్రతికారంబును జేయలేక పెలుచన్బ్రాగల్భ్యముం గొట్టువాఁ
డితఁడా! పార్షతుఁ జంపుశూరుఁ డితఁడిస్సీ! పాఱుఁబోతయ్యెనా
సుతుఁడన్న న్గడుసిగ్గు గల్గునని నన్జూడంగ వాంఛింపవా?
హితవీడేరఁగ వానిగూల్తుఁ దృటిలోనిచ్చోట నీవుండుమీ.

తండ్రీ! నన్ను నీ వెంతగారాబముగఁ జూచెడివాఁడవో ఇప్పుడంత కాఠిన్యముగఁ జూచుచున్నావుగదా? నాయనా! మానముఁదాల్చి యూరకొనెదవేమి?

ఉ. అంతకుఁ జాలదేని నిపుడంతకుఁ డట్టులఁ బాండవాన్వయం
బంతయు రూపుమాపి జనకా! నినుఁ దృప్తునిఁ జేతుఁ జూడుమీ
పొంతను నిల్వుమయ్య! దయఁబూనక యిట్టటుఁ బోయెదేమి? నీ
మంతన మేమియో తెలుపుమా! యిదె నీకిటఁ గేలు మోడ్చితిఁ.

హా! కన్నతండ్రీ! ఇంతలో నంతర్థానమైపోతివా? హా! కుంభసంభవా! నీకన్నకుమారుని ద్రోణాయనీ యని పిల్చుటకు నీకు నోరురాక పోయెనా! ఇంతకాలము నీకొఱకై వాఁచిన యట్లు పడి యున్నందుకుఁ బాగుగఁ జేసితివిలే? నన్నుఁగూడ నీవెంటనైన దీసికొని పోరాదా! నాయనా! ఏమేమీ! జనకుఁడు తిరో

హీనుఁ డయ్యెనని కనుంగడు విచారపడుచున్న నాకిప్పుడు కట్టెదుట నేదియో యొక వికృతరూపముఁ గూడఁ గన్పట్టు చున్న దేకి

సీ. మిన్ను మన్నెఱుఁగక ♦ మిట్టాడు మిండఁడు
మునువెన్కలరయని ♦ బూచివాఁడు
ఆకార హీనుఁడై ♦ యడరుచుండెడు వాఁడు
చండశాసనుఁడైన ♦ దుండగీఁడు
ఈరేడు జగములం ♦ దీడుఁ గానని వాఁడు
కర్మయన్నది లేక ♦ క్రాలువాఁడు
తల్లిదండ్రులు లేక ♦ యుల్లాసపడుధీరుఁ
డాద్యంతములు లేని ♦ హాస్యకాఁడు
కువలయం బెల్ల గనుమిడి ♦ గుడ్లవాఁడు
రోదసీకుహరంబె నో ♦ రుగలపురుషుఁ
డరసి చూడఁగరాని సో ♦ యగమువాఁడు
పొదలుచున్నాఁడొకఁడు పెను ♦ భూతమట్లు.

నాకన్నులు నన్ను మోసపుచ్చుట లేదుకద ? (అని కన్నుల నులుముకొని) అవునవును. ఇది నిజముగ నొకదయ్యమే ? ఏమేమీ! మీఁదకు వచ్చుచున్న దే ?

తే. గీ. ప్రబలి రేవెలుం గొకపక్కఁ ♦ బ్రజ్వరిల్లు
ఫేఁడి వెలుఁగొకపక్కను ♦ వెల్లఁజొచ్చు
మఱియు నట్టనడుమ నగ్గి ♦ మండసాఁగుఁ
గొఱవిదయ్యంబు గాకున్నఁ ♦ గొఱలదిట్లు.

ఆహాహా ! ఏమి దీనిపొగరు ? దగ్గఱకువచ్చి నన్నుఁ బెదరించుచున్న దే! చూచినకొలఁది దీనిచేష్టలు బహువిచిత్రములుగ నున్న వే!

నోటనుండి మంటలు పొగలు మిణుఁగురులు వెడలుచున్నవి. మఱి దీనిరూప మేదియో వికృతముగ నున్నది. ఔరౌరా! ఏకపాదముతో నడచుచున్నది కదా! మఱి యిప్పుడు ప్రపంచ మంతయుఁ దానయై వెలుంగుచున్నది. ఇప్పుడో! అంతర్ధాన మైనది. మఱి యిప్పుడో! అతిసూక్ష్మాణువై కన్పట్టుచున్నది. ఇది చూడఁజూడ నన్ను లక్ష్యపెట్టుటయే లేదు. ఓకౌఱవి దయ్యమా! నాతో నీకు వేళాకోళము గాదుసుమీ! నా బారిం బడక నీకు నివాసయోగ్యమగు స్మశానభూమికిఁ బొమ్ము. నా కార్యమునకు విఘ్నము గలుగఁజేయవలెనని చూచుచున్నావు కాఁబోలును. నాముందర నీపటాటోపము పనికిరాదుసుమీ! ఇఁక నీప్రాణము నీది కాదనుకొనుము.

(అంత నేపథ్యమున రాక్షసులు కలకలము చేయుచున్నారు.)

అశ్వ— ఔరౌరా! ఏమి విచిత్రము! వికృతాననములు, వికారాకారము లసహ్య కరాళనేత్రములుఁ గలిగి ఈరక్కసులు నాకడ్డముగ నిలిచి నన్నుఁ బెదరించుచున్నారు. నే నిప్పుడు మిన్నకుంటినా నాయుద్యమము నెఱవేఱదు. ఏనిప్పుడు ధైర్యము చెడి వెను కంజవెట్టు టోజగాదు. అయిన వీరినిఁ బెదరించి చూచెదఁగాక. రేరే! రాక్షసులారా!

తే. గీ. అస్త్రగురుఁడను ప్రఖ్యాతి నంది కౌర
వేంద్రునివలన మన్నన కెక్కినట్టి
భూసురేంద్రుని పుత్రుఁడఁ బుణ్యగణము
లార! సురిగిపొం డిటనుండి గౌరవముగ.

ఏమేమీ! నామాటల సరకుసేయక ఇంకయు మీరు నామీఁదికే వచ్చుచుంటిరిగా? అయినం జూడుఁడు.

తే. గీ. చెదరిపోలేని మిమ్ము నిఁ ద్రింశముఁగొని
కండ కండలుగాఁగోసి కాకిగ్రద్ద
లం దనిపెదను ఘనదోర్బ లంబు మెఱయ
విడువ వలిమల్లుఁడువచ్చి వేఁడికొనిన.

ఓహో! మీరింకయు సింమున నే తచ్చియాడుచున్నారుగా?

చ. దివిజపురాధినాథుఁ డెదఁ దేఁకువఁజెంది పురంబువీడ జ్యా
రవమునుఁజేసి సాయక పరంపర సంజనితాగ్ని దేవతా
యువతుల గండభాగముల నుజ్వల ఘర్మజలంబు నోడ్చ లా
ఘవమ్ముగ మిమ్ము నొక్క-క్షణ కాలము లోసనె త్రుంచి వేసెదన్.

(అంత రాక్షసు లంతర్ధానమై వెంటనే మరలఁ గనుపడుచున్నారు.)

ఓహో హో! ఇవి రాక్షసగణములుగావు. పిశాచగణములని తోఁచుచున్నది. ఔరౌరా! చిట్టచివరకు దయ్యములతోఁ గయ్యము సంభవించినదే? ఓపిశాచగణములారా! నేటిరాత్రి తెల్లవాఱకమున్న నేనొక్క ఘనకార్యముఁ జేయవలసి యున్నది. ఇప్పుడు మీతో యుద్ధముచేయుటకు నాకుఁ దీరదు. మీకిష్టమయినచో రేపటిరాత్రి రండు. ఏమేమీ లేచిపోరుగా! అట్లైనం జూతుఁడు. (అని బాణముల నేయుచున్నాఁడు.) అక్కటకటా! నాయమ్ములన్నియు వమ్మలై పోవుచున్నవి. నాయస్త్ర శస్త్రములు గాలికి ధూళికిఁ బోవుచున్నవి. ఆహాహా! ప్రపంచమంతయు బ్రహ్మతేజమై కన్పట్టుచున్నదే! ఏమిచిత్రమో?

చ. పరమ పవిత్రమైన ప్రతి భద్దనరారి, చరా చరాత్మకో
దరమయి, ముక్తిదాయక పదంబయి, నిత్యసుఖాను మోద సం

భరితనికేతనంబయి ప్రపంచము సర్వము నాకు బ్రహ్మమం
దిరమయి తోఁచె నందముల తేజమొకంతు స్ఫురించి జెల్లరే!

ఇదంతయు నీశ్వరమాయకాదుకద? (తలపంకించి) నాకుం జూడఁ జూడ నట్లే తోఁచుచున్నది. ఇయ్యది ఈశ్వర సంకల్పమే యైన యెడల నేనీ బూచుల నిర్జింతు ననుమాట సున్న. ఒకప్పుడు వికృతరూపములు పొడసూపుటయు మఱియొకతఱి తద్రూపములు రూపఱిపోవుటయు నే నేసిన బాణసమూహములు వ్యర్థములై పోవుటయు నాకత్యద్భుతముగ నున్నది. ఇయ్యది భగవద్విలాసమైనం గావలె లేనిచో నశ్వత్థామ యసమర్థుఁడైనంగావలె. ఔరా! అశ్వత్థామ వ్యర్థుఁడా!

మ. అరిసందోహ భయంకరుండయిన చాపాచార్యపుత్రుండనై
దురితో దగ్రుల నెంద ఱెందఱినో చేతోవృత్తినుగ్గాడి పె
న్బిరుదుం గాంచినవాఁడ భూతతతుల న్నిర్జింపలేకుంటి నీ
శ్వర సంకల్పమె కాకయున్న నిపుడశ్వత్థామ వ్యర్థుండొకో!

కట్టా! ఇది కేవల మీశ్వరవిలాసమనుటకు సందేహములేదు. ఇఁక నే నేమిచేయఁ గలను? ఇఁక నాప్రతిన నెఱవేఱుటెట్లు? మందబుద్ధినై నే నప్పు డాడంబరముగ నీఘోరప్రతిజ్ఞ నేలపట్టితిని? అకటకటా! నాశ్రేయస్సుఁ గోరిన కృపాచార్య కృతవర్మల మాట వినక వారిని గీటునఁ బుచ్చినందుకు బాగుగ జరిగినది.

శా. మాయైశ్వర్యము మానమస్తదళము న్మారాజ్య సర్వస్వము
న్నీయాధీనముఁ జేతుమీవు గలుగ న్నిశ్చింత మాకెప్పుడు
న్మాయాస్థానము నుండుమయ్య! యనుత్సామ్రా నాథాళితో నుండ కీ
రేయి న్నేనిట కేలవచ్చితిని తం ద్రీ యీశ యెట్లోకదా!

ఓజగద్రక్షకా!

శా. పారావారముఁ బాడబానలము ద్రావం జొచ్చు చందాననా
నారాచంబుల వేనవేల మఱియు న్నాయస్త్రశస్త్రాళిన
స్నీరే ద్రిమ్మరి మ్రింగఁబూనె మది నాకే బుద్ధియుందోఁచదే
నేరూపంబునఁ దీనిఁ గెల్తు నిఁక నీవే దిక్కు నాకీశ్వరా!

ఓసర్వాంతర్యామీ! ఏమి నీకటాక్షవీక్షణమాహాత్మ్యము!

శా. దేవా నీశుభవీక్షణాకలనచే దేదీప్యమానంబుగా
దైవారుం దృణమొక్క ఘోరశరమై దందహ్యమానాస్త్రమై
నీవొక్కింత యుపేక్ష సేయ శరముల్ నిస్త్రింశము ల్పోఁచలా
నీవిశ్వంబులు నీయధీనములు తండ్రీ! యీశ నన్గావవే.

ఇట్టియెడ నీశ్వరధ్యానమే తరుణోపాయము.

సీ. రూపుసూపఁడె నాకు రూపు రేఖలు లేక
యాపత్తులను రూపుమాపువాఁడు
ననుఁగావఁగా రాఁడె తనవారిఁ బోషింపఁ
గంకణము ధరించి క్రాలువాఁడు
ననుదయఁ జూడఁడే యనదల మొఱవిని
యభయ హస్తంబీయ నలరువాఁడు
నాకోర్కెఁ దీర్పఁడే యేకోర్కెయును లేక
శ్రితకల్పవల్లియై చెలఁగువాఁడు
ఎనసి యీరేడుజగముల నేలుకొనుచు
నాపు వెంబడి నాఁదూడ యరుగు కతన
నతజనంబుల వెనువెంట నడచువాఁడు
రాఁడె కరుణానుషంగాంతరంగుఁడగుచు.

ఓకరుణాంబునిధీ! నాపై నింత కాఠిన్యమా!

ఉ. ఓయకలంక! యోవరద!♦యోఫలదాయక! యోకృపాకరా!
ఓయసహాయశూర! మహి♦మోన్నత సద్గుణధామ! నిన్ను నా
ప్యాయముగా భజించి కొలు♦వన్మొగమైనను జూపవేమి య
న్యాయము? కన్నపుత్రుఁ గఠి♦నంబుగఁ జూచుట ముద్దుఁగాదుపో.

ఓదీనశరణ్యా!

క. రోయం దగువాఁడైనను
నోయయ్యా! నను క్షమించు♦మోడకుమన్నన్
గోయని సుతుఁగావని తం
డ్రేమెకఁ గల్గఁడని నే స్మ♦రించితి నిన్నున్.

క. ఓయనుఁగుం దండ్రీ! నా
రాయణ! ననుఁ గావుమో ప♦రాత్పర! యనుచున్
బాయక కొలిచెడు జనులకుఁ
జేయూత వగుదను బిరుదుఁ♦జెందవె యీశా?

ఓనిత్యసత్యవ్రతా! నే నెంత వేఁడికొన్నను నాకేల ప్రత్యక్షము గావు తండ్రీ!

చ. పితరునిఁ బార్థుఁ డంపు కను♦వేదురుగా వధియించినాఁడు త
త్సుతుఁడను గానఁ దానమదిఁ♦జుమ్మలు చుట్టుటఁజేసి వైరికిం
బ్రతి నొనరింప వచ్చితిని♦ పాండవు లేగురు జేనిఁ గూల్చిరే
హితుఁడనుగాన వారి సమ♦యింపఁ గడంగితి నిద్ది తప్పొకో?

ఇందుఁ దప్పేమియు లేదు. కాని—

మత్తకోకిల—గోవుఁ బాలకు వృద్ధు నంధు స♦ఖు న్సహోదరి మత్తుభా
దేవునిం గురు వెఱ్ఱిసుప్తునిఁ♦దీనునంగన భీతునిం
బ్రోవుమన్న జనున్వధించుట♦పోలదంద్రు మనీషులా
త్రోవఁ బోవని నాకుఁ దేవుడు♦తోడుగాసంగఁగ వచ్చునే?

ఇఁక నే నిప్పు డేమనుకొన్నను లాభములేదు.

చ. అతిశయమూని గర్వపడి • యాగతముం దెలియంగలేక యిం
గితమును వీడి స్నేహితులఁ • గీటునఁ బుచ్చిన నాకుఁ బాప సం
గతియగుఁగాక యీప్సితము • గల్గునె; కాని గతంబునెంచిన
న్గతజల సేతుబంధనమె • కాని యొకింతయు లాభమున్నదే!

ఱోటిలోఁ దలఁదూర్చి రోఁకటిపోటునకు వెఱతునా? ఓమహేశ్వరా! ఏమైనం గానిమ్ము. నేటిరాత్రి తెల్లవాఱకమునుపు పాండవవంశ మపాండవమైపోవలె. అటులం గాదందువా నీమ్రోల నాప్రాణమైనను విడుతునుగాని యూరక పోనుసుమీ?

తే. గీ. జ్ఞాననిష్ఠాతపోమహి • మానుభావుఁ
డంగిరసుని కులమునందు • నస్త్రగురుఁడు
గన్న యీ దేహమైన నీ • కడను విడిచి
వేతుఁగాని నే వెనుకంజ • వెట్టనీశ!

కావున నీబూచుల నన్నిఁటిఁ దొలఁగించి నామార్గము నిరాటంకముఁ జేయు వేని నిదిగో నాప్రాణముల నిచ్చుటనే నీకర్పించుచున్నా నోమహేశ్వరా!

దండకము:— శ్రీసజ్జనానీకచిత్తాబ్జ భృంగాయమానా! జగత్కారణా! యీశ! యీరేడులోకాలఁ బుట్టింపఁ బోషింపఁ ద్రుంపంగ విన్నాణివై వెల్గు దేవుండ వీవొక్కఁడన్భావమే వేదవేదాంగముల్సర్వదా దెల్పి నన్బామరుల్నిన్ను వేర్వేర రూపంబులం గొల్చుచున్నార లయ్యారె! జన్మంబులేనట్టి నీకొక్క రూపంబునుం గల్గునే! ధర్మసంరక్షణార్థంబు నీయుత్తమాంశంబులొక్కొక్క సత్పూరుషుం బ్రాపుఁ గల్పించి యాపన్నులం దీనులన్వేగరక్షించి దోషాత్మసంహారము న్జేతువో యీశ్వరా! మంగళాంచద్గుణా

లంకరిష్ణుండవై సర్వలోకంబు వ్యాపించి నీవుండుటంజేసి యె
చ్చోట వీక్షించినన్నీదు మాహాత్మ్యమేకన్పడు; న్నీవులేకున్న
నీసృష్టిశూన్యంబు-నెత్తావులంజిమ్ము నానాప్రసూనాళిఁ జెన్నొప్పు
వృక్షంబులందుండి రంజిల్లుచున్నాయిగాఁగూయు నీడోద్భవౌఘం
బకస్మాత్తుగా నాకసంబెల్లయుంగ్రమ్మి క్రేళ్లింట వృక్షంబులం
గూల్చు పెన్గాలివీవంగ లోకంబుఁ గాఢాంధకారంబుఁగావించి
నేత్రాలమిర్మిట్లుగొల్పించువిద్యుల్లతాభంబు దీపింప గర్జించుచు
న్మిన్నుమ న్నేకమౌనట్లు వర్షించు క్రోంకారుమేఘంబులు
న్మిన్ను- మిన్కుంచు నాకాశవీథిం బ్రకాశించు నక్షత్రజాలంబుచే
నొప్పు నిశ్శబ్దరాత్రుల్ పథంబింతయుందప్ప కేకైకమార్గం
బునంబోవు సూర్యేంద్రులీ సృష్టియందుండకేపోయిన న్ని న్నెఱుం
గన్వశంబా! మహాత్మా! భవత్సృష్టిలో నెల్లప్రాణుల్జగంబు
ల్పదావర్తిలున్నీవు భావించిన స్సృష్టియున్నీవు కన్గొన్నఁజెంపాం
దుటన్నీవుపేక్షింప సంహారముంగల్గు; నీసృష్టిలోమానవుం డు
త్తమజ్ఞానవంతుండు తప్పొప్పులంజెల్పు ధీశక్తినంతుండు కాన
స్ఫులింగల్గుఁజవాళ్లికి న్నేటికి; యీజన్మకల్గన్భవత్సాంద్రకారుణ్యముం
జేసియో లేక ప్రారబ్ధకర్మావిశేషంబునో దేవ! యీజన్మ
సాఫల్యమౌనట్లు నీసన్నిధానంబునుంజెంద మర్త్యుండువర్తించు
టే నీదుసంకల్పము న్నీదునాజ్ఞాను బంధంబుగాదేని లోకంబ
లోకంబుగాకున్నె! నీయాజ్ఞ నెవ్వాఁడు లఘించునో వానికీ
లోక సౌఖ్యంబులేగాక నిర్జరి ప్రాపించు బ్రహ్మానుమోదంబు
నుంబోవు; నోదేవ నిన్నుప్రసన్నింజేయుగాఁజాలఁడోతండ్రి నీసద్గు
ణానీకమున్లో సమీక్షించి తత్తద్గుణౌఘంబునుంబొంద వాం
ఛించి తత్తద్గుణాభ్యాసముం జేసినంగాక నిర్జరశక్యంబుగాద

య్యా ; హింసల్మహా జారచోరత్వముల్జేయుచున్నిన్నుఁగొల్వంగ
నొక్కింతయున్లేదు లాభంబు; నీవపరిమేయుండ వాద్యంత శూ
న్యుండ వాధారభూతుండవుద్యత్ప్రపాభంగ రంగాంతరంగుండ
వున్ ధర్మరూపుండవున్ ఆదిదేవుండవున్ కర్మదూరుండవున్
సచ్చిదానంద తేజోమయాకార ధారుండవున్ సత్యశాంతాది
సల్లక్షణాభిజ్ఞ దేవుఁడవంచున్ సదాభ్యాసముం జేయుచు న్నీగుణా
భ్యాసముం జేయువాఁడే భవద్భక్తుఁడాతండె నీదేవుఁడో దేవ !
దుర్వృత్తినిందొట్టి కన్గానకున్నట్టి పాపిష్ఠి నీగుర్తెఱుంగన్సమ
ర్థుండు గాఁడయ్య; ఆతండు నీవైరి. సద్వృత్తినింబొంది పూతా
త్ముఁడజ్ఞానుఁడయ్యున్మహామూఢభక్తిన్నినుం దృప్తినింజేసి సా
రూప్యముం బొందుచున్నాఁడు ! ఓచెల్ల ! క్రోధంబులోభంబు
మాత్సర్యముంగామ మున్మున్నుగాగల్గు షడ్వర్గమీయాత్మకున్
స్వైరమార్గంబుఁదప్పింపయత్నించు వేళ న్తదాకర్షణాశక్తికిన్లోను
గాకుండ నీయంశమైనట్టి యాత్మప్రబోధప్రకారంబుఁ గావించు
టేపుణ్యమార్గప్రచారంబు. ఆలాగుగాకున్నఁ బాపంబువాటిల్లు..
ఆశక్తియే పుణ్యులన్దోషులన్భేదముంజేసె.ఆశక్తికిన్లోనుగాకుంట
యొంతేనిఁ గష్టంబు. ఈకష్టముంజెందుటే బాధగాగన్పడుం ద
ద్బాధయేపుణ్యసౌధంబునంజేర్చుసోపానమీబాధనీకల్పితంబంచు
లోనజ్ఞులూహింతురయ్యారె ! పుణ్యస్వరూపుండవైనట్టి నీవెట్లు
సంబాధముంజేతువో దేవ ! దేవా ! ననున్వేగ మాశక్తికిన్లోను
గాకుండ రక్షించుమో దేవ నిన్గొల్చి సేవించి నిన్గూర్చి నాంత్రం
బుఁగావించి ముద్దాడినేనాడెదన్బాడెదన్ మానినైనే బాలునైనే
వెఱ్ఱినైనే ; నీకన్న నాకెవ్వరుందిక్కు లేరయ్య నిన్నమ్మితిన్నన్నస
న్మార్గమందుండి తప్పించి యజ్ఞానమన్మీఁకటిన్ రూపులేకుండఁ బోఁ

గొట్టి తేజోమయంబైన నీదివ్యసాన్నిధ్యముంజేర్చి నాకాత్మశాంతి నమహాసౌఖ్యముంగూర్చి రక్షించుమోకర్మసాక్షీ! పరబ్రహ్మరూపా! నమస్తే నమస్తే నమః. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఏమిఁయో భగవానుఁడా! ఇంకయు బ్రత్యక్షము గావుగా, అట్లైనిదిగో యీకరవాలమున నాత్మోపసంహారముఁ గావించుకొనియెదఁ గాక. ఓకృతవర్మ కృపాచార్యులారా! మహానుభావులరగు మిమ్ములను తృణీకరించిన నన్ను క్షమింపుడు. మిమ్ములదూరముగ విడిచి నేనహంభావత్వముఁ గొనివచ్చినందుకు బాగుగ శిక్షయైనది ఏమైనం గానిండు; నిష్ఫల మనోరథుఁడనైన నేను మిమ్ముల నిఁక జూడఁ జాలను. ఓభగవంతుఁడా! నన్ను నాతండ్రికడ కిప్పుడు చేర్పుము. (అని కరవాలముచే బొడుచుకొనఁ బోవునంతలో)—

[ప్రవేశము—శంకరుఁడు.]

శం—వత్సా! ఆఁగు మాఁగుము. నీసాహసమున కెంతయు మెచ్చినాఁను. చాలుం జాలు.

అశ్వ—ఆహాహా! ఏమి నాపుణ్యము!

సీ. చూపుపీనులసొమ్ము♦లేవుగా బుసకొట్టి
సవతుల పోరుతో♦సందడింప
మృదు మృణాళభ్రమ♦న్మెడనున్న చిలువపై
కేకదంతుకరంబు♦చౌకళింప
మొలకట్టు వసనంబు♦పులితోలునిగనిగ
ల్మెను సిగపూవులై♦మిన్కులీన
గంగమెట్టిన యిల్లు♦ఘనజటా జూటమం
దురుల వేర్వొత్తురే♦యొండఁగా యు

గట్టుపట్టిని సామేనఁ ♦ బట్టుజెట్టి
సమరపతిపట్టిఁ జేపట్టి♦నట్టిబోయ
గట్టువిల్తుని లయకర్తఁ ♦ గంటి సహాహ
పొంత కరుదెంచె వెలియాల ♦ పోతుకాతు.

ఓ హెూ హెూ! భవానీవల్లభా! నమస్కారము—

తోదకవృత్తములు—జయజయ శంకర! ♦ సాగరధీరా!
జయజయసద్గుణ ♦ సన్నుతసారా!
జయజయసంయమి♦సంస్తుతరూపా!
జయజయనిర్గుణ♦సాంద్రకలాపా!
జయజయజ్ఞాన వి♦శారదమూర్తీ!
జయజయనిర్మల♦ శాశ్వతకీర్తీ!
జయజయయోభవ♦సంగవిదారీ!
జయజయదుష్టని♦శాచరవైరీ!
జయజయభక్తవ♦శంవదదేవా!
జయజయఖండిత♦షడ్గుణభావా!
జయజయమంగళ! ♦స్వైరవిలాసా!
జయజయ యీశ! ప్రకాశ♦స్తవికాసా!

శంక—ద్రోణనందనా! దీర్ఘాయుష్మంతుఁడవై వర్ధిల్లుము.

అశ్వ—చంద్రశేఖరా!

క. ఈబూచు లసాధ్యంబుగ
నాబాణములఁ దిగద్రావి♦నడచుచు నాతో
దూబూచుల నాడఁ దొడఁగె
నోబూచులఱేడ! వేగ♦మోమవె నన్నున్.

ఓమునికంఠీ!

క. పితరుని సంతసపఱుచుట
హితునకుఁ బ్రియమును నెఱపుట ♦ యీ రెండునుగా
కితరేచ్ఛలు లేవు; మదీ
ప్సితములఁ దీర్చి జగమందుఁ ♦ జేర్చవె నన్నున్.

శంక—ద్రోణాయనీ! శ్లాఘనీయమగు నీపట్టుదల నామనంబున మెప్పుఁ గొన్నది. నాప్రియభక్తుఁడగు కృష్ణునకు సన్మానమైనది. అది యునుంగాక పాంచాలురకుఁ గాలము తీఱినది. కృష్ణునకు సన్మాన మొనరింపఁ దలంచి వివిధములైన వికృతరూపములఁ గల్పించి నీమార్గమున కడ్డముఁ గావించితిని. నీవిఁక నిరాతంకముగఁ బోవచ్చును. బహుమానపూర్వకముగ నేనీ ఖడ్గము నీకొసంగుచున్నాను కైకొనుము. అని ఖడ్గము నశ్వత్థామ కిచ్చి వత్సా! నే నిచ్చిన పెద్దకాలము తడవు సేయరాదు. నేఁ బోయివచ్చెద. (అని నిష్క్రమించుచున్నాఁడు).—

అశ్వ—ఓహో! ఏమి! ఉమాపతి గడుసుఁదనము. ఈశిబిరములో నిద్రించుచున్నపాంచాలుర కాయువు మూఁడినదని కాఱ్ఱేఁడు చెప్పుటలో నొక్క విశేషము లేకపోలేదు. ఈ మేలింటిలో నున్నపాంచాలురమాటఁ జెప్పినప్పుడే కృష్ణ పాండవాదులను గూర్చి వేఱఁ జెప్పనక్కఱలేదని మిత్తిగొంగ యభిప్రాయము. ఇంత శిబిరములోనివారి నందఱి మృత్యువు నోటనుండి తప్పించుటసాధ్యమని తలంచి నాతో స్పష్టముగఁ జెప్పకయే స్థాణుఁ డంతర్ధానుఁ డయ్యె. పినాకపాణికిఁ బ్రాణప్రియుఁడైన నారాయణుఁ డిపు డెక్కడికి బోవునో చూచెదను. అతనికి సన్మానమయ్యెనని శివుఁడు చెప్పెఁ గదా! అవు నవును, గంగాధరుఁడు చెప్పిన ట్లిప్పు డతని కేను గట్టిసన్మానమును తప్పక

జేసెదను—(సక్రోధుఁడై)—ఓరోరి పాండవాధములారా! (అని "పజాపజా" అను పద్దెమును మఱలఁ జదువుచు శిబిరముపై కెక్కి కలయఁ బరికించి అందు నిద్రించుచుండిన వైరిభటులం జూచి)—కటకటా!

చ. సమరమునందుఁ గెల్చుటయొ చచ్చుటయో కావలెఁ గాని మేము
నుద్యమమును వీడమంచు దివమంతయుఁ గయ్యపుఘోరకోర్కిఁ జెం
జెమటలు నూడ్చి చెందిరని శ్రేమఁపుఁ గష్టము పండినట్లుగా
నమల నిశీథమందుఁ గడు హాయిగ నిద్రలుచుండి రీభటుల్.

మఱి దురాత్ముఁడైన ధృష్టద్యుమ్నుఁడో!

చ. అని మొనఁ గాయకష్టములఁ గాంచట నోర్చి శ్రమంబుఁ గొన్న యీ
ఘనభటులు లందఱిక స్ఫుటశక్య శిభూమిఁ బరుండఁ బెట్టి మె
త్తని నునుపాన్పు దోమతెర దాల్చిన సుందిరి పట్టెమంచమం
దనువుగ నిద్రవోయెఁ గురుహాంతకుఁ బట్టి వధింతు ముందుగన్.

ఆహాహా! నాపితరుని నిష్కారణంబుగఁ జంపిన దయాహీనుఁ డీధృష్టద్యుమ్నుఁ డీసమయమునఁ జేఁ జిక్కెనను వీనిని పట్టి వధించుటకు నాకుఁ జేయూఁతకున్నది కదా! అతిక్రోధోద్దీపితుఁడనై గుండెలు తాల్లు జేసికొని ఘోరహింసఁ గావించుటకు వచ్చిన నాకు సమయమునకుఁ జాలిపుట్టుచున్న దేమి. అవు నవును—

చ. అగపడునట్టి మానవుని మాంసము మెక్కు పలాశికైన ఘో
రగహనమందు నుండెడి కిరాతునకైనను, బూరిమేసి పా
ల్దగనిడు సాధుజంతుతతుల న్వధియించు కసాయికైన లో
నెగడక మాన దింత దయ నిష్ఠురహింస నొనర్చు పట్టునన్.

మఱి యీదయాగుణ మొకరు తెచ్చి పెట్టినది కాదు; బలవంతముగ నాఁపుకొనుట కాఁగునదియుఁ గాదు.

తే. గీ. అఖిల హృదయంబులకు నీదయాగుణంబు
సహజ సిద్ధంబు; దీని ప్రచారమావఁ
దలఁచు కఠినుండు సూర్యమండలముఁ గనవుఁ
జొన్పి కటికి చీఁకటిఁ జేయఁ జూచువాఁడు.

ఆహాహా! దయాగుణప్రభావము!

మ. నును పై చల్లనిసోనయై, శ్రితులకున్మంగొంగు బంగారమై
ధనమై, పేదల కన్నమై, పుడమి సంతానాగమై హృన్నికే
తనమై, రాజకిరీటమై, సభలలోధర్మంబు సైదోడునై,
ఘనమాశక్తియునై మహేశుగుణమైకారుణ్య మేలు న్భువిన్.

ఇఁక నేమైనం గానిమ్ము. జనకునకు సంతోషముఁ గూర్చుటయే కర్తవ్యము. దయాధర్మతుల నెంచువాఁడు కార్యమును సాధింపలేఁడు. ఓరాక్షసపిశాచగణములారా! రండిదిగో మీ కందఱకు నేఁడు కమ్మనివిందొనరింపఁ బూనుకొన్నాను. ఓతండ్రీ! ద్రోణాచార్యా! పైనుండి చూచి సంతసిల్లుము. ఇదిగో నీయభీష్టము తీఱుచున్నది.—

[అంత నక్తంచరుఁ డనురాక్షసుఁడును లంబోదరి యను రాక్షసస్త్రీయును బ్రవేశించుచున్నారు.]

నక్తం—లంబోదరీ! లంబోదరీ! కనుచీఁకటి పడినది మొదలింతవఱకు ఆఁకలిబాధచే గాంద్రుకాంద్రు మనుచు నాప్రియురాల వగునీవుపవాసముఁ జేయుచున్నావని నాకు విచార మింతింతని చెప్పలేకున్నాను. లంబోదరీ! లంబోదరీ! ఈదినము లేచినవేళ మంచిదే. నేఁటిరాత్రి మహానుభావుఁడగు అశ్వత్థామ మనల కందఱకుఁ ద్రాగినంత నెత్తురును తిన్నంత మాంసమును కడుపు పట్టినంత గుఱ్ఱములయొక్కయు నేనుఁగులయొక్కయు పచ్చి

మాంసమును మొగము మత్తువట్టు లోలలాడించి మనకుఁ గస్తు కమ్మని భోనాలు పెట్టునఁట, మనోహారిణీ! ఆలస్యము చేయకుము, భోజనము మిగిలిపోవును రమ్ము రమ్ము లంబోదరీ!

లంబో—నక్తంచరా! నక్తంచరా! మనోహరుఁడయిననీవిప్పుడే యాహారమును లేక నకనకలాడుచున్నావని నీకంటె వేయిరెట్లు విచారపడుచున్నాను. ప్రియభర్తవయిన నీవు ముందుగ విందారగించినఁగాక నేను భోజనము చేయను, నాయాలస్యమేమియును లేదు.

నక్తం—వహ్వా! లంబోదరీ! వహ్వా! లంబోదరీ! ఏమి యీ యాశ్వత్థామ! మారిమసఁగినట్లు, మిత్తి చెలరేఁగినట్లు, జముఁడెత్తి వచ్చినట్లు, తామరచెరువులోఁ బ్రవేశించిన లులాయమువలె కేలివనముఁ దఱిసిన మత్తగజములాగున, గారడవిఁ దరికొన్న కారుచిచ్చు విధమున నిద్రించుచున్నయీభటులందఱిమధ్యమున నితఁడు విహరించుచు మహాక్రీడలాడుచున్నాఁడు. మున్నెవ్వరైన నిట్లొనరించిరా? ఇంతకు మనపుణ్యము మంచిది. మనకుఁ గడుపునిండఁ గూడుఁ బెట్టుచున్నాఁడు. వహ్వా! వ్రతముఁ బట్టిన నిట్టి వ్రతము పట్టవలె. పట్టుటకేమి? పట్టిన నిట్లు దానిం దీర్చుకొనవలెను మనకింత దొరకవలెను.

అశ్వ—(శిబిరాంతస్తుమీఁదనుండి) ఓరోరి! ద్రోహి! ధృష్టద్యుమ్నా!

స్రగ్ధరావృత్తము.—సక్రోధుఁడై)—

ఓరీ! క్రూరాత్మ! మోరీ!యురవడిగురునిన్ యోగనిద్రా ప్రశాంతు
న్వైరాగ్యుం బుత్రశోకవ్యథఁ గొని శరచాపంబుల న్వీడియుండ
ఘోరాకారుండవై ముంగురుల రయమునన్ గుప్పిటం బట్టి గొంతుం
గ్రూరాసిం గోసి యిచ్చోఁ గుఱుకొని నిదురం గుల్కుచున్నావు లేరా!

ధృష్ట:— దురాత్మా! నన్ను బలవంతముగఁ జంపెదవు చూతురా! పలుగాకి!

(నేపథ్యమున ధృష్టద్యుమ్నుఁడు)—

(ద్రోణనందనా! నన్ను నీబాణపరంపరచే సవ్యంబుగఁ జంపి సద్గతికిం జేర్పుము.)

అశ్వ—ఏమేమీ! నిన్ను సవ్యముగఁ జంపవలెనుగా! ధృష్టద్యుమ్నా! నాతండ్రిని నీవు చంపినపుడు సవ్యాపసవ్యము లేమైనవిరా కూరాత్మా! పశువును బలవంతముగఁ జంపినట్లు నిన్నుఁ జంపెదను చూడు మిప్పు డోమూర్ఖా!

మహాస్రగ్ధరావృత్తము:—

ఉరము వ్రక్కలుకాలిచే నత్యుగ్రబలమున బిట్టొత్తి యూర్ధ్వవకుఁడెడ
న్గరము లక్కంపింపఁగా మేనగ్గడగడ వడఁకంగన్ను వ్రమాఁగన్ను వెట్ట
న్గురుహంత న్పార్ష తున్నే గొనయము వలనం గొట్టు హింసించు రీతిన్
శిరముం ఖండించి నీకిచ్చితి నిదె జనకా! చేరి చెండాడుకొమ్మా

లంబో—మనోహరా! నక్తంచరా! గోతికడ నక్కల వలె నోరు తెఱచుకొని మన మిక్కడఁ గాచికొనియుండ నీయశ్వత్థామ ధృష్టద్యుమ్నుని తలపండును తండ్రి కిచ్చుచున్నాఁడు చూచితివా! మనోహరా! తండ్రి దానితో బంతి యాడుకొనునఁట. అందువల్లఁ గడుపునిండునా కాలునిండునా? జీడిగింజను చక్కచక్కలుగఁ జితుకఁగొట్టి పప్పునొల్చి తినునట్లీతలకాయను చితుకఁగొట్టి అందులోని మెత్తని మెదడు మాంసమును కమ్మకమ్మగఁ దింపముకదా? అన్నియంగములలోఁ దలకాయ యుత్తమాంగము. దానిలోని మాంసము సర్వోత్తమమైనది ఆమాంస మన నీవు చెవి గోసికొందువు గదా?

నక్తం—మనోహారీ! లంబోదరీ! తలలో మాంసము విస్తారముండదు. ఆకొంచెము మాంసము మన కేమూలలకు వచ్చును. గుట్టల కొలఁది మాంసమైనను మనకొక్క దవడకుఁ జాలదు. బానల కొలఁది నెత్తురైనను మనకొక్క గుక్కకు రాదు. వహ్వా! సంతర్పణము బహుబాహుళ్యముగ నున్నది. పచ్చి మాంసపు ముక్కలు నెత్తురోడుచున్న కండలును తియ్యతియ్యని యెముకలును జంతికచుట్లనుబోలు నులినరములును హాయిగ మనకుఁ గిరాటు వేయుచు నప్పుడుగాఁచిననేయివలె గమ్మనైన వెచ్చ వెచ్చని నెత్తురును మనకుఁ ద్రావ నిచ్చు చున్నాఁడు.

అశ్వ—ఓభవానీ వల్లభా! బహుమాన పూర్వకముగ నీవునాకు ఖడ్గ మొసంగినందుకు నీకుఁ గృతజ్ఞతఁ జూపుచున్నాను చూడుము

(మేఘవిస్ఫూర్జిత వృత్తము.)

అహో సక్రోధస్ఫూర్తి గజతతి సింహంబు హింసించురీతిన్
మహోహాద్యజ్జ్వాలాభానలము వనమున్మాడ్చు చందంబు భీతా
వహక్రీడ న్పాంచాలుర శిరముల న్పట్టి ఖండించి శీర్ష
ప్రహారంబుం గల్పించితిని యిదిగో పార్వతీనాథ రమ్మా!

ఇదుగో! ఈదురాత్ముఁ డిచ్చటఁ బడి నిద్రబోవుచున్నాఁడు.

భుజంగప్రియాతవృత్తము.—

సమీరాక ప్రచండుం బ్రశాంతప్రచారున్
విముక్తాస్త్రు గాంగేయు వివ్వచ్చు ప్రోత్సా
హ మొప్పం బరాచీనుఁడై యుండ నొంపం
గ మార్గొన్న నీచు న్శిఖండి న్వధింతున్.

ఓరే దిమ్మరులారా! ఇదిగో శిఖండిని ముక్కచక్కలుగ నఱికి మీకుఁ బడవేయుచున్నాను సత్వరితముగఁ దినుఁడు —

లంబో—నక్తంచరా! నక్తంచరా! మనకీఁక భోజనము తృప్తియైనది. నేను పదివేల యేనుఁగుల మాంసమును, వేనవేలు గుఱ్ఱములను లక్ష మంది మనుష్యులను తెగదిని బానలకొలఁది నెత్తురును దాహము పుచ్చుకొన్నాను. అబ్బా! ఇఁక మాంసమన్నను నెత్తురన్నను నోకరని డోకువచ్చుచున్నది త్రేపు త్రేపు మని త్రేఁపులు గూడ వచ్చుచున్నవి. నాకిఁకనాకలిలేదు, ఇంట్టి వద్దఁ బిల్లలేడ్చుచుందురు. పోరువట్టినప్పుడును అల్లరిచేయు నప్పుడును వారికీముక్కల నొక్కటొక్కటిఁ జేతికీయవచ్చును. ఈశిఖండిగాని మాంసముతో గొంత నేనుఁగునెత్తురులో గుఱ్ఱముర క్తముఁ గలియఁ బోసి యూరుగాయఁ బెట్టుకొందము. పోనీయుకు మీ మాంసమును, ఎప్పుడు నట్టిహింసలు జరుగునా యేమి? మాయు దేవతలకును మనకొలము సాములకు నెప్పుడును యుద్ధములేకదా! ఈదేవత లెప్పుడు నేదియో విధముగ మనవారినే చంపుచుందురు. ఒయశ్వత్థామా! నీవొకసారి దేవతల నందఱిని జంపివేసి మాకులము నభివృద్ధిలోనికిఁ దెమ్ము నాయనా! నీకు బుణ్యమువచ్చును.

నక్తం—ప్రియురాలా! ప్రియురాలా! నాకు దేహము మత్తెక్కినది. వాఁపిరిగొట్టువానివలె మాంసముఁ దెగతిన్నాను. నన్ను మెల్లఁగఁ దీసికొని పొమ్ము మనోహరీ! మనోహరీ! లంబోదరీ!

(రాక్షసులు నిష్క్రమించుచున్నారు)

అశ్వ—తరువోజ.

అరు దగువిక్రమోద్ధతి లావు పెంపు లలరంగఁ దాఁకి వేదండతండములఁ గరములఁ బిట్టూఁచి కొక్షేయకమునఁ గండసీమ లవియఁగాఁడున్నిహ యని

కరముల మోరలఁ♦గండకండలుగఁ♦గాఁడ నటికి నెత్రు♦కాల్వలై వెల్లి
విరియఁగ గృహమునందుఁ♦బీన్గుల పెంటఁ♦బెట్టితిభూతము♦ల్వెర రేగియాడ.

నేనిఁకను రాజరాజు కడకుం బోయి పాండవవంశ మపాండవమై పోయినదని చెప్పవచ్చుఁగదా! ఔరవురా! పొరపాటు జరిగినదే? ఈచంపబడిన వారిలో బాండవులున్నారా?

సుగంధివృత్తము.—దొడ్డవింటినారిచేతఁ♦దొల్తఁ బార్షతాధము
న్గొడ్డుఁ జంపునట్లు గొంతుఁ♦గోసి కృష్ణగన్నమే
ల్బిడ్డల న్వధించి నీము♦భీతిఁ గొల్పునట్లు క
న్పడ్డవారిఁ జంపినాఁడఁ♦బాండుపుత్రులేరొకో!

(అని కలయ వెదకుచు విషాదము నభినయించుచు) అక్కటకటా! ఈసందడిలో నిందుండి పాండవు లేగురును గృష్ణసాత్యకులును నాకంటఁ బడకుండ నెక్కడికో పారిపోయినారు గాఁబోలును. అయిన నెక్కడికిఁ దాఁటిపోఁగలరు. ఆవైపునఁ గృపాచార్య కృతవర్మలు గాచికొని యున్నవారు గదా? వారు వారిచేఁ బట్టుపడక పోదురా యేమి! ఓమామా! కృపాచార్యా! ఓకృతవర్మా! ఇదిగో దిగివచ్చుచున్నాను. పాండవు లేగురుఁ గృష్ణసాత్యకులతో జల్లఁగ గ్రిందికి దాఁటినారు. పోనీయక గట్టిగఁ బట్టుకొనుఁడు. పట్టుకొనుఁడు.

అశ్వగతివృత్తము.—

ఎందున కేగిరో పాండవు♦లిచ్చటఁ గానఁగరా
రందునకుం దిగిరేమొకొ♦అడ్డముగాఁ జనియూ
పందలఁ బట్టుఁడు నేనిదె♦వైళమ వచ్చెద మాతుల! గో
విందుఁడు సాత్యకితో గను♦పింపఁడు మాయ విధీ.

ఓరధికవరేణ్యులారా! నామాట వినుఁ డిదిగో?

మాలినీ వృత్తము:—(శిబిరముమీదనుండి దిగుచు)—

మానవిహీనులు పాండవు లేగురు॥ మాధవ సాత్యకు లచ్చట నెం
దైననుఁ గన్పడిన న్దయఁ జూపకఁ॥ దందఱఁ బట్టి వధించుఁ డహో
మానవనాథుని ప్రోలవచించిన॥ మాటకు భంగము గల్గుకృతిం
బూనుఁ డహో కృతవర్మ! కృపా! మొగ॥ మోటముగాఁ బనిఁ జేయకుఁడీ.

ప్రవేశము—కృపాచార్య కృతవర్మలు.—

కృపా—కుమారా! పాండవులుగాని కృష్ణుఁడుగాని మాకిం దెచ్చటను గన్పడలేదోయీ!

కృత—మాకంటఁ బడకుండ వా రెట్లు పారిపోఁగలరు?

కృపా—మాయలమారి కృష్ణుఁ డేదియో యుపాయముఁ బన్నియుండ వచ్చును.

కృత—అహాహా! నెత్తుట జొత్తిల్లిన నీకట్టుబట్టలును, కిరాత దంష్ట్రల వలెఁ జెన్నుమీఱుచున్న నీయసిధార కంటకొనియున్న మాంస మిళితములైన యెముకల తునుకలును నీపరాక్రమమునకు సాక్షి భూతములగు చున్నవి సుమీ! ద్రోణాయనీ!

అశ్వ—కవిరాజవిరాజితము.—

వరుసగ వైరులఁ॥ బట్టివధించితిఁ॥ బాండవ వంశము॥ పాండవమై
పరఁగక పోవునె॥ పాండవులీకర॥ వాలము బూనికిఁ॥ బొల్పడినః
స్మరజనకుండును॥ సాత్యకియు న్మటు॥ మాయముగాఁ దమి॥ చాటున వేఁ
బరువిడిపోయిరి॥ భాగ్యవశంబునఁ॥ ప్రాణము దక్కెను॥ వారలకున్.

అశ్వ—అకటకటా! ఏమైన నేమి? ప్రతిజ్ఞ దీర్చుకొనలేక పోతిని సరిదా మీఁదు మిక్కిలి నిద్రితులుంబడిన పాంచాలురను జంపితినను యపకీర్తిఁగూడఁ గొని తెచ్చుకొంటిని. విశేషించి ద్రోవదికిఁ బుత్రశోక

ముఁగూడఁ గల్పించితిని. హరి! హరీ! నేనెంత పాపాత్ముండ నైతిని.

లయవిభాతి—.

మనుజపతిమోకాలఁగదఁ గినిసితిని పాండవుల దునిమెదనుగాక
యని మునుకొనిప్రతిజ్ఞన్
గొని హితులసూక్తులను వినక నిదురంబడినజనులఁ బరిమార్చితి
ని చెనఁటు లలకుంతీ
తనయులను జాపుటకు ననువుపడ లేదనుచు మనుజపతి నేముఖ
ముఁగొని కనుదు ననుచున్
న[illegible]యున్న సను ఘనముగ నుతింపగ దగునె? ప్రతినవోయె
నఘము మును సడియుఁ గల్గెన్.

ఓరోరి! పాండవాధములారా! ఈరాత్రి మెల్లఁగ నాబారినుండి సురిగి పోయినను నేనెక్కడికిఁ బోయెదరురా దురాత్ములారా! ఛీ పిఱికిపందలారా! కృష్ణసాత్యకులారా! చీఁకటిచాటునఁ దాటి ప్రాణము దక్కించుకొనుట కంటెఁ జచ్చుటమేలు? మామా! కృపాచార్యా! ఇప్పుడు మనము చేయందగు కార్యమేదియును లేదు. ఆకాశమున నక్షత్రములు కాంతిహీనములగుచున్నవి. తూర్పు తెలుపెక్కుచున్నది. మఱియు—

మంగళమహాశ్రీవృత్తము.—

భానుహాసులం దలరి పుష్పతతిసౌరభముఁ బూని చలివయ్యరలు
వీచెన్
బాహుగళకుంతములు పర్విడఁగఁ జొచ్చె మను పల్లరయఁగా కలి
చెలంగెన్

సీరముల మూఁపులను జేర్చికొని వేగమె కృషీవలుడు భూమి
కరుదేరఁ
సారతర కీర్తిఁగొనఁ బాఁగుఁడిఁక లెరిదనుచుఁ జూడనవఁ గొల్లు
వెసఁగూసెఁ.

కావున నోరథికవరేణ్యులారా! మన మిచ్చట నుండుట లెస్సకాదు.
పోదము రండు.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము సంపూర్ణము.

# ప్రసన్నపాంచాలీయనాటకము.

## పంచమాంకము.

[ప్రదేశము ద్వారకానగరప్రాంతము.]

(ప్రవేశము ఒకముసలిభటుఁడు)

(గడఁగడ వడఁకుచు గద్గదస్వరముతో) అమ్మయ్య! ఎట్లెట్లో సందులవెంటను గొందులవెంటను కారుచీఁకటిలోఁబడి ప్రాఁకులాడుచు మెల్లమెల్లఁగ నశ్వత్థామ బారినుండి తప్పించుకొని బయట బడుటకుఁ దలప్రాణము తోఁకకు వచ్చినది. అబ్బా! ఏమి కోలాహలము! ఏమి విచిత్రహింస! నాకిప్పటికి తొంబది యేండ్లు గడిచినవి; అనేక యుద్ధములలో మెలంగినాఁడను కాని ఇట్టి ఘోరకర్మ మెప్పుడును కని విని యెఱుఁగను. ద్రోణాచార్యుని కుమారుఁ డీవైపునకు దెగివచ్చుట లేదుకద! (అని భయము నభినయించుచు) ఇంతకు నేటిదినము నేను లేచిన వేళ మంచిది. నాతల్లికి నేనొక్కఁడను. నన్ను విడిచి నాతండ్రి బతుకఁ జాలఁడు. నాతల్లికి నేను ముద్దుకొడుకును. నాపడుచుపెండ్లాము యొక్క మంగళసూత్రబలముచే బ్రతికి వచ్చితిని గాని వేరొండు కాదు. అబ్బా! ఎక్కడఁ జూచిన నెముకల పోగులే! ఎక్కడ నడుగిడినను మొలబంటి నెత్తురు రొంపిలో దిగబడిపోవుటయే! అన్నిగుఱ్ఱములను యేనుఁగులను ద్రోణాయుని తనపొట్టఁ బెట్టికొన్నాఁడు. ఇఁక శిబిరములోని గగ్గోలు చెప్పశక్యముగాదు. కొందఱు స్తవ్యస్తఁపు మాట

ఏమందువా ! పువ్వుబూసినది గెలవేయక మానునా ? గెల వేసినచో దీనికిఁ బ్రాణాపాయమే కదా ! అఁటుదానికిని జాలు సౌఖ్యమా యేమి?

కళా—దేవీ! నెట్టిదానవుగాని, అందఱకుఁ కీడుయగుచున్నదా యేమి?

ద్రౌ—కళావతీ ! ఒకవేళఁ దల్లిసుఖముగ బయటఁపడినను గర్భశోక మనుభవించని తల్లియున్నదా ! గర్భశోక మనుభవించుట కంటెఁ, దల్లి ప్రసవసమయమునందే ఈ యరఁటిచెట్టువలె నిలఁ గూలిపోవుట మంచిది. చూడుము, నాతోడికోడలగు సుభద్ర అభిమన్యుని చావువిన్నది మొదలింతవఱకు నిద్రాహారములు లేక అవురని యేడ్చుచు మంచముపై నుండి లేచుటలేదు.

కళా—అవు నవును, గర్భశోకము శత్రులకైన వలదు దేవీ !

ద్రౌ—కళావతీ ! చూడు మా మూలకాకియొక్క దౌష్ట్యము ?

ఉ. "వాయస మంచు నమ్మి యెడఁబాయక పెంచితి నింతకాలమీ
కోయిల తెక్కల బ్బెననిఁగూటిని నుండదు నేను కా"యస
న్గాయని నిప్పులొల్కు మిడిగ్రుడ్లిడి చూచునటంచుఁ గిన్కమై
వాయస మాపికంబు తలవాఁచగఁ దన్నెడుఁ జూడవే చెలీ.

కళా—పాపమా కోయిలపిల్ల యేమి చేసినది ? దాని స్వభావచిహ్నములైన చేష్టల నది చూపించినది, వానిని మార్చుటకు బ్రహ్మకైన వశమా?

ద్రౌ—కళావతీ ! పరపోషణఁ బొందినవారి బ్రతు కింతియసుమీ.

కళా—దేవీ ! పరపోషణఁ బొందువారికి స్వతంత్ర మెక్కడిది. ఒక వేళ బరపోషితుఁడు స్వతంత్రముఁ గోరినా యీకాకపుష్టము వలెఁ దన్నులఁ దినక మానఁడు సుమీ ?

ద్రౌ—చూడు మాకాక మింకయు దానిని విడువక దాని నీవైపునకే తఱుముకొని వచ్చుచున్నది. నేఁబోయి దానిని కెదరించెదను. (అని కొంచెము లోనికిఁ బోయి మఱలవచ్చి) ఔరౌరా! ఈ కాకము నానెత్తిమీఁద వృథాగా దన్నిపోయినది. అబ్బా! కళావతీ! నాకేమియుఁ దోఁచుటలేదు. రానురాను మన సంతాన గర్భశోకము వలనఁ బోయినది. మీఁదు మిక్కిలి యీకాకము నానెత్తిపైఁ దన్నినది. ఇవన్నియు దుర్నిమిత్తములే సుమీ! అచ్చటఁ బాంచాలురు సుఖులే గద!

కళా—దేవీ! మాటల ధోరణికేమి? సంభాషణకు మేరయున్నదా యేమి? ఆకస్మికముగ నల్లనైన నీముంగురులంజూచి పికమను కొన్నది కాఁబోలునా కాకము. గోరంతలఁ గొండంతలుచేసెదవేల? పాంచాలురు సుఖులు గాకేమగుదురు?

ద్రౌ—కాదు కళావతీ! ఉపప్లావ్యమునుండి నేనిచ్చటకు బయలు దేఱినప్పుడుఁగూడ నాకు దుశ్శకునములేతోఁచినవి. ఇప్పుడు నాహృదయమున నేదియో ఆందోళముగల్గుచున్నది.

ప్రవేశము—అర్జునుఁడు.

అర్జు—(చాటుననుండి)—.

ఉ. అఖిలం జోపుచుఁ బూవుఁదేనియల నాహ్యాయంబుగాఁ గ్రోలుచు
న్ఫలరాజంబుల మెక్కుచు న్నలరుల న్బల్మారయుఁ జేఁ దున్మచుం
గలకంఠంబులఁ బాడుచు న్సుమపరాగం బుద్ధతి న్జిమ్ముచుం
జెలు లున్నారిటఁ జిత్తవృత్తిఁ గొలఁది న్జెల్వొప్పఁ గ్రీడించుచున్.

అక్కటకటా! హాయిగ విహారసౌఖ్యమనుభవించుచున్న యీసాధ్వీమణికి పిడిదంపువార్త నెట్లు వినిపింతును? ఔరా! ఈద్రౌపదినిఁ జూచినతోడనే నాకు దుఃఖము పొంగిపొరలి వచ్చుచున్నది.

చ. పడినది కొల్వుకూటమునఁ బ్రల్లదు లాడిన కాఱులన్నిఁ గో
ల్పడినది కట్టుచీరల; విపత్తుల కోర్చుచుఁ దాస్యవృత్తిలోఁ
బడినది సౌఖ్య మబ్బుతఱిఁ బార మెఱుంగని గర్భశోక మీ
పడఁతుక కాంచె; నౌర! విధి వ్రాసిన వ్రాఁత యలంఘ్య మేరికిన్!

కట్టా! ఎన్నివిచారములనైనఁ జవి చూచినదికాని యిట్టి విచార మెన్నఁడు నెఱింగినది కాదుగదా!

తే. గీ. ఉవిద యనపత్య మెట్లైన నోర్వఁ గలదు
కన్నకొడుకుల ప్రాజ్ఞులై యున్న పైఁచు
నడవులందున నగచాట్లఁ బడును గాని
లేమ గర్భశోకము పైఁప లేదు సుమ్మి

కాని, నేనీ విషయమును గప్పిపుచ్చు టుచితముగాదు. (ముందుకు నడచి ద్రౌపదీ కళావతుల కగపడుచున్నాఁడు.

ద్రౌ—నాథా! నమస్కారము.

కళా—అన్నా! నమస్కారము.

ద్రౌ—నాథా! కళకాంతులు దక్కియున్న మీ ముఖకమలము నేఁ డేదియో కీడుమూఁడినదని చెప్పక చెప్పుచున్నది. పాంచాలురు శిబిరములో సుఖంబుండిరే?

అర్జు—సాధ్వీమణి! ఏమని వచించుటకును నోరురాకున్నది. నాలుక తడఁబడుచున్నది. కాళ్లు గడగడ వడంకుచున్నవి.

ద్రౌ—నాథా! పాంచాలురు సుఖులే కద. అదిమాత్రము సత్వరితముగఁ జెప్పుము.

అర్జు—పావనీ! సద్గతి విహీనత మన ముఖంబులపై వ్రాయఁబడి యుండఁ బాంచాలు రెట్లు సుఖులయి యుందురు?

ద్రౌ—హా! కుమారులార! హా! రూపజితమారులారా! అపారూప పరాక్రమవారులారా!

చ. అకట! కుమారులార! కడు♦పార ఖిమ్ముం గని పెంచి విక్రమా
ధికులను జేసి మీరిఁకను♦దీర్తురు పడ్డ శ్రమం బటంచు న .
విచ్చుకఁ గొనియుంటిఁ గాని యప♦మృత్యువు మిమ్మల నింతలోననే
యొకగుమిగాఁ హరించునని♦యొక్కఁడునైనఁ దలంప నైతిఁగా.

కళా—అమ్మా! ద్రౌపదీ! కొమ్మలు నఱకఁబడిన మోడువలెఁ గ్రిందు పడి యిట్లాపురని యేడ్చినచో నేమిలాభము. ఊరడిల్లుము దేవీ! ఊరడిల్లుము.

అర్జు—దేవీ! ద్రోణాయనియే నిన్నటిరాత్రి మన చిన్నికట్టులపాలిటి కాలయముఁ డయ్యె దేవీ! ప్రాప్తిల్లినదానిం గూర్చి వాపోయినచో నేమిలాభము?

ద్రౌ—హా! కన్నతండ్రులారా! హా! ముద్దుకట్టులారా!

చ. అలఘు పరాక్రమాఢ్యులు మ♦హాబలశాలురు జాహ్నవీసుతుం
గలశజుఁ గర్ణునిం గెలువఁ♦గల్గిన పుత్రులు రాత్రి ద్రౌణిచేఁ
బాలియికఁ గాంచి రథ్యులను♦బోఁడిమిఁ దాఁటఁగలారు సన్నఁపుం
బడియను మున్గిపోవుట న♦మాతయ భాగ్యమె కాగె చెప్పఁడా.

అర్జు—పావనీ! పాండవవంశము నిర్వంశమైనది కదా యని లోలోన నేడ్చుచున్న నీపతులకు ధైర్యముఁ జెప్పుటకు మాఱు నీవిట్లు నోరెండ గొంతెత్తి యేడ్చినచో మాకిఁక దిక్కేది?

ద్రౌ—హా! నందనరత్నములారా! మీతల్లిదండ్రుల కేమియుఁ జెప్పకయే లేచిపోతిరా!

ఉ. మిమ్ములఁ గన్నతల్లియును♦మిమ్ములఁ గాంచిన తండ్రులుం గటా
మిమ్ములఁ జూచి సంతసిలి♦మీవలనం గల సౌఖ్యమందఁ బూ

ర్వమ్మున నోఁచలేదకట! పల్వురు పుత్రులు కన్నఁదోయి కొ
క్కమ్మనిడిఁ గట్టినట్లెదుటనుండ భరింతును గర్భశోకముల్.

కళా—అమ్మా! పాంచాలీ! కష్టములు వచ్చునప్పుడు ధైర్యముఁ దెచ్చుకొనవలెనుగాని దుఃఖమునకు లోఁబడిపోదువా?

ద్రౌ—హా! కుమారులారా! సుకుమారులారా! (అని పెద్దపెట్టున నేడ్చుచు.)

చ. కలకల నవ్వు మీ ముఖవికాసము, ముద్దుల మూటగట్టు మీ
పలుకుల, నొండొరుల్చెలఁగి పందెము చూడుఁడు నే నవైరులం
దలకొని చంపి యమ్మమదిఁ దైన్యముఁ దీర్తు నటంచుఁ జూపులా
పులసుతులార! నేమఱచిపోదును నిల్తును నే సజీవనై!

అర్జు—దేవీ! ఛాయవలె మృత్యుదేవత యెప్పుడును సకలజంతువులకు వెనువెంటనే వచ్చుచుండునుగాని నిద్రవోవువారి నకాత్తుగ ద్రోణాయని చంపినందుకు మాత్రము హృదయమున రోషవిషాదములు మల్లడిగొనుచున్నవి సుమీ?

కళా—తల్లీ ద్రౌపదీ! అనుభవధన్యవగు నీబోఁటి బోటికేను చెప్పనక్కఱలేదు కాని నామాట విని ధైర్యమార్గమవలంబించుము లెమ్మా.

ద్రౌ—అకటా! ద్రౌపదేయులారా!

చ. కలవరమంది మాత! జనకా! మముఁ గావఁగలేరె? యంచుఁ గేఁ
కలనిడి దిక్కుఁగాన కతికష్టముగా నిలఁగూలి నారె! లో
పలఁ దరిగోయుచున్న యదిపార మెఱుంగక పొంగుదుఃఖమ
న్జడనిధి; పుత్రులార! కడుఁజాలిజనించె నీఁ కెట్టు లుండెదర్.

కళా—అమ్మా! పాంచాలి! విచారకరమైన యీవార్తను విన్నది మొదలింతవఱకు కొక్కమాదిరిగనే కన్నీరు మున్నీరగునట్లు

తెలుఁగెత్తి యేడ్చుచున్నావు. నే నెంతచెప్పినను వినవైతివి. నీగొంతుకకూడ బొంగువోయినది. తుదకు శరీరాపాయముఁ గూడఁ దెచ్చుకొనెదవు సుమీ?

అర్జు—దేవీ! గతించినదానింగూర్చి దురపిల్లుట గతజలసేతుబంధనమే సుమీ!

ద్రౌ—కటకటా! కుమారులారా! నాబుద్ధిమాంద్యమే మీమరణ కారణమై పరిణమించెనా?

ఉ. పోయినదేమొ పోయినది ♦ పొమ్మనఁ కఁ గాలికి ధూళికే నుదుల్
పోయినవంచుఁ గానఁ బడి ♦ పొల్పుగ మిమ్ములఁ జూచికొంచునే
హాయిగ నుండలేక యకటా! రిపునాశముఁ జేయఁ గోరి కొం
తేయులఁ దూలనాడితి తు ♦ దిన్నుత శోకముతోడ నిల్చితిన్

హా! పరాక్రమధురంధరులారా!

చ. పలువలు కొల్వుకూటమునఁ ♦ బల్లఱు వుద్దెగఁగూసి చీరల
న్నొలిచినవేళ నైన; గహ ♦ నోత్కరసీమలఁ గూఢవాసము
న్నలిపిన యప్పుడైనఁ; బర ♦ నారికి దాసిగ నున్నవేళ; లో
పలఁ బడనైతి నింతవ్యథ; ♦ బట్టవశంబె తనూజ శోకముల్

కళా—దేవీ! పరామర్శము జేసినకొలఁది దుఃఖము పొక్కుచుండును. ఊరడిల్లు మూరడిల్లుము.

ద్రౌ—హా! దైవమా!

ఉ. ఏలకుమార రత్నముల ♦ నిచ్చితివేటికి వారి స్వల్పపుం
గాలముములోనఁ గీర్తిగల ♦ క్షాత్రరమాద్యులఁ జేసి నాపుః పాం
చాలిని గర్భశోకమను ♦ సాగరముం బడఁద్రోయు కంటె గొ
డ్రాలినిఁ జేయ మేలనిర ♦ వంత తలంపవుగాదె దైవమా!

నాథా! శిబిరములోని వారంద జేమయిరి?

అర్జు—వట్టిదానా! శిబిరమంతయుఁ బీనుఁగుల పెంటయై యున్నది. పరిజన మాతంగ తురంగముల నన్నింటిని ద్రోణాయని తన పొట్టఁబెట్టి కొన్నాఁడఁట. నీసోదరుఁడు ధృష్టద్యుమ్నుఁడు నికృష్టమరణ మొందెనఁట.

కళా—అన్నా! అట్లైనచో నీవార్తను మీ రెట్లెఱింగితిరి?

అర్జు—అమ్మాయీ! ఆశిబిరమునుండి మెల్లఁగఁ దప్పించికొనివచ్చిన తొంబదియేండ్ల తొక్కముసలిభటుఁ డొకఁడు మాకెఱింగించి నాఁడు.

ద్రౌ—నాథా! ఈవార్త యబద్ధముగారాదా!

అర్జు—దేవీ! వెఱ్ఱిదానవుగాని, చావువార్త లబద్ధములగునా? పాంచాలురు సజీవులై యుండిరేని నీపాటి కిక్కడకు రాకుందురా?

ద్రౌ—అక్కటకటా! ఎట్టిగతి పట్టినది.

చ. జనకుఁడు చచ్చినందున వి॰చారముచేతఁ గృశించిపోవనా
అనుజుని ఘోరమా మరణ॰మాత్మఁదలంచుచు జాలిఁగుంద నా
తనయులు నేలఁ గూ॰లిరని॰తాల్మిచెడ న్నెలుగెత్తి యేడ్వనా
వనఁటలఁ గుట్టఁగాఁ బడిన॰వంతల బొంత నికెట్లు నిల్చెదఁ.

కళా—అన్నా ఈవార్త కృష్ణ ధర్మరాజాదులకుఁ దెలియలేదు కాఁబోలు నేమి?

అర్జు—దేవీ! తెలియకేమి. మాకందఱ కొక్కసారియే పిట్ట పిడుగు వంటి విశేషము తెలిసినది. శ్రీకృష్ణధర్మరాజాదులు గూడ ద్రౌపది నూరడించుటకై యిచ్చటకే వచ్చుచున్నారు. నేను వారికంటె ముందుగ వచ్చితిని. ఇదె వారుఁగూడ వచ్చినారు.

కళా—దేవీ! నేనంతిపురమునకుఁ బోయి సత్యభామాదుల కీవార్త నెఱింగించెదను. (నిష్క్రమించును.)

## పంచమాంకము.

[ప్రవేశము—ధర్మరాజ భీమ నకుల సహదేవులును గృష్ణుఁడును.]

ద్రౌ—హా! ధర్మరాజా! ఈగర్భశోకము నే నెట్లు భరింతును? ప్రాణేశ్వరా! ఇఁకనాపై నాస విడువుము. హా! కుమారులారా! హా! జనక! హా సోదరా! (అని గొల్లున నేడ్చుచున్నది)

ధర్మ—దేవీ! ఊరడిల్లు. హా కుమార రత్నములారా!

ఉ. ఉక్కువులైన శాత్రవుల నుక్కడఁగించి రాజ్యమెల్ల జే
జిక్కినదంచు సంతసముఁ జెందితిఁ గాని యొకించుకైన మా
కక్కఱలేదు పొమ్మనుచు నంతయు మాకిడిలేచి పోతిరే
చొక్కపుఁ గల్మికల్గు నిలు సూనులు లేమిని శూన్యమై చనున్.

భీ—ఒరోరి! ద్రోణపుత్రా! చూడు మిప్పుడు నిన్ను నాగదకు బలి చేసి వేసెదను. ద్రోవదీ!

ఉ. అంతములేని దుఃఖమిది యాఁగక తీవ్రకొలంది పొంగు; సీ
మంతిని! మున్నఁగాదె యభిమన్యుఁడు కీర్తివిశేషుఁడయ్యె లో
నంతగఁ గుందుచుండెదవె ప్రాజ్ఞవుగావొకో! నేను ద్రోణినిం
బంతము మీఱఁ బట్టెదను మానుషముం గానుడి పొల్లువోయెనే.

నకు—పావనీ! ఊరడిల్లుము. నేనొక్కఁడనె పోయి యాముష్కరుని బరిమార్చి వచ్చెదను.

సహ—పాంచాలీ! నీకింత వెఱ్ఱియేల. చూడుము. నీకసి దీఱునట్లుగ నాచెనఁటి బాఁపనయ్యను నీకడకీడ్చుకొని వచ్చెదను. దేవీ! ఊరడిల్లుము.

కృష్ణ—దేవీ! విచారమంతయు నాదికాని నీయదికాదు. ఊరడిల్లుము దేవీ!

ధర్మ—దేవీ! విచారించుటవలన నింతయులాభము లేదు. (తలపంకించి) కాని—.

ఉ. ఎవ్వని కెవ్వ డేమి ఘటి•యిల్లునొ యెవ్వఁ డెఱుంగనేర్చు నే
నవ్విధి శత్రుకోటిఁ దెగ•టార్చి జయంబునుఁ గాంచ ద్రౌణి తా
నవ్వల మత్కుమారులను• నాఁచికొనెంగద ! ఏమిచేతు హా
యవ్వ ! విచారమేల నిఁకఁ• జాలును నీకును నాకు జన్మముల్.

ద్రౌ—హా ! ముద్దుబిడ్డలార ! ఆమాయ యుద్ధమేల సంభవించినది తండ్రులార !

ధర్మ—పావనీ ! ఒకటిమాత్రము రూఢిగఁ దెలిసినది ఏమందువా ?

తే. గీ. సకలబంధులఁ గోల్పడి•సర్వమిత్ర
నాశనముఁజూచి యనుఁగు నం•దనులఁ గూడఁ
జంపికొని పొందెడి జయము•సంగరమునఁ
దోఁచెడుబరాజయముతోడఁ•దుల్య మబల !

(అనికంటఁదడిపెట్టుకొని తుడుచుకొనును.)

కృష్ణు—బావా! నీకుఁగూడ నింతవెఱ్ఱియేల? చావుచావని చెప్పుట యే. గాని ప్రపంచములో నిజముగఁ జావున్నదా? ఆత్మరూపాంతర మొందుటయే చావనంబడును. దాని కింతవిచారమేల. ఊర డిల్లుఁ దూరడిల్లుడు.

ద్రౌ—హా ! కుమారులార !

చ. అరుదగు విక్రమాఢ్యులు జి•రాయువులౌదురు ; తల్లిదండ్రుల
న్గరము సుఖంబుఁదేల్తు రని•నమ్మఁగ జోశ్యులు పల్కి రార ! దు
స్తరమగు గర్భశోకమును•సద్గతి హీనత మాకుఁ గల్గఁగా
గురుసుతుఁడేచిమిమ్మునిల•గూల్చె డునంచు నెఱుంగఁ డొక్కఁడున్ ?

అక్కటా ! మాయభాగ్యమిట్లుండఁ గార్తాంతికుల నన్న లాభమేమి?

కృష్ణు—అమ్మా! ద్రౌపది! జోశ్యముఁ జెప్పిననేమి చెప్పకున్ననేమి? కానున్నది కాకమానదుకదా !

ద్రౌ—అక్కటకటా ! కుమారులార ! చిట్టచివరకు దిక్కుమాలిన చావుఁజచ్చితిరా ?

చ. పరమపతివ్రతాఢ్య యగు♦పావని ద్రోవదికన్న తల్లిగా
వరరిపుగర్వనాశకులు♦పాండవు లేగురుతండ్రు లుండఁగా
సురల కజేయు లైన మధు♦సూదనుఁ డంతటి మేటి మామగా
బరఁగినమీరు పాల్పడిరె! ♦ పాటుఁ ద్రోనర్చినచిత్రహింసకున్.

కృ—తల్లీ ! ద్రౌపతీ ! ఎందఱున్న నేమి ప్రయోజనము ? కాలాను సారంబు... ...వించు దానినెవ్వరైన మాన్పఁగలరా ? ఇంతే కుమారికాయువు మూఁడినది. మనమేమి చేయఁగలము ?

ద్రౌ—మాధవా ... ...జమాడిన నిష్ఠురముగాని నీవే నాకీ గర్భశోకముఁ దెచ్చితివి.

ఏమందువా ?

ఉ. ఎయ్యెడ ద్వారకానగర?♦మెయ్యెడ? ద్రోవది కేక వేయఁగా
జయ్యనఁ ...క లీయఁ గల♦శక్తి గలాడవు మేనయల్లురకు
గుయ్యెడఁ గావవైతి వది♦కూరిమిచుట్టమె ! వారు గార్దోకో ?
అయ్యయొ వారిఁగూడ నిటు♦నైనను నుంచక పోతి వచ్యుతా?

కృ—ద్రోవతీ ! అట్లనరాదు. అర్ధరాత్రివేళ నశ్వత్థామయిట్లొనర్చునని యెవ్వఁడెఱుంగును ? అంతమాత్ర మెఱింగి యుంటినేని పాంచాలురను గూడ నేనిచ్చటకు వెంటబెట్టుకొని రాక యుందునా ?

ద్రౌ—యదునందనా ! ఏలబొంకెదవు ? పాండవుల నేగురిని మాత్ర మిచ్చటకుఁ గొనితెచ్చుటలో నీయభిప్రాయమేమి ? ఇట్టిఘోరహింస జరుగునని తెలిసియా తెలియకయా ?

## ప్రసన్న పాంచాలీయనాటకము.

కృష్ణ—(స్వగతము). చివరకు ద్రౌపదికూడ నా తాళము గట్టిగ పట్టి నది. ఈమె చెప్పునది నిజమే కాని ఆసంగతి నిజమేయంటి నేని నన్నాచంద్రతారార్కము మాడిపోసుకొందురు. (ప్రకాశముగా) అమ్మా! ఆమాట లిప్పుడప్రస్తుతములుసుమీ?—

ద్రౌ—నారాయణా! నిన్ను మాయల మారికృష్ణుఁడని యెందరనుకొన్నను నమ్మనైతిని కాని నీవు సుమ్మాటికి మాయల మారివే నోయీ! ఏమందువా!

చ. కృపికొడుకిట్లు లందఱి నికృష్టముగా వధియించుట గాంచి
నిర్వృపులముగా నెఱింగియును వెన్నుడ! తల్పకపోతివి యింతయుఁ
గృపయును లేదె! పాండవులు కట్టినవారలె! నీకు నెన్నఁడే
యపకృతిఁ జేయరైరి కద! యన్యులఁ బోలె నుపేక్షఁ జేసితే?

నందనందనా! వేయేల! మొదటినుండియు నీవల్లనే పరాభూతి మూఁడినది. ఏవిధమునఁ జూచినను పాండవులకు నీవలన కాని మేలుకంటె నపకారమునే యెక్కువగ జేసితివి. [illegible]!

ద్రోణనందనా! నీకైన నామీఁదఁ దయలేకపోయెనా?

చ. పలువుర మోసపుచ్చు మురవైరికిఁ జెల్లినఁ జెల్లుఁగాక, నీ
కులమును శీలముంగనక కుత్సితభంగి నిశీథవేళయం
దలఁతివలెన్ని కేతనమునందునఁ జొచ్చి యటన్ శుభాశుభం
బు లెఱుఁగనట్టివారిఁ బొలివుచ్చఁగఁ జేయుటలాడె ద్రోణజా!

(సక్రోధయై) ఓరీ! పుత్రఘాతీ! దుర్మతీ!

చ. పగలింట వెల్గు సూర్యుఁడన ఫల్గుణుఁడేచి ప్రకాండజాలముం
బగతురరూపుమాపునెడ; మత్తగజంబునుఁ బోలె భీముఁడే
పుగ గదఁబట్టి త్రిప్పుచు రిపుప్రకరంబులఁ గూల్చువేళ నీ
మగతనమేమి యయ్యె! నిధిమానుషవృత్తియె బ్రాహ్మణాధమా!

తే. గీ. అటులఁ జేయకుంటివయేనిఁ బ్రాణనాథ
ప్రబల గర్భశోకభరముఁ బట్టలేక
నమ్మ మింత ప్రాయోపవేశమ్ముఁ జేతు
వేగఁ బ్రియురాలిపై నాస విడువు మిఁకను.

భీ—(విజృంభించి లేచి) సాధ్వీ! ఇంతయు మొట్టమొదట నే చెప్పియుంటి వేని నేనీపాటి కావీర్య విహీనుని ఱెక్కలవిఱిచి కట్టికొనివచ్చి నీకడఁ బడవైచి యుందునుగదా!

శా. అశ్వత్థామ హరించినట్టి వరపుత్రా నీకముం దెచ్చి ని
న్నాశ్వాసింపఁగలేను కాని దురితాహంకారుఁడా దుర్మతి
న్విశ్వంబు ల్పదునాల్గు బిట్టదరఁ గావేఁ దెచ్చి నీయార్తిని
న్విశ్వత్సద్గుణధన్య! తీర్చెదఁ ద్రుటిన్సంతోషముం జెందవే.

ప్రియురాలా! ఇదిగో నాప్రతిజ్ఞను వినుము.

మ. తరుణీ! యబ్ధుల నింకఁ జేసియొ; మహీంద్రాత్మాళిఁ గావించియో
వరశైలంబులఁ గూల్చియో కినుకమైఁ బాతాళముం ద్రవ్వియో
సురలోకంబునఁ జిచ్చుఁ బెట్టియొ మునిస్తోమంబు స్రుక్కించియో
దురితో ద్రగుఁడు ద్రౌణిఁ బట్టెదను చేతో మోదముం బొందుమీ?

(అని గదఁ ద్రిప్పుచు రభసంబుగఁ బోవుచున్నాఁడు)—

ద్రౌ—వృకోదరా! ప్రాణేశ్వరా! ఇదిగో [illegible] యుంచుకొనుము. గురుపుత్రుని సజీవునిగ నామ్రోలకు దేవలయుఁ జుమీ?

భీ—మనోనాయికా! అటులే కావింతునులే అన్నయ్యా! ఆజ్ఞనిడినచో నేఁ బోయి వచ్చెదను. తమ్ములారా! మీరచ్చటనే యుండుఁడు.

ధర్మ—అటులే కానిమ్ము భీమసేనా!

భీ—భాగ్యము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ద్రౌ—నాథా! పోయినవారు పోయిరని యూరకొనక యిప్పు డశ్వత్థామను బట్టి తెమ్మని నేనీ భీమసేను నేల నియోగించితిని? అయ్యో! ఏమివాటిల్లునో కదా! మన కాలమహిమ మేమియో కాని త్రాసుసర్వమై కలుచుచున్నది. అర్జునా! వృకోదరునకు నీవుఁ గూడ సహాయమొసంగుట మేలని తోఁచుచున్నది.

అర్జు—సాధ్వి! అశ్వత్థామను బట్టి తెచ్చుటకు భీమన్నయ్య యొక్కఁడు చాలఁడా?

ద్రౌ—యదునందనా! మానముఁ దాల్చి యూరకొనక యిప్పుడైనఁ జరుగఁబోవు సంగతిఁ దెలియఁ బల్కుము. మొదటనుండియు నిన్నే నమ్మితిమి సుమీ?

కృష్ణు—(తలయూచి) యూరకొనును.

(నేపథ్యమున.)

భీ—ఓరోరి! కృతఘ్నా! దుర్మతీ! అశ్వత్థామ. ఇప్పు డెచ్చటికిఁ బోయెదవురా మూర్ఖా!

[అంత భీమాశ్వత్థాములు ప్రవేశించుచున్నారు.]

భీ—ఉ. ఓరి దయావిహీనమతి! యోరి మహాదురితోగ్రకర్మ! యోరోరి! దురాగ్రహోన్నతుఁడ! యోరి మదోద్ధత! కండకావరంబా? రవికోటి తేజులగు బాలురఁ బట్టి వధించినావు నిష్కారణ; మిప్డు నిన్ను చటఁ గండలుగాఁ దెగఁ గోతుఁ జూడరా! ఇన్సీ! ఆ ద్రౌపది నిన్నుఁ దనయెదుట కీడ్చుకొని రమ్మని చెప్పకుండినచో నిన్నీపాటికి జముని యింట బాఁతకాఁపుగ జేసియుండనా?

అశ్వ—ఛీ! మూర్ఖా! దూరముగ నుండుము! ఛీ! వాచాట! ప్రేలకుము. అధికప్రసంగముఁ జేసెదవేని నీప్రాణము గూడ దక్కదనుకొను. దుర్యోధనుఁ డిప్పుడు పరలోక నివాసుఁడై

చ. రయముగఁ బార్థునందు బహి♦రంగముగా గురుఁగూల్చి నప్పుడే
మయితివి ద్రోహి! పంద! యిపు♦డాపసిబిడ్డలఁ జంప రాతిరిం
బయలుకు వచ్చినావె యిది♦బంటుతనంబొ కొయింతలోననే
జయము లభించె నంచుఁ బెగ♦సాఁగకు మోరి వృథాప్రగల్భుఁడా!

అశ్వ—ఛీ! మూఢా! తపోనిష్ఠా గరిష్ఠులమగు మాబోంట్ల బ్రాహ్మణోత్తముల మాహాత్మ్య మెఱుంగక కాఱులఁ బ్రేలెదవుగా? నాశాపమునం జెడక యూరకుండుమురా శుంఠా!

భీ—ఓహో హో హో! ఏమి నీమాహాత్మ్యము. జంతుహింసమానని యఘమాధవుఁడు వ్యాఘ్ర్యయమును బాగుగఁ జేయునురో! పలుగాకి!

చ. కలుషము లెన్ని యైన నిలిపి♦కన్నుల మూసి జపంబు సల్పినం
దొలఁగునె పాపము లేయును? ♦ మత్సర గర్వ విషాద వహ్నులన్
వెలుఁగెడి యన్నిసింహముఁ గడ♦ నేర్చు సతీమణి యూర్పు నెచ్చ గా
ద్పులు నినుఁ దాఁకి వేగఁ బొలి♦పొచ్చెనె? యూరకుండురా కుండునే?

(అని నరోత్తముఁ డశ్వత్థామపైకిఁ బోవుచున్నాఁడు.)

ద్రౌ—(భీముని నాఁపి) మనోహరా! నీవిటుఁ గూర్చుండుము. (ద్రోణి వైపుఁ జూచి) నాయనా! ద్రోణనందనా! ఏమిటింత్రి! చిట్టచివరకు మామీఁద నీకుఁ దయతప్పి పోయిన దేమి తండ్రీ!

చ. పెనుకువ నారితేజి రే! పరి♦వీఁకుల మూర్చపడ! ముక్కుపచ్చలా
రని పసికుఱ్ఱవాండ్రఁగద!♦రాత్రి నిరాయుధులై సుషుప్తిచేఁ
దనువు లెఱుంగకున్నపుడ♦ధాత్రిగ జాలియుమాలి నీవు మ
త్తనయులఁ జంపఁగాఁ దగునె!♦ధారుణిదేవున కింత చెల్లునే?

అశ్వ—అమ్మా! పాంచాలి! ఊరడిల్లు మూరడిల్లుము. గతించినదానికిఁ జింతిల్లుటేమి లాభము?

ద్రౌ—కుమారా! ద్రోణాయనీ! పాండవుల మాట యటుండనిమ్ము. నాగారాబు కొమరులు నీకేమిచేసిరి తండ్రీ?

మ. ధనువో ఖడ్గమొ చేతఁ బట్టికొని పైఁ దండెత్తఁగా రారు; ని
న్ననికి బ్రమ్మని కాలుఁ దువ్వరో; కదోర్గ్రహం బెప్పుడు జ్జేయరే
మనసున్నీయెడ స్పర్థఁ జెందరు; నినున్నన్నింతురెల్లప్డు నా
తనయుల్ ద్రోణజ! పిన్నపాపలను నిద్రిం జంపఁగా వచ్చునే?

అశ్వ—అమ్మా! తిరిగి తిరిగి నన్నిట్లేల దెప్పిపొడిచెదవు? నీభర్తయగు ధర్మరాజు వాక్యమును నమ్మి కుమారుఁడు చచ్చెనని తలంచి యస్త్రశస్త్రముల నావలనఁ బడవైచి మిన్నకున్న. నాతండ్రి యోగనిద్రలో బడి యుండలేదా? పోనిమ్ము; నాతండ్రి నీభర్తలకేమి యుపకార మొనర్చెను తల్లీ?

ద్రౌ—గురుపుత్రా! ఏదియెట్లున్న నిట్టి యక్రమమునకు నీవేల యొడిగట్టికొంటివి తండ్రీ!

తే. గీ. ధ్యాననిష్ఠాతపోగరిష్ఠానుభూతి
వెలయఁజేసెడు మొదలింటికాలమునందె
పాపకర్మము లరుపఁగాఁ బడినయెడల
తక్కువెక్కువ లనెడి భేదంబు లున్నె!

అశ్వ—అమ్మా! ద్రోవదీ! ఆనాఁడు నాతండ్రినిఁ గొంతుఁ గోసిన విధమును నీభర్త గదాయుద్ధమున దుర్యోధనుని తొడలు తెగగొట్టి శిరముపైఁ దన్నుటయును క్రమములే యనుకొనినప్పుడు నాఁజేసిన యీకార్య మేల క్రమముకాదో? మాబోఁటి పేదబాఁపనయ్యలనుఁ బాలించుటకై పుట్టి సకలధర్మముల నెఱింగిన రాజులే యిట్టి యకార్యము లొనరించినప్పు డీఁక మొదటికాలమువారికి దిక్కెవరు తల్లీ?

ద్రౌ—నాయనా! నీహృదయమును నీవలె చంపికొంటివి తండ్రీ!

తే. గీ. అన్వవాయము వీరితో నణఁగిపోవు
సుతులు లేకున్నవారికి గతులు లేవు
తగదు నాకిది యనుచు లోఁ దలఁచితైన
పుత్రభిక్షము పెట్టక పోతి వన్న!

అశ్వ—తల్లీ! అది వేరుసంగతి. పాండవులు నిర్దయులై మమ్ముఁ గారించుచుండ మేము దయాపరులమై యుండవలసినదని యా నీయభిప్రాయము? అట్లయినచోఁ బాండవులకడ మేము నిర్దయాపాతకత్వమును మానవలసి వారు దయాపరత్వమును నింతటినుండి నేర్చుకొనవలసినదే సుమీ!

ద్రౌ—అకటా! ద్రౌణాయనీ! నీయింటనున్న ద్రోణకుటుంబిని యగు నీతల్లి యిప్పు డేమిచేయుచున్నదో తలంచుకొనుము నాయనా!

చ. కటకట! పుత్రశోకమునఁ గంటికి మంటికి నేకధారగా
నిటుఁబడి యేడ్చునా పతిసహాయవిహీనయై నినుఁ గన్నతల్లి యు
చ్చటఁబడి యావురించును వికారవిషణ్ణత నేడ్చుచుండదే?
ఇటు కల భీమసేనుఁ డతిహేయముగా నిను నీడ్చి తెచ్చుటన్.

అశ్వ—అమ్మా! అట్టిప్రసన్నత యిప్పుడుగదా నీకుఁ దోఁచినది! ద్రోణుని నీపతులు చంపినారని విని ద్రోణకుటుంబిని యెంత యేడ్చినదో నీ వెఱుంగుదువా? ద్రౌపదీ! ఎట్టులైన నీప్రసన్నత కేను మెచ్చితిని. ఇంతకు మీకృష్ణుఁడు గట్టిపట్టు గావున నెట్లో యధర్మములైనఁ జెల్లినవి. అమ్మా ఇప్పుడు నన్నెవ్వరును బట్టుకొనలేదు. నాకు నేన నిన్నుఁ బరామర్శింప వచ్చితిని.

ద్రౌ. -ఓ ప్రాణేశ్వరులారా! చాలుఁ జాలు. ఇతఁడు మన కందఱకు బాగుగ బుద్ధిచెప్పినాఁడు. ఒకరివలన మీరెట్లు జేయించు కొనఁ దలంతురో మీరును నితరుల కట్లే చేయవలయును సుఁడి?

మ. తనప్రాణేశ్వరుఁ డాలమందు బడిన న్ధైర్యంబుతో నెట్టిటో
తనయుం డితనిఁ దిక్కుగాఁ దలఁచి వైధవ్యంబు సైరించుచున్
మను ద్రోణాయనితల్లి యెంతయును నాత్మం గుందు పోనిందు పాం
డునృపాలాత్మజులార! కానియెడ మూఢున్బ్రహ్మహత్యాఘమున్

గర్భశోకము నే ననుభవించుచుంటిని చాలదా యేమి! నావలె ద్రోణకుటుంబినికూడ నేల యేడ్వవలె? గర్భశోకము శత్రువులకైననుఁ దలంపఁగూడదు.

తే. గీ. ఉవిదయుసపత్ని యెటులైన నోర్వఁగలుగు
కన్నకొడుకుల ప్రాజ్ఞులైయున్న వైచు
నహివులందున నగచాట్లఁ బడునుగాని
లేమ గర్భశోకము సైఁప లేదు సుండి.

కాఁబట్టి కౌంతేయులారా! వీనిజోలికి బోక వెంటనే వీనిని విడిచి పెట్టుఁడు. మీకు నమస్కరించుచున్నాను.

అశ్వ—అమ్మా! పాంచాలి! ఇటు వినుము. ఇప్పుడు నే నెవరి కట్టడిలోనైన నుంటినని కొంటివి కాఁబోలును. వెఱ్ఱిదానా! న న్నీపృథివిలోఁ దేటిచూచుటకైన సమర్థుఁ డొక్కఁడును లేఁడుసుమీ! అట్టివాని నైన నన్నుఁగూర్చి నీపతులను నీ వంతగ దీనముతో వేఁడుకొననక్కఱలేదు. ఊరకొనుము.

కృష్ణ—ఓరోరి బ్రాహ్మణాధమా! పుత్రహంతవ్య! ఏమిరా నీయాత తాయితనము! ద్రౌపదియు నీవును సంభాషించుచు మధ్య

నామాట నెందు కెత్తెదవురా? శుంఠా? ప్రపంచమునం
దందఱు నాకు సమానప్రియులని యెఱుంగవు కాబోలునేమి?
కృష్ణుఁడు నీకు గట్టిపట్టని ద్రౌపదిని దెప్పుచున్నావుగా? పాండ
వులకు నేఁ జేసిన దేమున్నదిరా పుత్రఘాతుకా!

అశ్వ — ఓరోరి వాచాటా! నీవు జేసిన దుర్మార్గమంతయు నీముఖము
ముందఱనే చెప్పెద వినుము.

సీ. మినువాఁక కొమరునిం ♦ బిలుకుమార్చఁగ నుది
నెంచి శిఖండి గ ♦ ల్పించినావు
అనిద్రోణుఁ దునుమాడ ♦ యమనందనుని చేత
నెలమి నబద్ధ మా ♦ డించినావు
సూతసూతినిఁ జంపఁ జేరఁ ♦ బూని శాపకా
రణ మంచు రథనేమి ♦ నణచినావు
అనిసేయనని నమ్మ ♦ కను నిచ్చి పాక్షిక
బుద్ధి చేఁ జక్రింబుఁ ♦ బూనినావు
అల గదాయుద్ధమున నీవ ♦ యుక్రమ మొన
రించి కురురాజుతొడలఁ గొ ♦ ట్టించినావు
అఖిల పాంచాలురన నీవ ♦ యూఁచినావు
నాశనముఁ జేసితివి రెండు ♦ వంశములను.

కావున ఓరోరి పసులకాపరీ! ఇంతటితో నైన నీదాఁని నీవు పోశ తగు
దునమ్మాయని నన్నదలింప వచ్చితివా?

కృష్ణ — ఓరోరి దుర్మతీ! తెగనాఁగకుము. సకలశత్రుగర్వాపహార
నిర్వక్రంబగుచక్రం బిదిగో చూడుము మూఢా!

అశ్వ — ఓహోహో! నీచక్రము గిక్రము నన్నేమిచేయఁ గలదు?
దానిని నీయిల్లాలి కిమ్ము. అన్నము వార్చుకొనెడి యుత్తడి

సిబ్బిగ నుపయోగించుకొనును. ఇట్టి పటాటోపము లింక చాలింపుము.

సీ. దరిదీసి పాలిచ్చు♦దానిజంపుట గాదు
పాలిపుచ్చుటకు నాల♦పోతుగాదు
కొయ్యతోలును నీడ్చి♦కొనిపోవుటయుఁ గాదు
కై నెత్తుటకు జాతి♦గట్టుగాదు
మిన్నంది బెదరింప♦మేనమామయుగాఁడు
బతిమాలుకొన సత్య♦భామగాదు
కట్టితో మళ్లింప♦గంగిగోవులు గావు
కాఁజేయు వెన్నమీఁ♦గడలు కావు

గీ. మేలమాడఁగ గోపభా♦మినులు గారు
యిలను రక్షింప నవతార♦మెత్తి యిపుడు
జనుల గికురింప సాఁగిన♦నిను వధింప
దివిఁ త్రీవావతార మె♦త్తితిని నేను

కృష్ణు—ఓహో పాండవులారా! మంత్రసానిగండ మెక్కడ నుండ దుగదా! మీరందఱుఁ గూడి యీబ్రాహ్మణాధమునిచేత నన్ను మాట లనిపించుచుంటిరా?

భీమ—(సక్రోధుఁడై) ద్రౌపది కేమి తెలుసును? ద్రౌపదిగడుసుదికాదు

చ. బుడబుడధీర్ఘమే యిడును♦పుత్రులఁ జంపినవాఁడు వీనిపైఁ
బడయుదు కోప మింతయును;♦పాపము వెట్టిది పుత్రఘాతుకున్
విడువుఁ డటంచు నందఱిని♦వేఁడుచునున్నది నేను వీని నా
పిడికిఁటి పోటుఁగూల్తు నిఁక♦వీడను బ్రాహ్మణుఁడైన లెక్కయే!

మీరంద ఱితని విడిచినను నేనుమాత్రము విడుచువాఁడను గాను

సుమీ! ఓరోరి మూర్ఖా! నేనొక్కఁడ నీపైఁబడి నీయనుసులులం దీసెదను చూడరా! ఇప్పుడు నీవెట్లు దప్పించుకొని పోదువు?

(పాండవు లశ్వత్థామపైకి లేచుచున్నారు.)

ద్రౌ—నాథా! పాండవులైన దక్కి రి గదా యని సంతసిల్లక ఇతనితో వివాదము మన కేటికి?

ధర్మ—చూచితివా పాంచాలీ! పుత్రనునికడ సజ్జనప్రసన్నత యెట్లు పరిణమించుచున్నదో?

ద్రౌ—నాథా! చేసికొన్నదాని ననుభవింపక తీరునా?

అశ్వ—ఓరోరి గర్వాంధులారా!

శా. నానాస్త్రాభ్యసనుండు కుంభభవుఁడే♦నాతండ్రియౌ యైనచో నేనే కౌరవనాథుఁ గూర్చితివ యే♦ని న్నాయిషీకంబె లో కానీకంబుల నెల్ల గాల్చి యనివా♦ర్యంబై మహిం బాండుసం తానం బేయెడ లేక యుండునటుల♦న్నాశంబుఁ గావించుతన్.

ఓయిషీకమా! నీవే బ్రహ్మశిరోనామకాస్త్రవై యపాండవముఁ గావింపుము. పొమ్ము (అని యిషీకమునుఁ బారవైచుచున్నాఁడు.)

కృష్ణ—(సరభసముగా) ఓఅర్జునా! అర్జునా! చూచుచు నూరకొనెద వేమి? అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రముఁ బ్రయోగించి నాఁడు. ఇయ్యది అన్యాస్త్రములవలన సంహరింపఁ బడునది గాదు. నీవును దానినే ప్రయోగించి నిన్నును నీసోదరులను సంరక్షించుకొనుము. సంరక్షించుకొనుము.

అర్జు.

శా. నేనే సద్గుణధన్యమైన యలకుం♦తీపుత్రునై తేని నే నే నిశ్చంచలభక్తి నగ్రజుని నెం♦తేఁ గొల్చుభ్రాతుండ నై తేని న్నమ్ముల ద్రోణిని న్విడిచి నా♦యీయాయ స్త్రిమయ్యస్త్రముఁ హానిం జేయఁగనీక వేగ ముపసం♦హారంబుఁ గావించుతన్.

కృతుణమా! నీవే బ్రహ్మశిరోనామకాస్త్రమవై అశ్వత్థామ ప్రయోగించిన యస్త్రమును వేగ మార్చివైచి నన్నును నాసోదరులను గురుపుత్రుఁడైన యశ్వత్థామనుఁ గాచి రక్షించుము. (అని త్రుణమును పారవైచుచున్నాఁడు.)

(నేపథ్యమున)

ప్రళయోజ్జృంభితోజ్జ్వలనజ్వాలాభీలమై నీరేడులోకంబుల దహించుచున్న యీయస్త్ర హెచ్చుత్ర మెక్కడిది. సప్తసముద్రములును ఘూర్ణిలుచుండుటకుఁ గారణమేమియో కదా! పాషాణవర్షము గురియుచుండె. రోదసీకుహరమెల్లను తాఁకుమా ఉగుచున్నది. ఏమి వాటిల్లునో కదా! ఎట్లో కదా!

[అంత సాత్యవతేయుఁడును నారదుఁడును ప్రవేశించుచున్నారు.]

ధర్మ—ఏమి! మాపుణ్యము.

సీ. గంగానదీపూత • ఘనజటాభారంబు
చిగురాకు కెంజాయఁ • జిమ్ముచుండ
తెలినిగ్గు వెదచల్లు • వెలిమిడి మైపూఁత
నిండుచందురుని వె • న్నెలలు గాయ
జాలైన రుద్రాక్ష • మాలిక ల్హస్తాబ్జ
ములఁ దేంట్లు నెరుసలై • మెలఁగుచుండ
నమితదయావృష్టి • నలరారు చూపులు
చిరతపోవనసంబుఁ • [illegible]చుండ
పతివిహీనల పాలింటి • [illegible]
భరతవంశంబు నిల్పిన • [illegible]
మునుల తలకట్టువచ్చె మా • [illegible]మోల కెలవి
దివిజపురినుండి సాత్యవ • తేయుఁ డహహా.

సాత్య—వత్సలారా! అభీష్టప్రాప్తిరస్తు.

ధర్మ—ఓహో హో! ఏమి పాండవసుకృతము!

తే. గీ. బ్రహ్మవాణికిం గన్న గారాబు కొడుకు
మహతిఁ గొనగోటమీటుచు మమ్ముఁ జూడ
వచ్చినాఁ డిపుడు మాభాగ్య వశముచేత
నౌర! పోరోగిరఁపుఁ దిండి నారదుండు

మునివర్యా! నమస్కారము. (అందఱు నమస్కరించుచున్నారు.)

నార—పాండవులారా! కుమారులారా! శుభప్రాప్తిరస్తు.

సాత్య—కుమారులారా! పురందరనందన ద్రోణనందను లిట్టి విద్రోహ ములనొనర్పవచ్చునా! ఈబ్రహ్మశిరోనామకాస్త్రమును మానవులపైఁ బ్రయోగింపవచ్చునని మీయొజ్జయగు ద్రోణుఁడు మీకుఁ జెప్పెనా! అంతఘోరయుద్ధము జరిగినప్పుడు సహిత మొకప్పుడైన ధనురాచార్యుఁ డయస్త్రమును మానవులపై ప్రయోగించలేదు సుండీ!

నార—(స్వగతము) కలహాశనుఁడనైన నాకు వీరికలహము క్రొత్త పిండివంటవలె మిక్కిలి రుచిఁ గొల్పుచునే యున్నది. అనుదిన మిట్టి విపరీత కలహములు ప్రపంచములో సంభవించుచుండినచో నాకుఁ బ్రతిదినమును సంతర్పణభోజనమే. కాని, వీర లొండొరు లేసిన యీక్రూరాస్త్రములు లోకముల నెల్లఁ బరశురామప్రీతిఁ గావించుచున్నవి. విశేషించి నన్నుగూడఁ గాల్చి వేయునేమో యని భయము గల్గుచున్నది. ఎవరైనఁ జగడములాడు చుండుటఁ జూచి సంతసిల్లుచుందునుగాని నాకే మొసగువచ్చిన మొదల నాకుఁ గలహము లింపుగ నుండునా! కాఁబట్టి వీని నిప్పటి కాఁపుట మంచిది. (ప్రకాశముగా) కుమారులారా!

మీ మీ యస్త్రముల నింక నివారింపుఁడు. బతిమాలుకొను చున్నారము.

అర్జు—మునీంద్రులారా! పాండునందనులకును గురునందనునకును నేవిధ మైన సంబాధము లేకుండునట్లు తలంచి యస్త్రము నస్త్రముచే శాంతిపఱచుటకే నస్త్రము నేసితినిగాని వేరొండుగాదు.

అశ్వ—జడదారులారా! నాకుఁ బాండవులు చేసిన ద్రోహము మీకుఁ గరతలామలకంబుగఁ దెలిసిన విషయమేకదా! యింక నాప్రియమిత్రుఁడగు దుర్యోధనునకు గదాయుద్ధమున భీమొన రించిన ఘోరయక్రమమును గూడ మిన్నునుండి కన్నులార మీరు చూచియుంటిరిగాన నేను వేరఁ జెప్పనక్కఱలేదు.

అర్జు—మహానీయులగు తాపసోత్తముల యభీష్టప్రకారమే మనుగావించు టకు సిద్ధముగ నున్నాను.

సాత్య—అట్లైనచో నీ యస్త్రము నీవు మగుడించుము.

నార—ద్రోణజా! అయిన దానిని మఱలఁ ద్రవ్వక నామాట విని నీయస్త్రముఁ గూడ నీవు నివారించుము.

అశ్వ—పరాశరనందనా! కలహాశనా! బ్రహ్మశిరోనామకాస్త్రము బ్రహ్మతేజోమయ మగుటంజేసి ప్రయోగింపఁబడిన తరువాత ననివార్యమగునుండీ!

సాత్య—ఆఖండలకుమారా! వ్రతశక్తియు గురుభక్తియు నీయందమితంబులుగ వఱలుచుండ నది నీకెంతపని?

అశ్వ—ఈయస్త్ర మనివార్యంబు; వారించినవారిని దహించక మానదు. ఇంతకు నశ్వత్థామ నాయస్త్రమును నేను శాంతిపఱచునందాఁక నూరకుండి తరువాత తాను గూడ నట్లు చేయునో లేదో. ఆభార మంతయు మీ మీఁదనే యుంచినాను. (అని ప్రార్థించి అస్త్రము నుపసంహరించుచున్నాఁడు.)

రాఁడు కద! (ప్రకాశముగా) భీమసేనా! తొందరపడకుము గురుపుత్రుఁడు పోవుచున్నాఁడు పోనిమ్ము! మఱల నతం డస్త్ర ముఁ బ్రయోగించెనా మాకొంప మునిఁగిపోవును.

భీము — మునిపుంగవుల ధైర్య మిట్టిదియే కదా? (అని పెదవుల విఱచు చున్నాఁడు.)

సాత్య — పాండవులారా! మీకన్నిటికి శ్రీకృష్ణుఁ డేయున్నవాఁడు. మే మిఁక దివిజలోకమున కేగెదము. (అని నారదసాత్యవతేయులు నిష్క్రమింతురు.)

[ప్రవేశము ఉత్తర.]

ఉ — హా! కృష్ణా! ద్వారకావాసా!

శా. అయ్యయ్యో! చిచ్చువెట్టె గిద్ది, మదిలో నాందోళనం బేదొ; నా కయ్యో! మనసు కాలుం బొడెను; న య్యయ్యో! ప్రాణమున్నిల్వ ద య్యయ్యో! పాలుపాలు బొబ్బలిడెనే న్నా! లోనిపిండంబు నే నయ్యయ్యో కిటులా సియు కకటా! దామోదరా! కావవే.

ధర్మ — ఏమిచిత్రము!

రా — (విషాదముతో) అమ్మా! ఉత్తర! సైరింపుము! సైరింపుము! అమ్మా! ఏమాయెను?

ఉ — అత్తగారు! నాకై నాసఁ బెట్టుకొనకుఁడు.

ఉ. దుర్భరమైన తాప మిది; తూలితి; నెందఱు వెజ్జులైన నా గర్భముఁ గావలే రయిరి; గాఢపుమంటలు వమ్ములయ్యె; నా కర్భకుఁడై నఁ గల్గునని యాత్మ దలంచి నిజేశదుఃఖసం దర్భము సైఁచియుంటిని; యు దారగుణంబున నన్నుఁ గావరే!

అర్జు — అయ్యో! ఈ మెయైన బ్రతికియుండక ప్రాణములు వీడునా యేమి?. పాపము శమించుఁగాత!

ఉ—ఓమురారీ! హా! చూచి యూరకొనెదవేమి!

తే. గీ. నీదుచెల్లెలికోడల•నీయనుంగు
సఖుఁ డెలకిరీటి నామాము•శౌరి! నీదు
మేనయల్లుని భార్యను•మేనిమంట
లార్చి చూల్నిల్పు సంబంధ•మరసినైన.

(నిట్టూర్పువిడిచి బాధనభినయించును) హా! శ్రీహరీ! నేనేమి యుంగని ముగ్ధను. ప్రాణసమానుఁడయిన యభిమన్యునిఁ గోలుపోయి యింట నొకమూలఁ గూర్చునియున్న నాకిట్టిబాధ సంభవించి నది తండ్రీ!

అర్జు—అబ్బా! ఎంతకష్ట మెంతకష్టము.

ఉ—హా! నందనందనా!

కం. పడలేని బాధను మే
న్గడగడవడఁకఁగఁ దొడంగెఁ•గంజదళాక్షా!
తడయక నే నీకాళ్ళం
బడితిని లేదిక మఱొక గ•ప్రాపు ముకుందా

తండ్రీ! పరమేశ్వరా! నేనువట్టి వ్యర్థురాలను,

తే. గీ. అత్తమామల నెంతయు•నుత్తిఁ గొలిచి
ధవుని దైవంబుకంటె నె•క్కువగఁ జూచి
నట్టిముగ్ధను పతి వియో•గార్తిఁ గుందిన
యట్టిదాస నాచూల్గావు•మయ్య! శౌరి!

కృ—ధర్మరాజా! చూచితివా! విచిత్రములలో నిదియొక్క గొప్ప విచిత్రము.

ధర్మ—బావా! ఇట్టిబాధకుఁ గారణమేదియైయుండునో కదా!

కృష్ణు—ఉఁ. (తలపంకించి) బావా! కారణము స్పష్టమేకదా! ఇది యంతయు బ్రహ్మశిరోనామకాస్త్ర మాహాత్మ్యము. దీనిని

వారించుట కిప్పుడు సమస్తశత్రురాజపరాక్రమాఖర్వగర్వ విధ్వస్తనిర్వక్రక్రమంబైన యీచక్రమేసమర్థము. అశ్వత్థామ యనసామాన్యుఁడుగాఁడు. అట్టి మహనీయుఁడీచక్రము నెత్తుటకైన నోపఁడు వలంతి గాకపోయెసుమీ యర్జునా!

అర్జు—అగునగును! కేవల మీశ్వరాంశసంభూతుఁడైన దామోదరు నిచే నున్నచక్రాయుధమును దేఱిచూచుటకైన నెవ్వఁడువలంతి?

కృష్ణ—పాండవేయులారా! ఇదిగో చక్రమును బ్రయోగించుచున్నాను.

శా. పారావారగభీరశౌర్యనిధి సౌభద్రేయ తేజోమయా
కారుం డుత్తర గర్భమందుఁ గలఁడే గర్భార్భకుం డేరీ దు
ర్వారబ్రహ్మశిరోంబకోజ్వలనవిధ్వస్తుండు గాకుండఁగా
సంరక్షించుచుఁ బాండవాన్వయ వినాశంబాఁపుమీ చక్రమా!

(అని చేనున్న చక్రముచే నుత్తర దేహముపైఁ జమురుచున్నాఁడు.)

ద్రౌ—అమ్మా! ఉత్తరా! నీబాధ యిప్పు డాకించుక యుపశమించిన ట్లున్నదే?

ఉ—మీకందఱకు వేనవేలు వందనములఁ జేయుచున్నాను. నాబాధ యంతయు నివారణ మైనది. (అని లేచి అందఱకును నమస్కరించుచున్నది.)

ధర్మ—ఏమి! ఈశ్రీకృష్ణుని మాహాత్మ్యము.

అర్జు—ఔరా! ఏమి! ఈచక్రప్రభావము.

ద్రౌ—ప్రాణేశ్వరులారా! ఇట్టి విపత్తులనుండి తన వారిని దప్పించుటకు మన శ్రీకృష్ణుఁడు పెట్టినది పేరుసుండీ!

ధర్మ—బావా! నీవగిదంకారక్రియ నెప్పుఁడు నేర్చితివి? మఱి నీచక్రము యువతులకు బురుడు పోయుట నెప్పుడు నేర్చికొన్నది? ఆహా! ఏమివినోదమోయీ!

మ. సుడిమై, గ్రంథవిహీనమై, వివిధసంసుజ్ఞానశూన్యంబునై !
బడుగై; మందులమూకలం గొననిదై వ్యాపారకాఠిన్యమై;
జడమై; శస్త్రచికిత్స లేనిదయి; నీ చక్రంబు చూల్గాంచె; నె
క్కుడుం గైకొన్నదొ! మంత్రసానితనముం గావించువిన్నాణముల్.

అర్జు — అన్నయా! శ్రీకృష్ణుండన నెవ్వరనుకొంటివి. సాక్షాచ్ఛ్రీమన్నా
రాయణుండే సుమీ! గీతావాక్యముల నాకుపదేశించుచుం
దన విశ్వరూపమును నాకు బ్రదర్శించినాఁడు.

ధర్మ — తమ్ముఁడా! [illegible]! అందుకు సందేహమేమి! (శ్రీకృష్ణుని
[illegible]

సీ. జతుగృహ [illegible] లిపినప్పుడు వహ్నిఁ
[illegible] ముమ్ముఁ గాపాడినావు
రారాజు విషమిడి గంగ [illegible]
[illegible] భీముఁ గాంచినావు
కొలువులోఁ గోకల నొలిపింపఁ బడినప్డు
ద్రోవది మానంబు బ్రోచినావు
గాంగేయునిం గురుం గర్ణునిం గెడపుచో
వెలలేని యుపకృతు లొలిపినావు
ఇపుడ విరటు చూల్బ్రాలు [illegible] పాండ
వాన్వయము నెలకొల్పినా వవనిపైని
మఱియు నెన్నియో విధముల మమ్ముఁగాచి
నావు; మఱతుమే నిన్ను స్వప్నముననైన

కృష్ణు — బావా! నన్నుఁ గొందఱు నిందించుచుందురుకదా!

ధర్మ — బావా! శత్రువులేమి స్నేహితులేమి అందఱు నిన్నెఱుంగని
వారు గారు సుమీ? ఏమందువా?

ప్రకృతి సంజ్ఞకమైన ప్రపంచమం..
నీయధర్మంబె నీధర్మనియతియగున
కాని, దోషంబు నీయందుఁ గలుగ
నిఖిలజగదీశ! జోహార్లు నీరజాక్ష!

కృష్ణ— పాండవులారా! మీరు నాకు నిజమైన భక్తులు నా[illegible]సిగపూం నాడక సుఖంబుంటయే నాకుఁ గావలసినది. శాంతిసంగతులతో నాకునిమిత్తము లేదు. మీకు రాజ్యము చేకూఁడినది. సర్వశత్రు వినాశమైనది. ఇఁకఁ గాంతేయాగ్రజుని బట్టాభిషిక్తునిం జేయుదము. ఈధర్మరాజు రాజ్యమం దిట్లగుఁగాక.—

సీ. ఏమహీస్థలియందు లేమియన్నది లేక
స్త్రీల నెన్నడుములఁ జెలఁగుఁగాత
కౌటిల్యమెక్కడఁ గ్గనఁబడరాకుండ
స్త్రీలమంగురులందె చెలఁగుఁగాత
చపలత్వ మెచ్చోట జనులందుఁ గనరాక
స్త్రీలవాల్చూపులఁ జెలఁగుగాత
జడిమంబు భూమిపైఁ బొడసూపకుండఁగ
స్త్రీల నెన్నడలందె చెలఁగుఁ గాత
పణ్యాలన్ననె తలనొప్పి వచ్చుగాత
నీతిగల మతమొక్కటే నెగడుఁగాత
తంత్రులమటిపించి ప్రజలఁ దండ్రుఁబోలె
ధర్మజుం డేలుకొనుఁగాత ధరణి నెల్ల

ధర్మ— బావా! మఱియు నిట్లగుఁగాక.—

ఉ. లీరగునానలం గలిగి తీయనిపాడియుఁ బంటయు న్సదా
చారము రాజభక్తిఁ గొని చాల సుఖంతురుగాక మానవుల్
నారసలోచన ల్గడుఁ బ్రసన్నత భర్తల నత్తమామలం
గేరిమిఁ బూజచేసి యిలఁ గేరుఁబ్రతిష్ఠయుఁ గాంచు గావుతన్.

కృష్ణ— తథాస్తు.

సమాప్తము.